Largest Circulated Telugu Monthly

# చతుర

అక్టోబర్ '97

రూ : 7/-

పట్టిసపు రాధామహలక్ష్మి

# కెరటాలు





# ఏరిన ముత్యాలు

★ కార్యశూరులు కన్నీరు కారుస్తూ కాలాన్ని వృధా చేయరు.

-తిలక్

★ విలువైన ఆలోచనలు వున్నవారు జీవితంలో ఎన్నటికీ ఒంటరివారు కారు.

-రూసో

★ మహనీయులకు ఆదర్శాలుంటాయి. ఇతరులకు కోరికలు ఉంటాయి.

-వాషింగ్టన్

★ కష్టాలలో వున్నానని, బలహీనుడనని, తాను ఏమీ సాధించలేదని, పగలూ, రాత్రి అనుకుంటూ వుండేమనిషి నిజంగా ఎందుకూ కొరగాడు.

-స్వామి వివేకానంద

★ ఆరోగ్యం పోయిన తరువాత గౌరవంగాని, ధనంగాని మరేదీ మనకు సంతోషాన్నియ్యలేవు. కాబట్టి ఆరోగ్యవంతునికున్న సంతోషం మరెవ్వరికి వుండదు.

-జాన్‌గో

★ ఒక రాజ్యమున వుండవలసిన కీర్తికీ, ప్రజలందరికీ వుండవలసిన సంతోషానికి పునాది ప్రజల ఆరోగ్యమే.

-డి. ఇజ్రాయిల్

★ పుస్తకాలు అలంకరణ కోసం వ్రాయబడలేదు. కాని పుస్తకాలంత అందంగా ఇంటిని అలంకరించే సామాగ్రి మరొకటిలేదు.

-హెన్నీబీచర్

★ 'అన్నీ నాకు తెలుసు' అనుకోవటంలోనే అజ్ఞానం పెరుగుతూ పోతుంది.

-ఎమర్సన్

★ శీలం నా పట్టా, జీవితం నా పరీక్ష, విశ్వం నా విశ్వ విద్యాలయం.

-హజరత్‌అలి

★ మనం జీవిస్తున్న జీవితాన్ని ప్రేమించగలిగితే మనమెంతో అదృష్టవంతులమని మనమెంతో ఎక్కువ సంతోషం అనుభవిస్తున్నామని తెలుస్తుంది.

-రూసో

★ చిరునవ్వు మీ అందచందాలను పెంచుకునేందుకు ఉపయోగపడే అతిచౌక సాధనం.

-కబీరు

★ బలహీనమైన మనస్సే సోమరితనం యొక్క ఆశ్రయం కోరుతుంది.

-చెస్టర్‌ఫీల్డ్

★ డబ్బు మంచి అందమైన కుక్కను కొనగలదు, కానీ తోక ఆడించడాన్ని కొనలేదు.

-జోష్‌డిల్లింగ్

సేకరణ: పట్నం శేషంశెట్టి




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**అక్టోబర్** చతుర నవల **కెరటాలు**

.............................................................................................

**సమీక్షకుని పేరు** : .............................................................................

**చిరునామా** : ......................................................................................

.............................................................................................

.............................................................................................

.............................................................................................

# చతురర కతలు

## బ్రహ్మాస్త్రం

**ము**ఖ్యమంత్రి పర్యటన సందర్భంగా పుర వీధులన్నీ శుభ్రం చేయబడి, వెల్‌కం ఆర్చ్‌లతో ఫెస్టివల్ కళని సంతరించుకున్నాయి. ఎయిర్‌పోర్టునుంచి విడిదివరకు పోలీసు బందోబస్తు మస్తుగా వుంది.

పోలీసులకు అమిత టెన్షన్‌గా వుంది. ఆలోపునే ఆ గొడవ సద్దుమణిచి దారి క్లియర్ చేయకపోతే చాలామంది అధికారుల వుద్యోగాలు వూడిపోయే ప్రమాదముంది. పోలీసులు మైకులలో విన్నపాలు చేశారు. లాఠీచార్జ్ కూడా చేశారు. ఫలితం లేకపోయింది. బాష్పవాయు ప్రయోగానికిగాని, ఫైరింగ్‌కి గానీ అది అనువైన సమయం కాదని వూరుకున్నారు.

పోలీసుల అవస్థను అర్థం చేసుకున్న ఓ



కొద్ది నిముషాలలో ముఖ్యమంత్రికారు అటు వస్తుందనగా జరిగింది ఆ సంఘటన. ఎందుకు మొదలయిందో ఎలా మొదలయిందో ఎవరికీ తెలీదు. రెండు వర్గాలమధ్య గొడవ రేగింది. దొమ్మి యుద్ధం ఆరంభమయింది. జనాన్ని చెదరగొట్టాలని పోలీసులు చేస్తూన్న ప్రయత్నాలు ఫలించడంలేదు.

వ్యక్తి ముందుకొచ్చాడు. అక్కడున్న ఓ పోలీసు అధికారితో ఏదో మాట్లాడాడు. తరువాత అతని చేతిలోంచి మైకు తీసుకుని అందులో ఇలా ప్రకటించాడు, "ప్రజలకు ఓ విజ్ఞప్తి.. రానున్న దీపావళికి అనాథలకోసం విరాళాలు సేకరిస్తోంది మా సంస్థ. ఇంతమంది జనం ఒకచోట చేరడం మా అదృష్టం. మా సభ్యు

ముఖపత్ర చిత్రం: శివసత్యమూర్తి

లు మీ అందరి దగ్గరకూ వస్తున్నారు. అంతా తమతమ శక్తికొలదీ ధారాళంగా విరాళాలు ఇవ్వవలసిందిగా అర్థిస్తున్నాము''

అంతే! అయిదు నిముషాలలో ఎక్కడి జనం అక్కడ అదృశ్యమయిపోయారు (కొందరు పోలీసులతో సహా). పోలీసుల లాఠీలు చేయలేని పని ఆ ప్రకటన చేసింది.

మరో క్షణంలో చీఫ్ మినిస్టర్స్ కాన్వాయ్ ఎటువంటి ఇబ్బందీ లేకుండా ఆ మార్గంగుండా సాగిపోయింది.

గుండెలపై నుంచి గొప్ప బరువు దించుకున్నట్టు తేలికగా వూపిరి పీల్చుకున్నారు పోలీసులు. ఆ వ్యక్తిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ, "నీ సమయస్ఫూర్తి మా వుద్యోగాలను నిలిపింది. నీకెంతో రుణపడివున్నాం మేము'' అన్నారు.

"నేను నిజంగానే అనాథశరణాలయం ప్రతినిధిని. మీరైనా కొద్దోగొప్పో చందా ఇస్తే'' అంటూన్న అతని పలుకులు పూర్తి కాకుండానే అక్కణ్ణుంచి అదృశ్యమయిపోయాయి ఖాకీ బట్టలన్నీ!!

-తిరుమలశ్రీ

## లక్ తగిలితే

వారం రోజుల క్యాంపు మూడురోజులలో ముగించుకొచ్చేసరికి మా ఆవిడ తెల్లబోయింది. "ఏం! ఇంత త్వరగా వచ్చేశారు? " అంది ప్రశ్నార్థకంగా.

ఆ చూపులు నాకు చికాకు కలిగించాయి. స్నానం ముగించుకుని విశ్రాంతి తీసుకున్నాక కదిలించాను. "నేను... నీకు ఇచ్చిన డబ్బు..."

"అది సరేకానీ ఈ రోజు టాప్ రాలేదు. బోరింగుకు పోయి నాలుగుబిందెలు నింపుకొస్తాను" అంటూ బిందెలు తీసుకుంది. నేను బకెట్‌తో బయలుదేరాను, ఆమెకు సహాయపడాలని.

"మన కాలనీ పక్కన ఇళ్లస్థలాలమ్ముతున్నారట" అంటూ రత్నాలు, మణెమ్మతో చెప్పడం గమనించాను.

"నెలకు వెయ్యి రూపాయలు చొప్పున ముప్పైనెలలు. నెలకోలాటరీ. అదృష్టం బాగుంటే మరి కట్టక్కరలేదు. స్వంత కొంప లేని బాధ ఆ బ్రహ్మదేవుడికే ఎరుక" అంటూన్న రత్నాలు మా రాకతో ఆపేసింది.



"అవునవును ముప్పైమంది. ఒక చీటీ తొమ్మిదివందల స్థలాలు ఓహో! అదంతా ఒక ఊరైపోతుంది" చిన్నమ్మాయి తన బాణీలో చెప్పింది.

"ఒకేఒక్కటి మిగిలింది. ఇరవైతొమ్మిది బుక్ అయిపోయాయి. అంటే నేను ముప్పయ్యవ టికెట్ కట్ చేసి వెయ్యి పైకం ఇచ్చాను. అదృష్టం బాగుంటే అదే ఫస్ట్, ఇదే లాస్ట్" సంబరబడిపోతోంది సూరీడు.

"నాతో కూడా ఒకేఒక టికట్ అని నాతో కట్టించాడు" ముత్యాలమ్మ ముక్కున వేలేసుకుని చెప్పింది.

నన్ను గమనిస్తున్న తాను బకెట్ తీసుకుని "రండి రండీ..." అంటూ మా ఆవిడ బోరింగ్ నీరు కొట్టడం ప్రారంభించింది. ఆ శబ్దంలో నాకు మరేం వినిపించలేదు. చేతిలో బకెట్, బిందె భుజాన్న పెట్టుకుని ఆమె వెంట బకెట్ నీటితో కదిలాను.

"మీరిచ్చిన వెయ్యి నిన్ననే ఇళ్లస్థలంకి కట్టాను. అదృష్టం బాగుంటే మొదటిది మనకే తగలవచ్చును" అని ఆమె అంటూంటే చేతిలో బకెట్ భారం అయింది.

"ఆఖరి టికెట్ అని నీచేత కట్టించాడన్న మాట."

నా మాట పూర్తి కాకుండా "అవును" అన్నమాట నా చెవిలో పడింది. వారంరోజుల క్రితం మా కాలనీలో స్వంత ఇళ్లు లేని వారి పేర్లు నోట్ చేసుకున్న మనిషి నా ఎదుట లీలగా కనిపించాడు.

-బెహరా ఉమామహేశ్వర రావు

## మహా ఇల్లాలు

ఏకాంబరం చిన్ననాటినుండి నా మిత్రుడు. ఎస్.ఎస్.ఎల్.సిలో నా క్లాస్‌మేట్. తర్వాత పి.యు.సి.లో, బి.ఏ.లో, ఎం.ఏ.ల్లో కూడా. నేను పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ తీసుకుంటున్నానని ఏకాంబరం ఎకనమిక్స్, పాలిటిక్స్ తీసుకోవాలనుకుని కూడా పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ సబ్జెక్ట్‌నే తీసుకున్నాడు.

నేను 'లా'లో చేరానని వాడూ చేరాడు. ఇద్దరం లాయర్స్ అయ్యాం. ఏకాంబరం లేమిలో పుట్టిపెరిగాడు. దాంతో అతనిలోని తీరని అనేక కోరికలు స్వంత సంపాదన వచ్చాక తీర్చుకోసాగాడు. పెళ్ళయాక కూడా అవి ఆగలేదు, మానలేదు.

రోజూ రాత్రి ఓ క్వార్టర్, అవకాశం దొరికి



నప్పుడల్లా అతివలు, పేకాట... అలాంటి ప్లేబోయ్ లక్షణాలు గల వాళ్లవల్ల మధ్యతర గతి కుటుంబాల్లో అధికంగా బాధపడేది భార్యలేగా!

ఏకాంబరం భార్య మందాకినికి భర్త తీరు ఎంతో మనస్థాపంగా ఉంటోందని నాకు చూచాయగా తెలిసింది.

ఈ దుర్వ్యసనాలకి పురికొల్పేది స్నేహితులే అని భావించడంతో అతని ఫ్రెండ్స్ ఫోన్ చేస్తే ఇంట్లో లేరని చెప్పడం, ఇంటికి వస్తే భర్త వినకుండా ఇకమీదట రావద్దని కోప్పడటం లాంటివి చేయసాగింది మందాకిని.

ఏకాంబరానికి ఈ విషయాలు తెలియగానే మందాకినిని మందలించాడు. కాని ఉపయోగం లేకపోయింది. వాళ్ళ మధ్య పోట్లాటలు వారంవారానికి అధికం అవసాగాయి. ఏకాంబరం కలసినప్పుడల్లా ఈ విషయాలు నాతో ఏకరువు పెట్టుకునేవాడు.

అలాగే ఆమె కూడా!

"మీ ఫ్రెండ్‌కి కాస్తంత బుద్ధి నేర్పండి'' అని ఫోన్ చేసి మరీ వేడుకునేది.

ఇలాంటి పరిస్థితుల్లో ఏకాంబరం గురించి పత్రికల్లో ఓ వార్త వచ్చింది. "ఓ బేంక్‌కి లీగల్ ఎడ్వైజర్‌గా పనిచేస్తున్న ఏకాంబరం ఆ బేంక్‌కి ద్రోహం చేసి, కస్టమర్స్‌నించి వసూలుకావాల్సిన అయిదారు కోట్లు రాకుండా మేనేజ్ చేసాడనీ, అందుకుగాను అతనికి కొంత సొమ్ము ముట్టిందనీ రుజువవడంతో జైలుశిక్ష పడింది'' అని ఆ వార్త సారాంశం.

కోర్టు పనిమీద హైద్రాబాద్ వెళ్ళి ఆ పని పూర్తిచేసుకున్నాక ఇంకా రైలుకి చాలా టైం వుండటంతో ఏకాంబరం భార్యని పరామర్శించడానికి వాళ్ళింటికి వెళ్ళాను.

కానీ, ఏకాంబరానికి శిక్ష పడడం ఆమెకి బాధా కరమైన విషయంలా తోచలేదు. పైగా చాలా హుషారుగా ఉందనిపించింది నాకు. అయినా అది గమనించనట్లుగా నేను "విచారించకమ్మా, అంతా నెమ్మది మీదట చక్కబడుతుంది'' అన్నాను.

"విచారం దేనికండి? రాత్రుళ్ళు ఎక్కడ ఏం చేస్తున్నారో, సంపాదించిందాంట్లో పేకాటలో ఎంత పోగొట్టుకుంటున్నారో, ఎవరితో ఎక్కడ, ఎలా కులుకుతున్నారో, రాత్రి ఎన్నింటికి ఇంటికి వస్తారో అసలు వస్తారో రారో అలాంటి బాధలన్నీ ఇప్పుడు తప్పాయి. అందుకు సంతోషిస్తున్నాను'' బదులు చెప్పిందా ఇల్లాలు. **-డి.పద్మజ**

## అసలు పాయింట్

సుబ్బలక్ష్మిని చూసినప్పుడు ఎవరికేనా సుప్రసిద్ధ ఫోమ్ రబ్బర్ కంపెనీలు అన్నీ కలిసి తయారు చేసిన ఆడ ఆకృతిలాగా కనిపిస్తుంది. ప్రపంచంలో వున్న ఒబేసిటీ అంతా సుబ్బలక్ష్మికే చెందుతుందేమోనని పిస్తుంది ఆ అసాధారణ ఆకారానికి. తప్పు ఆమెది కాదు. మాటలో మంచితనం, ప్రవర్తనలో ఇతరులను గౌరవించే ధోరణి అలా ఎన్నో సుగుణాలు సుబ్బలక్ష్మిలో వున్నాయి. సుబ్బలక్ష్మికి పెళ్లవుతుందా, సుబ్బలక్ష్మిని ఎవరేనా చేసుకుంటారా అని నాకు అనిపించేది.

అయితే ఒక రోజున తను ఈ జన్మలో చచ్చినా పెళ్లిచేసుకోనని కూర్చున్న మా పిన్ని కొడుకు సత్యం తాను పెళ్లిచేసుకుంటున్నాననే వార్త ఫ్లాష్ చేశాడు. సంతోషించిన వారందరూ వెంటనే ఆశ్చర్యపోయారు... సత్యం పెళ్లిచేసుకోబోతున్న అమ్మాయి మరెవరోకాదు సుబ్బలక్ష్మి అని తెలిసి. మా సత్యం ఆకారం చూస్తే తుమ్మితే ఎగిరిపోయేటట్లు వుంటాడు. పెళ్లిచేసుకోవాలనే సత్యం నిర్ణయం తెలిశాక ఎవరిని పెళ్లిచేసుకుంటున్నాడో తెలుసుకున్నాక పాపం ఆ పసివాడు బ్రహ్మచారిగా మిగిలిపోతేనే బావుంటుందనిపించింది.

పెళ్లి చేసుకుని లక్ష్మిని యింటికి తీసుకురా




వడానికి ముందర, ఇంటిని లక్ష్మికి అనుకూలంగా సత్యం సైజ్ చేయించాడు. వీధిగుమ్మం, తలుపులు మెగా సైజ్‌లో మార్పించాడు. హెవీ వెయిట్ కుర్చీలు, మంచం, పరుపు ప్రత్యేకంగా ఆర్డర్ యిచ్చి చేయించాడు. బాత్‌రూమ్‌లు లోపలికి వెళ్లి చిక్కుకోకుండా ఆల్టర్ చేయించాడు.

పెళ్లిలో సత్యం, సుబ్బలక్ష్మి తీయించుకున్న ఫోటోలో సుబ్బలక్ష్మి పక్కన సత్యం వున్నా ఎక్కడ వున్నాడో వెతుక్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. అయినా ఆ ఫోటోని ఎన్‌లార్జ్‌చేయించి, లామినేట్ చేయించి డ్రాయింగ్ రూమ్‌లోనే పెట్టాడు సత్యం.

ఏడాది తిరిగేసరికి సత్యం తండ్రయ్యాడు కవల పిల్లలకు. కవలల్లో అమ్మాయి సన్నగా, పీలగావుంది! అబ్బాయి సూపర్‌సైజ్‌లో వున్నాడు!

సత్యాన్ని అభినందించడానికి వెళ్లి ఏడాది పైగా దాచుకున్న సందేహాన్ని కవల పిల్లల కోసం జంటగిఫ్టులు యిచ్చి మెల్లిగా చెవులో వేశాను.

"అసలు సుబ్బలక్ష్మిని ఎలా ప్రేమించావు'' అని అడిగాను.

"ఈ ప్రశ్న అడుగుతావని తెలుసు'' అంటూ సత్యం చెప్పడం మొదలుపెట్టాడు.

"నీకు నా పెర్సనాలిటీ తెలుసు. మా కాలేజికి ఎదురుగా అమ్మాయిల కాలేజీ వుంది. ఆ కాలేజీలోని రౌడీ అమ్మాయిలు ప్రతిరోజూ నా వెంటపడి తెగటీజ్ చేసేవారు. నాకు కళ్లలో నీళ్లు వచ్చేవి. ఒక దశలో చదువు మానేసి ఇంటి దగ్గరే కూర్చుందామనుకున్నాను. ఒకరోజున సాయంత్రం కాలేజీ నుంచి ఇంటికి వెళ్తూ వుంటే అమ్మాయిలు నా వెంటపడ్డారు. ఎలా తప్పించుకోవాలా అని భయపడి చస్తుంటే ఎక్కడనుంచి ఎలా వచ్చిందో సుబ్బలక్ష్మి వచ్చి మర్యాద దక్కదని ఆ రౌడీ అమ్మాయిలకు వార్నింగ్ యిచ్చేసరికి అందరూ చల్లగా జారుకున్నారు. అప్పటినుంచీ ప్రతిరోజూ సుబ్బలక్ష్మి నన్ను ఇంటిదగ్గర దిగపెట్టడం మొదలు పెట్టింది. స్త్రీలకి పురుషులనుంచి ఎలా రక్షణ కావాలో పురుషులకీ స్త్రీలనుంచి ప్రొటెక్షన్ అవసరమని తెలుసుకున్నాను. సుబ్బలక్ష్మి నన్ను ప్రొటెక్ట్‌చేసింది. నేను సుబ్బలక్ష్మిని లవ్ చేశాను. నా లవ్‌ని సుబ్బలక్ష్మి ఓకే చేసింది. ప్రేమించుకుని పెళ్లి చేసుకున్న మా జీవితాలు రెండు ఫలాలతో సమగ్రత సాధించాయి'' అంటూ సత్యం ముగించాడు.

సత్యం పాయింట్‌లో సత్యం వుందనిపించింది. అబ్బాయిలకూ అమ్మాయిల నుంచి ఫిజికల్ ప్రొటెక్షన్ కావాలి.

-తాజీ ప్రసాద్

# చతుర

సంచిక : 9 సంపుటి : 20 అక్టోబర్ 1997

న్యూజిలాండ్‌లో డాక్టరుగా పనిచేస్తోన్న ఆ తెలుగమ్మాయి తన స్నేహితురాళ్లని చూసి, వాళ్లతో కొన్ని రోజులు గడిపి జీవితానుభవాలను పరస్పరం పంచుకోవాలని మాతృభూమికి తిరిగివచ్చింది.

తాను కలిసిన మొట్టమొదటి స్నేహితురాలి జీవితం ఆమెను దిగ్భ్రమకి, తీరని వ్యధకి గురిచేసింది.

మరో స్నేహితురాలు చదువుకోసం. ఓ వృద్ధుడి వద్ద అప్పుచేసి, ఆ అప్పుకు బదులుగా తనని పెళ్లిచేసుకోమని వేధిస్తున్న ఆ వ్యక్తి వలలో చిక్కుకుపోయింది.

వేరొక స్నేహితురాలు భయంకర పరిస్థితుల్లో ఈ లోకాన్నే విడిచివెళ్లింది.

అలాంటి పరిస్థితుల్లో తన కథను,. సమస్యను ఎవరితోనూ చెప్పుకోకుండానే తిరుగు ప్రయాణం కోసం విమానం ఎక్కింది.

ఉద్యోగం కోసం దేశాన్నే వదిలి వెళ్ళిన ఆ అమ్మాయి పరదేశంలో ఎదుర్కొన్న అనుభవాలేమిటి? స్వదేశంలో పంచుకోలేకపోయిన అనుభూతులేమిటి? మానవ స్వభావాల సమగ్ర విశ్లేషణ

పట్టిసపు రాధామహాలక్ష్మి



శైలజ విశాఖపట్నం వచ్చి వారం రోజులైంది. మెడికల్ కాలేజీ వుమెన్స్ హాస్టల్లో వుంటూ తన క్లాసుమేట్సూ, స్నేహితులూ ముఖ్యంగా వినూత్న, కవిత, గాయత్రి, లలిత లు ఎక్కడెక్కడున్నారో తెలిసికొని వాళ్ళదగ్గిర కొన్నాళ్ళుండాలని అనుకుంటోంది.

సాయంకాలం అయిదున్నర కావస్తోంది. శైలజ సముద్రపు వడ్డుకు వెళ్ళి కూర్చోవాలనుకుంది. వాచీవైపు మరొకసారి చూసుకొంది. మాధురి రావడానికి ఇంకా రెండు గంటలైనా పడుతుందని తనొక్కతే బయలుదేరి బీచ్ వద్దకి వచ్చి కూర్చుంది.

సూర్యాస్తమయం కావస్తున్నదేమో బీచ్‌లోని ఇసుక తెలుపు రంగునుంచి మారి లేత ఎరుపురంగులో మెరుస్తోంది. కెరటాలు నెమ్మది నెమ్మదిగా కొంచెంకొంచెం పెద్దవి అయి తను కూర్చున్న స్థలంవరకూ వచ్చి వెనక్కి వెళ్ళిపోతున్నాయి.

దూరంగా కొద్దిమంది పిల్లలు ఇసుకలో పిచ్చుక గూళ్ళు కట్టుకుంటున్నారు.

కొందరు కాళ్ళు ఇసుకలో పెట్టి కనపడకుండా ఇసుక వేసి మూసేసి గోడలు కడ్తున్నారు.

కొందరు ఇసుకలో పుల్లని దాచేసి వెతుక్కోమంటున్నారు.

కొందరు పరుగెత్తుతూ ఆడుకుంటున్నారు.

కొందరు తల్లిదండ్రుల్ని వేధించి వేరుశనగపప్పు, ఐస్‌క్రీం వగైరా కొనుక్కుని తింటున్నారు.

పిల్లల అరుపులు, కేరింతలు ఎంత గట్టిగా వున్నా సముద్రపు హోరులో కలిసిపోతున్నాయి.

శైలజకి పిల్లలంటే చాలా ఇష్టం. అందుకే తను విశాఖ వచ్చిందగ్గర్నుంచీ సాయంత్రాలు బీచ్‌కి వచ్చి ఇలా ఇసుకలో కూర్చుంటోంది.

పిల్లలంతా రకరకాల వయస్సుల్లో వున్నారు. ఎవరిని చూసినా ముద్దులొలికే ముఖాలు, వచ్చీరాని మాటలతో ఏవేవో మాట్లాడేస్తున్నారు. కొందరు తప్పటడుగులు వేస్తూ నడుస్తున్నారు. ఒక పాప తన చెడ్డీ తడిపేసుకొని ఏడుస్తోంది. వాళ్ళమ్మ పక్కనున్న వాళ్ళతో మాట్లాడుతూనే "ఊరుకో అమ్మా మా తల్లికదూ వెళ్ళిపోదాంలే ఇంటికి" అని సముదాయించేసి మళ్ళీ మాటల్లో పడింది. పాప ఇంకా ఏడుస్తూనే వుంది. ఆ ఏడుపు ఎంతకీ తగ్గకపోయేసరికి ఆ తల్లి లేచి "ఎక్కడికెళ్ళినా ఏడుపే వెధవ సొద, కాస్సేపు హాయిగా మాట్లాడుకోడానికి లేదు. దా పోదాం" అంటూ ఆ పాపని ఎత్తుకోబోయి "ఆసిసీ... చెడ్డీ అంతా తడిపేసుకొన్నావే- అయ్యో, ఎలాగ? మరొకటి తేవడం మర్చానే" అంటూ దాన్ని విప్పేసి అక్కడే తువ్వాలు పరచి దానిమీద పాపని కూర్చోబెట్టి తాను సముద్రం నీటిలో ఆ చెడ్డీని పిండడానికి వెళ్ళింది.

శైలజ అంతా చూస్తూనే వుంది. పసిపిల్లలకి సేవచేసుకోవడంలో ఆ తల్లులకు ఎంత ఆనందమో తానిప్పుడిప్పుడే ఊహించగల్గుతోంది. తనకీ అందరిలాగానే పెళ్ళి అయి వుంటే ఈపాటికి అలాంటి ఓ పాపకి తనూ తల్లి అయివుండేది. ఆ పాప తనను ప్రేమగా 'అమ్మా' అని పిలిచేది. అప్పుడు తను ఏమాత్రం కూడా విసుక్కోకుండా పాప బట్టలు మార్చేది.

తన ఊహకి. శైలజకి నవ్వువచ్చింది.

ఒక పన్నెండేళ్ళ అబ్బాయి "బటానీలు, బటానీలు కాలక్షేపం బటానీలు" అని అరుస్తూ అమ్ముకుంటున్నాడు.

శైలజ ఒక అర్ధరూపాయి ఇచ్చి ఒక చిన్న పొట్లాం ఇమ్మంది. అసలతను రూపాయికి తక్కువైతే ఇవ్వనంటున్నాడు.

"ఈ కాలంలో అర్థ రూపాయికేమంత

విలువమ్మా. మేమూ ఇదే బీచ్‌లో ఇదివ రకు పావలా పేకెట్లు అమ్మిన రోజులున్నాయి. ఉంచండి ఇంకో అర్ధరూపాయివి" అంటూ పొట్లాంకట్టి ఒద్దంటున్నా ఇచ్చేశాడు.

పైగా- "అమ్మా చిల్లరలేకపోతే రేపియ్యండమ్మా! ఎక్కడికి పోతాయి మీ దగ్గిర డబ్బులు? " అంటూ ఇంకొక బేరం చూసుకోడానికి లేచాడు.

శైలజ నవ్వి డబ్బులిచ్చేసింది.

శైలజ ఎంత వేగిరం తన స్నేహితుల్ని కలుస్తానా అని ఎదురుచూస్తోంది.

గాయత్రి తల్లిదండ్రులు వాళ్ళ పాత ఇల్లు అమ్మేసి 'ఈనాడు' ఆఫీసు వెనుక కొత్త ఇల్లు కొనుక్కున్నారని తెలిసింది. గాయత్రి ఇప్పుడెలా వుందో ఏమో! ఆ రోజుల్లో అయితే తన మాటలు, వాదనలు విని "ఒసే శైలజా నీతో స్నేహం చేస్తే ఎవరైనా చెడిపోతారు. నువ్వు మా నాన్నమ్మ ముందు మాత్రం ఎప్పుడూ ఇలా మాట్లాడకు. నీకు పుణ్యం వుంటుంది" అనేది.

"నేనేమన్నానే. నా అభిప్రాయం చెప్పేను. నాకు ప్రేమ మీద విశ్వాసం తప్పితే పెళ్ళిమీద లేదు" అనేది శైలజ.

"నాకు ముందు పెళ్ళి తర్వాతే ప్రేమ" అనేది గాయత్రి.

"ఒట్టిపాత కాలపు మనిషివి. మీ అమ్మమ్మ నంజుకోబెడ్తున్న పాత చింతకాయ పచ్చడిని ఇంకా మోజుగా తింటూనే ఉన్నావు కాబోలు" అనేది శైలజ.

"అవునే శైలూ ఆ పాత చింతకాయ పచ్చడే మనకి పథ్యం కింద అవసరమొస్తుంది. నీకోసం కాస్త దాచి వుంచుతాలే" అని కిసుక్కున నవ్వేది గాయత్రి.

"నాకలాంటి అవసరాలేమీరావు. నేనసలు ఈ వూళ్ళోనే కాదు, ఈ దేశంలోనే వుండను తెలిసిందా! రేపో, మాపో ఏ ఫారిన్‌లోనో వున్నానని విని శైలజ తన ఆశయాలను నెరవేర్చుకుందని సంతోషిస్తావులే"

"అయితే నువ్వు ప్రేమించి పెళ్ళి చేసుకుంటావా? " అడిగింది గాయత్రి.

"అవును నాకు నచ్చినవాడు, నన్ను మెచ్చినవాడు వుంటే అలాగే ప్రేమిస్తాను"

"అలాంటివారెవరైనా ఇప్పుడే వున్నారేమిటి చెప్మా కొంపదీసి" అని నాలుక కొరుక్కుంది గాయత్రి.

"ఇంకా ఎవరూ తారసపడలేదులేవే. అదే జరిగితే మీకు చెప్పకుండా ఉంటానా? " అంది శైలజ.

ఆనాడలా అంది కాని, శైలజ తనకి తారసపడ్డ వాడూ, తనని ప్రేమించినవాడూ- 'హంటర్' గురించి ఇంకా ఎవరికీ చెప్పలేదు. ఈనాటికీ అది రహస్యంగానే వుండిపోయింది.

శైలజ ఉవ్వెత్తుగా లేచి పడుతున్న కెరటాలను చూస్తూనే వుంది. తానెందుకు భారతదేశానికి వచ్చినట్లు? వచ్చినపని గురించి చూసుకోకుండా రోజూ ఈ బీచ్‌కి వచ్చి కూర్చుని ఈ పిల్లల ఆట పాటలు చూసి మురిసిపోవడమేనా? ఏ ప్రయత్నమూ చేయకుండా ఏ పనినీ సాధించలేమే. రేపట్నుంచీ కార్యసాధనకి పూనుకోవాలి" అని నిశ్చయించుకొంది శైలజ.

ఎదురుగా ఇసుకలో కాళ్ళు పెట్టుకొని ఆడుకుంటూన్న ఒక పిల్లవానిని బలవంతంగా లాగి ఎత్తుకొని అతని తండ్రి కాబోలు తీసికెళ్ళడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ అబ్బాయి "ఇంకా ఆడుకుంటాను. అప్పుడే ఇంటికి రాను" అని మొరాయిస్తూ తండ్రి ఎత్తుకుంటే చేతిలో వుండకుండా దిగిపోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆఖరికి ఆ తండ్రి ఆ పిల్లవాడిని ఒకదెబ్బ వేసి ఏడుస్తున్నా లెఖ్ఖచెయ్యకుండా తీసికెళ్తున్నాడు. అతను తను కూర్చున్నవైపునించే ఇంటిదారి పట్టడం శైలజ చూస్తూనే వుంది.



"అరె అతను వినోద్‌లావున్నాడే" తన దగ్గర్నుంచే వెడుతున్న అతన్ని ఉద్దేశించి పైకే అనుకుంది శైలజ.

అతను ఠక్కున ఆగి "మీరు నన్ను పిలిచారాండీ. మీరు... మీరు శైలజగారు కదూ ఎన్నాళ్ళకి కలిశామండీ మళ్ళీ" అన్నాడు.

"వినోద్‌గారూ ఈ అబ్బాయి?"

"మా అబ్బాయేనండీ. ఒఠ్ఠి అల్లరి వెధవ. రోజూ వస్తూనే వుంటాము. ఎంతసేపు ఆడినా వీడికి తృప్తి వుండదు. ఇంకా ఇసుకలో ఆడ్తాడుట. అదిసరే కాని శైలజగారూ' ' అని వినోద్ ఏదో చెప్పబోతూంటే...

"ముచ్చటగా వున్నాడు బాబు. ఏం పేరు బాబూ నీది" అంది శైలజ.

బాబుకి ధైర్యం వచ్చేసింది. ఏడుపాపి "లామం, మేము లోజూలాము ఆంటీ. ఎప్పులన్నా వత్తాము" అని నిజంచెప్పేసేడు బాబు.

"ఎన్నేళ్ళుంటాయి బాబుకి" శైలజ అడిగింది ముద్దుమాటలకి ముచ్చటపడ్తూ.

"నాలుగేళ్ళు దాటాయి. బాబు పూర్తి పేరు రామచంద్ర. నాకు చదువుకునే రోజుల్లోనే వివాహం అయింది కదా" సిగ్గుపడుతూ చెప్పేడు వినోద్.

"వినోద్ మీరెక్కడ వుంటున్నారు" అడిగింది శైలజ.

"అదుగో ఆ కనపడే అపార్టుమెంట్సు వున్నాయి చూడండి. అందులో రెండవ వరుసలో నాలుగవ అంతస్థులో కుడివైపు. మీరు ఎప్పుడన్నా మా ఇంటికి రండి, వీలయితే"

"తప్పకుండా వస్తాలెండి వినోద్‌గారూ. నేనింకా మన వినూత్నని కవితనీ కలియలేదు. వాళ్ళని తప్పక కలవాలనుకుంటున్నాను"

"వినూత్నని కలియవచ్చులెండి శైలజగారూ. ఆవిడ ఈ వూళ్ళోనే వుంటున్నారు" అని జేబులోంచి కాగితం పెన్నూ తీసి వినూత్నా ఎడ్రసు రాసిచ్చేడు వినోద్.

"థాంక్సండీ. నేను తప్పక వెళ్ళేలోపున మీ ఇంటికి వస్తాను. లేకపోతే మనం ఇలాగే బీచ్‌లో ఇక్కడే కలవవచ్చు ఏమంటారు?" అంటూ నాకు కొంచెం పని వుందండీ వినోద్‌గారూ, రేపొచ్చినప్పుడు మాట్లాడుకుందాం' ' అంటూ "బాబూ టాటా" అని చెప్పి చకచకా వెళ్ళిపోయింది శైలజ.

వినోద్ తేరుకొని ఇంటిదారి పట్టాడు. శైలజని ఎన్నో విషయాలు అడుగుదామనుకొన్నాడు. అసలేమీ అడగనేలేదు.

మర్నాడు శైలజ వినోద్ ఇచ్చిన అడ్రసు పట్టుకొని వినూత్న ఇంటికి వెళ్ళి తలుపు తట్టింది.

లోపల్నుంచి "వస్తున్నా, ఎవరూ" అంటూ ఓ పెద్దావిడ వచ్చి తలుపు తీసింది.

"నేను శైలజనండీ. వినూత్నా నేనూ క్లాసుమేట్సుమి. న్యూజిలాండులో పనిచేస్తున్నాను. అందర్నీ చూసిపోదామని ఇండియాకి వచ్చేను. వినూత్నా ఎలా వుందండీ, లోపలికి రావచ్చాండీ? ... మీరూ? ..." అంటూ శైలజ ఆవిడ సమాధానాన్ని ఆశించకుండానే ఇంట్లోకి అడుగుపెట్టింది.

"రండమ్మా రండి. నేను వినూత్నకి అత్తగారిని, ఇలా కూర్చోండి" అంటూ ఆవిడ శైలజకి సోఫా చూపించేరు.

"అమ్మా మీరు నన్ను 'మీరు' అని సంబోధించక్కరలేదండీ. నువ్వు అంటే చాలండీ" అంది శైలజ నవ్వుతూ.

"ఎంతైనా మీరు డాక్టర్లు కదా" అంటూ ఆవిడకూడా శైలజ పక్కనే సోఫాలో కూర్చుంటూ "మా కోడలు ఇంటికి వచ్చేసరికి కొంత ఆలశ్యం అవుతుందమ్మా. వినూత్నా నీలాగ రెగ్యులర్ ప్రాక్టీసులో

లేదమ్మా. పగలు పార్ట్‌టైము లెక్చరర్‌గా పనిచేస్తుంది. సాయంత్రం ఒక ప్రైవేటు హాస్పిటల్లో నాలుగు గంటలనుండీ రాత్రి పది గంటల వరకూ పనిచేస్తుంది. ఏమిటో ఎంత డబ్బు సంపాదించినా సరిపోవడం లేదు. ఇళ్ళద్దెలు కూడా ఎక్కువేనమ్మా. వస్తువుల ధరలు అన్నీ పెరిగిపోతూనే వున్నాయి"

"అవునండీ" అంది శైలజ.

"కాఫీ తీసుకుంటావా, అమ్మా! మా వినూత్నా వచ్చేసరికి ఆలశ్యమవుతుంది. ఒకొక్కసారి ఇంటికి రాకుండానే కాలేజీనించి హాస్పిటల్ కు వెళ్ళిపోతుంది"

"ఫరవాలేదండీ. ఇప్పుడు మీరేం శ్రమపడకండి. వినూత్న భర్త ఎప్పుడు వస్తారు. ఆయనెక్కడ పనిచేస్తున్నారు"

"వాడా, మా అబ్బాయి సాగర్. అప్పట్నుంచీ రైల్వేలోనే మెకానిక్‌గా పనిచేస్తున్నాడు. నువ్వు వినూత్న పెళ్ళికి రాలేదామ్మా? " ఆవిడ అడుగుతూ శైలజ ముఖంలోకి చూసేరు.

గతుక్కుమన్న శైలజ ఆవిడకి 'లేదండీ' అంటూ తల అడ్డంగా వూపింది.

అయితే వినూత్న అన్నంతపనీ చేసిందన్నమాట. తన బావనే వివాహం చేసుకుంది. తామంతా ఆరోజుల్లో వినూత్నని ఎగతాళి పట్టించేవాళ్ళు

అయితే అవేమీ పట్టించుకోకుండా తన బావచేతే మెళ్ళో తాళికట్టించుకుందన్నమాట. వినూత్నాది ఘాటైన ప్రేమ. అనుకున్నది సాధించింది. కానైతే సాగర్ ఎలాంటివాడు? వినూత్నానే ప్రేమిస్తూ ఆమెతో వుంటాడా? లేక...? ఆ మాటే అడిగింది శైలజ.

"ఏమండీ మీ అబ్బాయి వినూత్నాతో ఇక్కడే వుంటున్నాడా? లేక...!" అని.

ఈసారి గతుక్కుమనడం వినూత్న అత్తగారి వంతయింది. ఆవిడ శైలజని తేరిపారచూసింది. శైలజకి తమ విషయాలు ఎంత వరకూ తెలుసో ఆవిడకి అంతుపట్టడం లేదు. తన కొడుకు గురించి శైలజకి ఏం చెప్పాలి అని ఆలోచిస్తోంది. కొంచెంసేపూరుకొని.

"కొంచెం కాఫీ అన్నా పుచ్చుకోపోనీ" అని అంది ఆవిడ.

"ఒద్దండీ నాకిప్పుడేం తాగాలనిలేదు" అంది శైలజ.

"చూడమ్మాయ్ శైలజా నీకు వినూత్న గురించి ఏం తెలుసో ఎంత తెలుసో నాకు తెలియదు. నేను కొన్ని విషయాలు చెపుతాను దాచకుండా విని బాధపడితే నా బాధ్యత కాదు. ఏమంటే ఆ విషయాలేమంత సంతోషకరమైనవి కావు"

"ఫరవాలేదు చెప్పండి వింటాను" అంది శైలజ సోఫాలో వెనక్కి వాలి స్థిమితంగా కూర్చుంటూ ఏమివినాల్సి వస్తుందోనని ఓ పక్క భయపడుతూనే.

ఆవిడ చెప్పసాగింది.

"నా పేరు శ్యామల. వినూత్నా మా అన్నగారి కూతురు. వినూత్నా పుట్టిన దగ్గర్నుంచీ సాగర్ పెళ్ళామనే అందరూ అంటూండేవారు. దానికి తగ్గట్టుగానే వినూత్నా తల్లిదండ్రులు కూడా వినూత్నా భవిష్యత్తు గురించి ఏమంత పట్టించుకొనేవారు కాదు. వినూత్నా పెరిగి పెద్దదవుతున్న కొద్దీ బావ సాగర్‌మీద విపరీతమైన ప్రేమను పెంచుకుంది. అయితే నా కొడుకు ఏమంత పెద్ద చదువులు చదవలేకపోయాడు. వాళ్ల నాన్నగారు పోయేక ఆ ఉద్యోగాన్ని నా కొడుక్కి ఇచ్చేరు. అప్పటికి నా కొడుకు ఇంటరు ప్యాసై మెకానికల్ ఇంజనీరింగులో డిప్లొమా తీసుకున్నాడు. కాబట్టి రైల్వేలో మెకానిక్ ఉద్యోగం వచ్చింది.



"వినూత్న చాలా తెలివైన పిల్ల. చురుకైనది కూడాను. 'బావ తక్కువ చదివి తనూ తక్కువ చదివితే రేప్పొద్దున్న సంసారం ఎలా గడుస్తుందీ' అని బాగా ఆలోచించి తను డాక్టర్‌ని అవుతానంది. ఆ అమ్మాయి తన కోరిక కనుగుణంగా కష్టపడి చదివింది. మెడిసిన్‌లో సీటు వచ్చింది. అదే సంవత్సరం మా అబ్బాయికి జగదల్పూరు ట్రాన్స్‌ఫర్ అయింది. నేనూ మా అబ్బాయి జగదల్పూరులో కాపురం పెట్టాము"

శైలజ చాలా ఆసక్తితో వినసాగింది. తన వెనుక ఇంత కథుందని వినూత్నఎన్నడూ ఎవరితోనూ చెప్పుకోలేదు. బహుశా తన బావ తక్కువ చదువుకున్నాడని కాని, చిన్న ఉద్యోగంలో వున్నాడని కాని ఎవరైనా అని పోతారేమోనన్న భయమో! ఏమో!

"చెప్పండి" అంటూ శైలజ కొంచెం ముందుకి వంగి అడిగింది.

శ్యామలగారు చెప్పుకుపోతున్నారు.

"వినూత్న విశాఖపట్నం మెడికల్ కాలేజీలో జాయిన్ అయి చదువుకుంటూ తన బావకి జగదల్పూరుకి ఉత్తరాలు రాస్తూండేది. ప్రతీ ఉత్తరంలోనూ అత్తయ్యని అడిగానని నమస్కారాలు చెప్పు బావా! అని తప్పక రాసేది. వినూత్నకి నామీద వున్న గౌరవానికి, అభిమానానికి నేను తెగ మురిసిపోతూండేదానిని. ఒకరోజు సాగర్ వినూత్న ఉత్తరాన్ని చదివి నలిపి పారేసేడు. పళ్ళు పటపట కొరుకుతూ "నా ఇష్టం వచ్చినట్లు నేనుంటాను. నేనేం చేస్తే దానికెందుకు? నేనెంత సంపాదిస్తే దానికేమిటి? " అంటూ విసుక్కున్నాడు. బహుశః ఆ వుత్తరం ఆవేళే వచ్చి వుంటుంది.

"సాగర్ వెళ్ళిపోయేక నేవెళ్ళి అతను పారేసిన ముడుతలు పడ్డ ఆ ఉత్తరాన్ని తీసి సాపుచేసి చదివాను. 'బావా పెళ్ళి ఇంకా చాలా రోజులు ముందుందని ఇతర ఆడపిల్లలతో సరసాలాడకు సుమా' అనీ, మన భవిష్యత్తు ఇంకా బావుండాలంటే నువ్వు కనీసం గ్రాడ్యుయేటు అయినా అయితే బావుంటుందనీ, ప్రమోషన్లకి కూడా పెద్ద చదువులు ఆసరాగా వుంటాయనీ, అత్తయ్యకి నమస్కారాలు చెప్పవలెను" అనీ రాసింది.

"అంతే! ఈమాత్రం దానికే వాడెందుకు విసుక్కున్నాడో తెలియలేదు

"నాల్రోజులు పోయాక నేనూ అదే మాట వాడిదగ్గర ఎత్తేను.

"నాయనా నీకు ఏమంత వయసు ముదిరిపోలేదు. చదివితే చదువు రాదనుకోడానికి నువ్వేమంత మొద్దువి కావు. తెలివి లేనివాడివి అసలే కావు. ఎంతమంది రాత్రి క్లాసులకి వెళ్ళి చదువుకోడంలేదు. డిగ్రీ అన్నా చెయ్యరా నాయనా! నేనూ నలుగురితోనూ మా సాగర్ బి.ఎ. చదివాడని చెప్పుకోవచ్చు" అన్నాను.

"అమ్మా ప్రమోషన్లు రావడానికీ, డబ్బులు ఎక్కువ సంపాదించడానికి చదువే ముఖ్యం కాదమ్మా. అయినా మనకిప్పుడేం లోపమని? నేను తెచ్చిన డబ్బు మన తిండికీ గుడ్డకీ లోటులేదు కదమ్మా! అయినా ఇది నీకు పుట్టిన బుద్ధేనా లేక నీ మేనకోడలుకి వకాల్తా పలుకుతున్నావా!" అన్నాడు సాగర్.

"తింటూన్న అన్నంలో సగంలోనే మజ్జిగ పోసుకొని లేచి చెయ్యికడిగేసుకున్నాడు.

"అదేమిట్రా నాయనా భోజనం చేస్తూ అలా మధ్యంతరంలో లేచి చెయ్యి కడిగేసుకుంటున్నావేమిట్రా. నేనేమన్నాననీ. నా కొడుకు బాగా చదువుకోడం, మంచి ఉద్యోగంలో వుండాలనుకోడం తల్లిగా నాకా అర్హత లేదుట్రా. నేను నిన్ను అడగనూ వచ్చు వీలైతే నువ్వు నాకోసం ఏమైనా చెయ్యనూ వచ్చు" అన్నాను.

"ఊ అన్నీ చెయ్యొచ్చు నాకింక ఏ ఓపికా లేదు. అంతగా అయితే నీ మేనకోడలుకి మరో సంబంధం చూసుకో" అని సాగర్ కోపంగా చెప్పులేసుకొని బయటికి వెళ్ళిపోయేడు.

"ఛెళ్ళున చెంపదెబ్బ కొట్టినట్లయి అవాక్కయి సాగర్ వెళ్ళినవైపే చూస్తూండిపోయాన్నేను"

శ్యామలగారు కళ్ళు తుడుచుకొని మళ్ళీ చెప్పసాగేరు.

"క్రమేపీ సాగర్ వినూత్నా రాసే ఉత్తరాలు కొన్నింటిని చదవకుండానే చింపి పారేస్తూండేవాడు. నేను వినూత్నా పేరెత్తినప్పుడల్లా మాట మార్చి ఏదో విషయాన్ని చెప్పేవాడు. రానురాను వినూత్నా పట్ల ఒక విముఖత ఏర్పరచుకోడం మొదలుపెట్టేడు. వినూత్నా ప్రతి క్లాసులోనూ ఫస్ట్ వస్తూ బాగా చదువుతూండేది. నీకు తెలియందేముంది శైలజా!"

"అవునండీ అప్పుడప్పుడు ప్రొఫెసర్లు కూడా మెచ్చుకుంటూండేవారు ఆమె చాలా తెలివైందనీ..." అంది శైలజ.

"రానురాను సాగర్‌లో మార్పు రాసాగింది. వినూత్నా పేరెత్తితేనే విసుక్కుంటాడు. ఇంటికి తరుచు ఆలశ్యంగా రావడం కూడా మొదలుపెట్టేడు

"ఒకనాడు నేనే కూర్చుని వినూత్నాకి నా కొడుకు వైఖరినంతా పూసగుచ్చినట్లు రాసి ఈసారి సెలవులకి ఒకసారి వచ్చి పొమ్మన్నాను

"సెలవులకి రమ్మంటే సెలవు పెట్టి రెక్కలు కట్టుకొని వచ్చి వాలింది వినూత్నా.

"సాగర్ ఆశ్చర్యపోయేడు. నావైపు అనుమానంగా చూసేడు. నేనేం మాట్లాడలేదు.

"వినూత్నా ఏమీ ఎరగనట్లే "నాకెందుకో మిమ్మల్నిద్దరినీ చూడాలనిపించింది వచ్చేసేను" అంది నవ్వుతూ.

"బావా రెండు రోజులు సెలవు పెట్టుకో. మనం ఊరు చూసి ఎన్‌జాయ్‌చేద్దాం" అంది.

"అబ్బే అదేంకుదరదు. ఎప్పుడు పడితే అప్పుడు సెలవు తీసుకోడానికి నేనేం స్టూడెంటునా! ఉద్యోగంలో వున్నవాణ్ణి. సెలవు కావాలంటే ముందే అప్లై చెయ్యాలి తెలిసిందా! అయినా సాయంత్రం వేగం వచ్చేస్తానులే. రాగానే ఎక్కడికైనా వెళదాం. అందాకా అమ్మతో కబుర్లు చెబుతూ కూర్చో ఓ. కే? " అని ఆఫీసుకి వెళ్ళిపోయేడు.

"అన్నట్లుగానే సాగర్ సాయంత్రం వేగం ఇంటికి వచ్చేడు. వస్తూనే 'అమ్మా త్వరగా తెమలండి. మనం ఫస్ట్ షో సినిమాకి వెళ్దాం' అంటూ వినూత్నావైపు తిరిగి 'నీ కిష్టమైన సినిమా. బోలెడు థ్రిల్లుంటుంది' అంటూ నవ్వేడు.

"వినూత్న 'బావ ఎప్పటిలాగానే వున్నాడు ఏం మార్పులేద'నుకొంది.

"వినూత్నా వున్న రెండు రోజులూ సాగర్ త్వరగా ఇంటికి వచ్చి నన్నూ, వినూత్నానీ ఎక్కడికైనా తీసికెళ్ళేవాడు. ఒకరోజు ఇంట్లో కష్టపడడమెందుకని హోటల్లో భోంచేసివచ్చాము. హాస్టల్లో వినూత్నా వాడుకుంటుందని కొన్ని వస్తువులు ఏవేవో కొనిచ్చేడు. పుట్టెడనుమానంతో వచ్చిన వినూత్నా బండెడు సంతోషంతో వెళ్ళిపోయింది.

"ఆ మర్నాటినుంచీ సాగర్ దినచర్య మళ్ళీ మామూలే అయింది. కొన్నాళ్ళు పోయాక సాగర్‌తో పెళ్ళి ప్రసక్తి తెచ్చాను.

"సాగర్ గతుక్కుమని "ఇప్పుడేం తొందరలే అమ్మా" అన్నాడు.

"కాదురా నాయనా... ఆ మూడు ముళ్ళూ పడిపోతే మీ ఇద్దరి మధ్యా రాకపోకలకు ఎలాంటి ఆక్షేపణా వుండదు. ఎలాగూ వినూత్నా నీకు పెళ్ళామని అంతా చిన్నప్ప



# సచిత్రవిచిత్రం











## మార్లిన్ మన్రో క్లాక్స్




ప్రసిద్ధిగలదేన్నయినా వ్యాపారాత్మకంగా మలుచుకోవటంలో ఘటికులు అమెరికన్లు. శృంగార రసాధి దేవతగా విశ్వవిఖ్యాతురాలైన మెర్లిన్‌మన్రో ఎస్టేట్స్ నుండి, అమెరికన్ పోస్టల్ శాఖనుండి అనుమతులు పొంది, పోస్టల్ స్టాంపు మీద మెర్లిన్‌మన్రో బొమ్మతో ఈ గోడగడియారాల్ని తయారుచేశారొసంస్థవారు. మెయిల్ ఆర్డర్ బిజినెస్ పద్ధతిలో అత్యధికంగా అమ్ముడైన ఈ గోడగడియారాల ధర ఒక్కొక్కటి 720 రూపాయలు.

**UNITED STATES POSTAL SERVICE™**

*Official Licensed Product*

ట్నుంచీ అనుకుంటున్నదే. అలాంటప్పుడు ఇంక పెళ్ళికి అభ్యంతరం ఏమిటీ? అన్నాను.

"వినూత్నా ఇంకా చదువుకోవాలికదమ్మా. చదువైపోయాక చూడొచ్చులే" అన్నాడు సాగర్.

"అది కాదురా నాన్నా పెళ్ళయ్యాక కూడా చదువుకోవచ్చు అలా ఎంతమంది చదువు కోడంలేదు. అదీగాక నువ్వా..." అంటూ ఆగిపోయాను నేను.

"ఏమిటమ్మా నేను... చెప్పు. నువ్వా అంటూ ఏదో చెప్పబోయి ఆగిపోయావుక దమ్మా చెప్పు" అన్నాడు సాగర్. అమ్మ ఏమని తనని అనుమానిస్తోందో తెలిసుకుం దామని.

"ఆ ఏంలేదు లేరా. ఏదో ఊరికేనే అన్నా నులేరా! రా భోజనానికి" అన్నాను నేను.

"నా కాకలిగా లేదు. నువ్వు భోంచేసి పడుకో. నేనిప్పుడు అలా బయటకి వెళ్ళివ స్తాను" అని పిలుస్తున్నా వినిపించుకో కుండా వెళ్ళిపోయాడు సాగర్.

"చీకటిపడ్డాక ఈ వేళప్పుడు ఎక్కడికెళ్ళి పోయాడో, ఏమిటో భగవంతుడా, నా బిడ్డ క్షేమంగా ఇంటికి వచ్చి ప్రశాంతమైన మన స్సుతో వుండేట్టు చెయ్యి భగవంతుడా" అని దేవుణ్ణి వేడుకున్నాను.

"అమ్మా శైలజా కొంచెం కాఫీ ఏదన్నా పుచ్చుకుంటావా? " వినూత్నా అత్తగారు శైల జని అడిగారు, మధ్యలో చెప్పడం ఆపి.

"అహ ఏం వద్దండీ. పోనీ ఒక గ్లాసుడు మంచినీళ్ళివ్వండి. ఆ ఆ వద్దు మీరు లేవ కండి. నేనే వెళ్ళి తెచ్చుకుంటాను" అని లోప లికి వెళ్ళి అక్కడ బాగా మెరుస్తున్నట్టు కడి గిపెట్టిన స్టీలు గ్లాసు తీసుకొని బిందెలో నీళ్ళు ముంచుకొని తాగివచ్చింది. వస్తూ శ్యామలగారికి కూడా ఒక గ్లాసులో నీళ్ళు తెచ్చి అందించి మళ్ళీ బుద్ధిగా కూర్చుని విన సాగింది శైలజ.

శ్యామలగారు మళ్ళీ చెప్పసాగారు.

"వినూత్నా నాన్నగారు, అంటే మా అన్న గారు వీరభద్రంగారు చాలా పెద్దాఫీసరు. వాళ్ళకి బోలెడు డబ్బు. వినూత్నా కాక ఒక అబ్బాయి. వాడి పేరు చరణ్. చాలా తెలి వైనవాడు. వారం తిరక్కుండా మళ్ళీ వినూత్నా- వాళ్ళ నాన్నగారు, తమ్ముడు చరణ్ ముగ్గురూ మనింటికి వచ్చారు.

"అమ్మాయ్ శ్యామలా. ఇదుగో నీ కిష్ట మని మంచి జామపళ్ళు తెచ్చాను" అంటూ ఇచ్చేడు మా అన్నయ్య. నాకు చిన్నప్ప ట్నుంచీ జామపళ్ళంటే ఇష్టం. అదీగాక అన్నయ్య ఎప్పుడూ వట్టి చేతులతో రాడు.

"సాయంత్రం సాగర్ వచ్చేవరకూ కూడా ఎవరూ ఏ విషయం మాట్లాడలేదు. అంతా ఏదో మామూలుగా వచ్చినట్లే ప్రవర్తిం చారు. అందునా వీరభద్రంగారు నన్ను చూడడానికి వచ్చినట్లే చెప్పారు.

"సాగర్ వచ్చి, ఇల్లు కలకలలాడిపో తూంటే చూస్తూనే ఊహించాడు. మామయ్య ఏదో సెటిల్ చేసుకోడానికే వచ్చివుంటాడని,

"ఏంటి మావయ్యా ఉత్తరం పత్తరం లేకుండానే వచ్చారు. అయినా వినూత్నా ఇక్కడికి వచ్చివెళ్ళి వారం కూడా కాలేదు. మళ్ళీ వచ్చేసిందేమిటి? సెలవు పెట్టిందా మళ్ళీ. వాళ్ళత్తయ్యని చూడాలని బెంగేసిందా లేక! ఓహో చరణ్ కూడా వచ్చాడే" అన్నాడు సాగర్, లేని నవ్వును తెచ్చు కుంటూ.

"బావా నీ కోసం నాన్న బెల్లం పాకం పట్టిన జీడిపప్పు తెచ్చారు. నీకిష్టమనీ" అంటూ బావని ఓరగా చూసింది వినూత్నా.

"ఏం అమ్మా! మావయ్యని చూడాలని బెంగేసి రమ్మనమని ఉత్తరం రాసేవా? అత్త మినహా అంతా భయపడి పాపం



సకుటుంబంగా వచ్చేశారు" అని మావయ్య వైపు తిరిగాడు సాగర్.

"ఏం మావయ్యా అంతేనా. అమ్మకి రాను రాను మీ అందరిమీద బెంగ ఎక్కువైపో తోంది. అందుకే భోజనం కూడా ఈమధ్య సరిగా చేయడంలేదు. నీరసించిపోతోంది. పోనీ అమ్మా నువ్వే వెళ్ళి మావయ్యా వాళ్ళింట్లో కొన్నాళ్ళుండి రారాదూ" అన్నాడు సాగర్.

"అత్తయ్యగారు అంటూనే ఉన్నారు. నేనెటూ మాట్లాడలేకపోతున్నాను" అంది వినూత్న వెంటనే నవ్వుతూ.

"బావా నీకు సర్ప్రైజు ఇద్దామని ఇలా చెప్పా పెట్టకుండా వచ్చాం అంతే" అని వినూత్నా "రా అత్తా రాత్రికి కూరేం చేద్దాం. నాన్నకీ, బావకీ కూడా వంకాయ బండప చ్చడి చాలా ఇష్టం. తమ్ముడికి బంగాళాదుం పలు వేయించేద్దాం" అంటూ నేను రాకపో యినా తను వంటింట్లోకి వెళ్ళి వంటప్రయ త్నంలో పడింది.

రాత్రి మా అన్నయ్య మెల్లిగా పెళ్లి ప్రసక్తి ఎత్తాడు. "సాగర్! వినూత్నాకి ఇంకా రెండేళ్లు చదువున్నా మీ అత్తయ్య దాని పెళ్లికి తెగతొందరపడిపోతోందోయ్. అసలి వ్వాళ మీ అత్త కూడా వద్దామని అను కుంది. కాని ఇంట్లో ఏదో అవసరం వచ్చి వుండిపోయింది. వచ్చే మాఘమాసంలో ముహూర్తాలున్నాయి. పెట్టిద్దామనుకుంటు న్నాను" అన్నారు.

"వినూత్నా చదువైపోయాక చూద్దాంలే మామయ్యా" చప్పగా వుందని తెలిసినా ఆ మాటే అన్నాడు సాగర్.

"అలాక్కాదు సాగర్ వినూత్నా కూడా పెళ్ళయ్యాకే మిగతా చదువు చదువుకుందా మనుకొంటోంది. ఇంతకీ నువ్వు ఉద్యో గంలో వున్నావు. మా చెల్లి ఎన్నాళ్లని ఒక్కర్తీ చెయ్యి కాల్చుకుంటుంది చెప్పు.

"ఇంట్లో మేనకోడలు వుండీ పెళ్లికి అందు బాటులో వున్నప్పుడు ఆవిడకేం కర్మ. ఈ వయసులో కూడా కష్టపడటానికి చెప్పు సాగర్" అంటూ అనునయంగా సాగర్‌వైపు ప్రాధేయపడ్తున్నట్లు చూశాడు అన్నయ్య.

సాగర్ లేస్తూ "నేను తర్వాత వినూ త్నాతో మాట్లాడి చెప్తా" అన్నాడు.

"వీరభద్రం అన్నయ్య సంతోషించాడు" అని కాస్సేపు ఆగి శ్యామలగారు ఆయాసం తీర్చుకోసాగింది.

"ఆ తర్వాత కథ నేచెప్తాలే అత్తా మా ఫ్రెండుకి" అని ఎప్పుడు వచ్చిందో వినూత్న గుమ్మంలోంచి ఒక్క ఎగురు ఎగిరి లోపల కొచ్చి పడి శైలజని కౌగిలించుకుంది.

"అబ్బ ఎన్నాళ్లకి చూశానే శైలూ. నిన్ను చూస్తుంటే నాకు మనం చదువుకునే రోజుల్లో గడిచిన దినాలన్నీ జ్ఞాపకమొస్తు న్నాయి. ఏమిటీ మా శ్యామలత్త నా కథ విన్పించి నిన్ను బోర్ కొట్టించేస్తోందా? మా అత్తకి ఒక మనవడో, మనుమరాలో వుంటే ఇలా బోర్‌గా కూర్చోదే. మనిషి చాలా ఆక్టి వ్‌లే. అసలు బావకెన్నోసార్లు చెప్పాను. అత్తకేం తోచడంలేదూ. మనం ఒక ఆడపి ల్లనో, మగపిల్లాడినో కనివ్వాలని" అంటూ కిలకిలా నవ్వేసింది.

అదే నవ్వు. చదువుకునేరోజుల్లో కూడా వినూత్నా ఏవో జోకులేస్తూండటం, ముందుగా తానే నవ్వేయటం చేస్తూండేది. అప్పటికి కాని తన బుర్రకెక్కేది కాదు. బుర్రకెక్కి తను నవ్వుతూంటే ట్యూబులైటు అనేది. మనిషి శరీరంలో కొంచెం పెద్దరికం వచ్చిందేమో కాని కళ్లల్లో ఆ చిలిపితనం, ఆ కిలకిల నవ్వులు మారలేదు. దానికి నచ్చిన వరుడు దాని బావ. ఆ బావనే పెళ్లి చేసుకొని ఆనందజలధిలో తేలిపోతోందన్న మాట. సుఖసంసారం సాగిస్తోంది. జీవి తంలో వినూత్న కోరిన కోరికను సాధించి తన మాటని నిలబెట్టుకొన్నదన్నమాట.

అయితే శైలజ అభిప్రాయాలు తారు మారు కావటానికి ఎంతోసేపు పట్టలేదు. రాత్రి భోజనాల దగ్గర కూడా వినూత్నా ఏవో విషయాలు మాట్లాడుతూనే వుంది.

"మా శ్యామలత్తయ్య వుంది చూశావూ శైలజా! నిన్నటివరకూ రెండు కూరలూ, పచ్చళ్లూ, పులుసూ అన్నీ ఎన్ని చేసిందనుకొన్నావు. ఇవ్వాళ వంట్లో బాగులేదని ఏం చెయ్యొద్దనీ, పప్పూ, చారు చాలని గట్టిగా చెప్పి వెళ్ళిపోయాను. పాపం నా వల్ల మా అత్తయ్యకి కూడా అప్పుడప్పుడు కూరలూ అవీ మానేసి పథ్యంతిండి తినాల్సివస్తోంది' ' అంది వినూత్న.

"మరి మీ ఆయనకి కూడా పథ్యమేనా పాపం" అంది శైలజ నవ్వుతూ.

"ఒక రహస్యం చెప్పనా శైలూ" అంటూ కొంచెం దగ్గరగా జరిగి స్వరం తగ్గించి "రోజూ బావ ఇంటికొచ్చేముందు హోటల్లో మస్తుగా తనకి కావల్సినవి తినేసి వచ్చేస్తాడు. ఆరోజు ఇంట్లో ఏం వండారు అన్నది కూడా అతనికి తెలియదు"

"ఓ అలానా అవునూ మీ బావ ఇంకా రాలేదేమిటి. అతను రోజూ లేటుగానే వస్తూంటాడా? " అంది శైలజ.

"లేటంటే లేటు కాదులేవే. దాన్నే షిఫ్టు డ్యూటీలంటారు. అన్నట్లు ఇవ్వాళ ఏం వారం? సోమవారంకదూ- ఈ వారం అంతా నైట్ డ్యూటీలు. పగలు ఓవరువర్కు చేస్తారు. వచ్చేవారం అంతా పూర్తిగా శలవు ఇచ్చేస్తారు. ఈ వారం అంతా మాకు సింపుల్ మీల్స్. బావ లేకపోతే అత్తయ్యకీ నాకు కూడా అన్నీ కట్. పాపం మాతో పాటు తనకీ కట్. ఏం చేస్తాం. ఏం అత్తా రేపేదన్నా మంచి కూరా అదీ చేసుకుందామా. పోనీ నన్ను కాలేజీకి శలవు పెట్టేయమన్నావేమిటి. రాకరాక మా ఫ్రెండు గారు వచ్చారు నన్ను చూడ్డానికి. ఊ... చెప్పవే శైలూ న్యూజిలాండు కబుర్లు. నా సంగతులన్నీ ఏమంత ఇంట్రస్టింగ్‌గా వుండవులే. అయినా మా శ్యామలత్తయ్యకి న్యూజిలాండు కబుర్లంటే మహా ఇష్టం. ఏం అత్తా మరి తొందరగా వచ్చి కూర్చో నువ్వూ విందువుగాని" అంది వినూత్నా గడగడా వాగేస్తూ.

వినూత్న మాటలకి వాళ్లత్తగారు బాగా అలవాటుపడిపోయివుంటారు. "మీ స్నేహితులిద్దరూ కబుర్లు చెప్పుకుంటూండండి. నేనిప్పుడే వస్తాను" అంటూ వంటింట్లోకెళ్ళిందావిడ.

వినూత్న ఇటు శైలజవైపు తిరిగి "అయితే మా శ్యామలత్తయ్య ఏమిటి నీతో అన్నీ మా గురించి చెప్పేసినట్లుంది" అంది.

"అన్నీ ఎక్కడా నీ పెళ్లిదాకా కూడా రాలేదు. నువ్వొచ్చేసేవు" అంది నవ్వుతూ శైలజ.

"శైలూ న్యూజిలాండులో నీ ఉద్యోగం ఎలా వుందే? అక్కడ వుంటే నీకు మేమంతా జ్ఞాపకం వస్తామా. నీకాదేశపు వాతావరణం బాగా పడినట్లుంది. నువ్వు తెల్లగా అయిపోయావు. బాగా డబ్బు కూడా సంపాదించి వుంటావు. అవునా..."

"అవుననుకో. అయినా వినూత్నా నీకూ రావాలని వుంటే నువ్వూ రావచ్చు ఇక్కడ ఇలా పార్ట్‌టైం ఉద్యోగాలూ, ప్రైవేటు ఉద్యోగాలూ మానేసి ఎంచక్కా నువ్వూ, మీ బావా, మీ శ్యామలత్తయ్యా అంతా హాయిగా..."

"నాకేం రావాలనిలేదు శైలూ" వినూత్నా శైలజ మాటల్ని మధ్యలో తుంచేస్తూ అంది. "అదీగాక మా బావ తన ఉద్యోగం వదులుకొని రాడు. ఈ ఊరు వదిలి అసలే రాడు. నీకు తెలియనిదేముంది శైలూ. బావనొదిలి నేను రాలేను. మా ఇద్దర్నీ వదిలి శ్యామలత్తయ్య రాలేదు. మా సంగతి వదిలేయ్. నీ విషయాలు చెప్పు. నువ్వింకా పెళ్లెందుకు

చేసుకోలేదూ" అంది వినూత్న.

"జీవితంలో స్థిరపడాలంటే పెళ్ళొక్కటే ముఖ్యమా" అంది నవ్వుతూ శైలజ.

"అదొక్కటే కాదనుకో. ఆ రోజుల్లో నువ్వు అంటూండేదానివికదా శైలూ- 'నాకు నచ్చిన వాడూ, నన్ను మెచ్చినవాడూ వస్తేనే చేసు కుంటా'నని. మరి అలాంటివాడెవడూ నీకింకా తారసపడలేదా- చెప్పు"

"తారసపడ్డంత మాత్రాన పెళ్ళిళ్లయిపో తాయా యేంటి వినూత్నా. అయినా అందరూ నీలాగ పట్టుదలతో అనుకున్న వన్నీ సాధించలేరు. నిన్నా విషయంలో మెచ్చుకోవాలి. నీ జీవితాన్ని నువ్వింతలా చక్కగా తీర్చిదిద్దుకోగలవనుకోలేదు. ప్రేమించి పెళ్లాడిన భర్తా, మేనత్తే అత్త గారూ- ఇటువంటి వందరికీ సమకూరు తాయా? అత్తా ఆడపడుచుల సాధింపులే ఎరుగవు. బావే భర్త కనుక లాలింపులే కాని తాలింపులెరుగవు" అంటూ శైలజ నవ్వింది.

"తాలింపులంటే ఏంటే..." అంది వినూత్న శైలజ నవ్వులో నవ్వు కలుపుతూ.

"తాలింపులంటే- కూరలకి తాలింపులు పెట్టినప్పుడు ఆవాలూ అవీ వేయిస్తామా, అవి చిటపటలాడతాయికదా. అదన్నమాట' ' అంది శైలజ.

"ఓహో చిటపటలు- తెలిసింది. అంటే కోపతాపాలూ, ఖస్సుబుస్సులు ఇలాంటివేమీ మాకు లేవంటావు. అవునులే ఒకవిధంగా నేనదృష్టవంతురాలినే. ఇంతకీ నువ్వేమన్నా నీ విషయాలు చెబుతావా లేక నాకు నిద్ర ముంచుకొస్తోంది పడుకోమన్నావా. కావా లంటే రేపు శలవు పెట్టుకుంటాను" అంటూనే ఆవులించి అప్పుడే సగం నిద్రలోకి జారుకుంది వినూత్న.

"పాపం వినూత్నా బాగా అలిసిపోతోంది. అందుకే తనుండగానే నిద్రలోకి జారుకుంది ' అనుకుంది శైలజ

"నువ్వు రామ్మా శైలజా భోంచేద్దువుగాని. వినూత్నా రోజూ ఇంతే. ఇంటికి రాగానే కాస్సేపు నిద్రపోయి అప్పుడు లేచి భోంచేసి, మళ్ళీ నిద్రపట్టేవరకూ ఏ మాగజైనో పట్టుకు కూర్చుని తర్వాత మళ్ళీ నిద్రపోతుంది. తెల్లారితే మళ్లీ జీవితం ప్రారంభం. ఒకటే జీవితం. ఇక్కడందరిదీ గానుగెద్దు వ్యవహా రమే. వేళకింత తిండీ కళ్లకింత నిద్రా వుండి చావవు. మనదేశంలో కష్టం ఎక్కువ. జీతాలు సరిగా వుండవు. దాని ప్రాణానికి నేనొక గుదిబండ తగుల్కొన్నాను"

ఆఖరి మాటలంటూంటే వినూత్నా అత్త గారి గొంతు జీరబోయింది. చీరకొంగుతో కళ్లు తుడుచుకుంటూ నెమ్మదిగా లోపలికెళ్ళి కంచాలూ, అవీ పెట్టసాగింది.

శ్యామలగారి మాటలు శైలజని చాలా ఆశ్చర్యపరచాయి. కలవరపరచాయి కూడాను. ఆవిడ తానెందుకొక గుదిబండ నని అనుకుంటున్నారు. తల్లికింత తిండి పెట్టి పోషించే బాధ్యత కొడుక్కి లేదా? వినూత్నా వాళ్ళత్తగారితో బాగానే వుంటున్న ట్లుంది. కాకపోతే సాగర్ ఆమెనేమన్నా సూటి పోటి మాటలంటాడా ఏమిటి? వినూత్నా కెంతవేగం నిద్రపట్టేసింది. నిద్రలో ఆమె ముఖం ఎంత అమాయ కంగా, పసిపిల్లలా వుందో! శైలజ ఆలోచి స్తోంది. వినూత్నాని భోజనానికి లేపాలా వద్దా!

"అయితే ఆంటీ మనిద్దరం తినేద్దామం టారా! లేక వినూత్నా లేచేవరకూ వుందామా? ఆంటీ"

"ఒద్దమ్మా! వినూత్నా లేచి ఒక్కతే తింటుంది. నేను తన కోసం కూచుంటే కోప్పడుతుంది. వినూత్నా నిద్ర లేచి భోంచే సేటైముకి నేను భోంచేసి నిద్రపోతూండాలి. అది వినూత్నా కోరిక, ఆజ్ఞ కూడాను"

"సరేలెండి ఆంటీ, మనిద్దరం తినేద్దాం" అని శైలజ భోజనానికి లేచింది.

అసలే ఆకలిగా వుందేమో పదార్థాల రుచుల్ని మెచ్చుకుంటూ ఆవురావురంటూ మరీ తినేసింది.

"ఆంటీ ఇంత మంచి భోజనం ఎన్ని యుగాల తర్వాత తిన్నానూ! పెద్దవాళ్ల చేతి వంటలో అమృతం, ఆప్యాయత రెండూ వుంటాయంటారు. ఇందుకే కాబోలు వినూత్నా మిమ్మల్ని, ఇండియానీ వదలి రానంటుంది" అంది శైలజ.

శైలజ మాటలు ఆవిడకి సంతోషాన్ని కల్గించినా ఎక్కడో మనసులో ఓ మూల మూలుగుతూనే వుంది. అప్పుడప్పుడా ఛాయలు ఆమె ముఖంలో కన్పించకపో లేదు. ఇద్దరూ చేతులు తుడుచుకుంటూ డ్రాయింగు రూములోకి వచ్చి కూర్చున్నారు.

"అమ్మా శైలజా నీకు భోంచేసేక వక్క పొడి లవంగమూ అలాంటివి వేసుకోడమే దైనా అలవాటుందా? నేను లవంగముక్కే తింటాను" అన్నారు. ఆవిడ చిన్న స్టీలు డబ్బా తెరిచి లవంగం నోట్లో వేసుకుంటూ.

"అబ్బే అలాంటి మంచి అలవాట్లేమీ నాకు లేవండీ" అంది నవ్వుతూ శైలజ.

"మంచో చెడో నా కలవాటయిపోయి మానలేకున్నానమ్మా. నావల్ల వీళ్ళకిదొక ఖర్చా" అన్నారు ఆవిడ చిన్నగా నవ్వుతూ.

"ఆంటీ మీకు నిద్రవస్తే పడుకోండి. నేను వినూత్నా లేచేవరకు మేలుక్కూర్చుంటాను. ఫరవాలేదు" అంది శైలజ.

"అబ్బే నాకప్పుడే నిద్రేమీ రావడం లేదమ్మా. నేనూ నీతోపాటు కాస్సేపు కూర్చుంటాను"

కొంచెంసేపు ఇద్దరూ మౌనంగా కూర్చుం డిపోయారు. ఎవరు ముందు ఏం మాట్లా డాలా అని ఆలోచిస్తున్నారు.

ఆ ఇంట్లో రెండు బెడ్‌రూములూ, ఒక డ్రాయింగు రూమూ, ఒక కిచెనూ వున్నాయి. డ్రాయింగు రూముకి ముందు ఒక చిన్న వరండాలాంటిది వుంది. అక్కడ చెప్పులూ అవీ విడిచేసి ఇంట్లో అడుగుపెడ తారు. డ్రాయింగు రూమ్‌లో ఎదురుగా గోడమీద శ్రీ వెంకటేశ్వరస్వామీ, అలమేలు మంగమ్మా కలిసివున్న ఫొటోఫ్రేమ్ వుంది. దానికి ఎదురుగా గోడమీద వినూత్నా అత్త గారు మామగారు వున్న ఫొటో వుంది. రూమ్‌లో కేనుతో చేసిన సోఫాకుర్చీలు వున్నాయి. మధ్యలో టేబిలూ, టేబిలుమీద ప్లాస్టిక్ పూలున్న అందమైన ఫ్లవర్‌వేజు వున్నాయి. ఇంకా చిన్న చిన్న ఫొటోలు సీన రీలు కూడా గోడలమీద వున్నాయి. ఇల్లంతా నీటుగా వుంది. ఎక్కడ పెట్టిన వస్తువులు అక్కడే వున్నాయి.

శైలజ టైం చూసుకుంది. రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది. వినూత్నాని చూసేక శైలజలో కొన్ని అనుమానాల భావతరం గాలు వువ్వెత్తుగా లేచి పడసాగాయి. "వినూత్నా ఏమిటీ మనిషి. నిజంగా సుఖ పడుతోందా? లేక తనని తాను మభ్యపెట్టు కుంటూ ఏదో కాలక్షేపం చేస్తోందా. ఆమె భర్త ఆమెని బాగా చూసుకుంటున్నాడా? లేదా? అత్తగారు మాత్రం వినూత్నాని ఎంతో ప్రేమతో చూసుకుంటున్నారు. వినూ త్నాకి ఇంకా పిల్లలు ఎందుకు పుట్టలేదు. వాళ్లు అప్పుడే వద్దనుకున్నారా? వినూత్నా నిద్రలేస్తే శైలజ ఎన్నో విషయాలను అడగా లనుకుంది. వినూత్నా నిద్రపోయిన తీరు చూస్తే ఆమెకిప్పుడిప్పుడే తెలివి వచ్చేటట్లు లేదు.

"ఆంటీ" పిలిచింది శైలజ.

"ఏమ్మా" వినూత్నా అత్తగారు శైలజ ఏమ డుగుతుందో అని ఏం జవాబివ్వాల్సొస్తుందో నని మనసులో అనుకుంటూనే ఎదురు చూడసాగారు.



"వినూత్నా భర్త నైట్‌డ్యూటీ కనుక ఈ రాత్రికి రాడేమో. రేప్పొద్దున్న ఎన్ని గంటలకు వస్తారండీ? "

"ఏమోనమ్మా ఒకొక్కప్పుడు ఎనిమిది గంటలకు వస్తాడు. లేకపోతే ఒక్కొక్కసారి తొమ్మిది, పదిగంటలు కూడా అయిపోతుంది"

"అయితే ఆంటీ నేనివ్వాళ్టికి వెళ్ళిపోతాను. వినూత్నా లేచి అడిగితే వచ్చే ఆదివారం వస్తానన్నానని చెప్పండి. ఆదివారం తనకె లానూ శలవుంటుంది. ఈలోగా తనకి వీలు దొరికితే నేను మెడికల్ కాలేజీ వుమెన్స్‌హాస్టల్లో డాక్టరు మాధురీ దగ్గర దిగాను.

అక్కడికి వచ్చి నన్ను కలవమనండి. లేదా సాయంత్రం పూట బీచ్‌వద్ద కూడా కలవవచ్చు నాకు వేరే పని వుంది ఆంటీ. ఇంక వెళ్ళివస్తాను" అంటూ శైలజ మరోసారి వాచీవైపు చూసుకుంటూ లేచింది.

"వినూత్నా ఇంకాసేపట్లో లేస్తుందమ్మా. రాత్రి చాలాసేపు మేలుక్కూర్చుంటుంది. నువ్వుంటే మీ ఇద్దరూ మీ పాత స్నేహపు రోజుల గుర్చి మాట్లాడుకోవచ్చు వినూత్నాకి కొంత ఉత్సాహం కూడా పుట్టుకొస్తుంది. కాస్సేపు కూర్చోమ్మా శైలజా" అన్నారు శ్యామలగారు ప్రాధేయపడ్తున్న ధోరణిలో.

"నేను మళ్ళీ తప్పక వస్తానండీ ఆంటీ! మిమ్మల్ని చూడడానికైనా వస్తాను" అంటూ శైలజ హేండ్‌బాగ్‌ని తీసుకొని జోళ్ళు తొడుక్కుని "ఆంటీ నమస్కారం" అని వీధిలోకి వచ్చి రిక్షా కేకేసి హాస్టలుకి వెళ్ళిపోయింది.



శైలజ హాస్టలుకి చేరిందేకాని చాలాసేపటివరకూ నిద్రపోలేదు. తన స్నేహితులందరి గురించి ఆలోచించసాగింది. ఎవరు సుఖంగా ఆనందంగా వున్నారో తెలుసుకోలేకపోతోంది. వాళ్ళు తన గురించి అడిగితే తానేం చెప్తుంది. ఆలోచనలతో బుర్ర వేడెక్కి ఎప్పుడు నిద్రాదేవి ఒడిలో జారుకుందో మరి నిద్రపోయింది.

మర్నాడు బాగా పొద్దెక్కేవరకూ లేవలేకపోయింది శైలజ. శైలజ స్నేహితురాలు మాధురి రాత్రి పొద్దుపోయి వచ్చినా పొద్దున్నే డ్యూటీకి వెళ్ళడానికి లేచింది.

మాధురి ఉత్తర హిందూస్థానం నించి వచ్చిన అమ్మాయి. ఇంకా పెళ్ళిచేసుకోలేదు. మెడికల్ కాలేజీలో పనిచేస్తూ హాస్పిటల్‌లో ఎమర్జన్సీ కేసులూ అవీ కూడా చూస్తుంది. తను అప్పట్నుంచీ హాస్టల్లోనే వుండిపోయింది. పొద్దున్నే శైలజకి కాఫీ బ్రేక్‌ఫాస్ట్ అరేంజి చేసి తనకి క్లాసువుంటే వెళ్ళిపోయింది.

శైలజ లేచి బ్రష్ చేసుకొని కాఫీ తాగింది. టేబిలుమీద బ్రేక్ ఫాస్టు అలానేవుంది. మాధురీ ఒకవేళ వస్తుందేమో, వస్తే ఇద్దరూ కలిసే తినొచ్చులే అని కుర్చీలో కూర్చొని అక్కడే వున్న మాగజైనులు తిరగెయ్యటం మొదలుపెట్టింది. అందులో

'వరుడు కావలెను' అనే కాలమ్ కత్తిరించి వుంది. ఆ కత్తిరించబడిన భాగం కూడా అదే పత్రికలో వుంది. శైలజ దృష్టి దాని మీద పడింది.

అతని పేరు చంద్ర. "రంగు తెలుపు. ఎత్తు 5' 9' అంగుళాలు. తెల్లని అందమైన అమ్మాయి కావలెను. వధువు డాక్టరుకాని ఇంజనీరు కాని అయివుండవలెను. వయసు 30 లేక 32 సం. లలోపు వుండవలెను. కుల మత భేదాలు లేవు. కట్నకానుకల ప్రసక్తి లేదు. వరుడు అమెరికాలో బిజినెస్ చేస్తూ వుంటున్నందున అమెరికాలో నివాసం వుండదలచినవారే తమ ఫొటోతోసహా ఈ క్రింది చిరునామాకు వ్రాయవలెను"

ఆ చిరునామా శైలజ ఎప్పుడో ఎక్కడో విన్నదిలాగానే వుంది. 'చంద్ర' ఎవరు చెప్మా? శైలజ తనకి తెలిసినవాళ్ళల్లో ఎవరై వుంటారు చెప్మా అని వూహించసాగింది. చిరునామాని మళ్ళీ చూసింది. చిరునామాలో అతను డాక్టరు అని రాయలేదు. కాబట్టి ఇతను డాక్టరు చంద్ర కాకపోవచ్చును. మాధురి ఈ కత్తిరింపు అట్టే పెట్టుకున్నదంటే తనుకాని ఆ అబ్బాయిని వివాహమాడగోరి తన ఫొటోని ఆ అబ్బాయి ఎడ్రసుకి పంపిస్తోందా?

శైలజ ఆ కత్తిరింపు కాగితాన్ని ఎలాగ ఎక్కడ వుందో మళ్ళీ అలానే పెట్టేసింది. పత్రిక కూడా మూసి మళ్ళీ యథాస్థానంలో పెట్టేసి ఆలోచిస్తూ కూర్చుంది. శైలజ మనసు కవితనీ లలితనీ కూడా చూడాలని ఉవ్విళ్ళూరుతున్నది. మాధురి లంచ్‌కి వస్తే వాళ్ళిద్దరి గురించీ అడిగి తెలుసుకొని వెళ్ళాలనుకుంది. కాని మాధురి ఆవేళ ఎందుకో లంచ్‌కి హాస్టల్‌కి రాలేదు. శైలజ భోంచేసి వినూత్నని కాలేజీలో కలుద్దామని బయలు దేరింది.

వివరాలు పట్టుకొని రిక్షా కట్టించుకొని వినూత్న దగ్గరికి వెళ్ళింది. కాని ఆరోజెందుకో వినూత్న సెలవు పెట్టిందిట. హాస్పిటల్‌కు కూడ రాలేదన్నారు. వినూత్న సెలవు ఎందుకు పెట్టిందో శైలజకి అర్థంకాలేదు. రాత్రి తను వాళ్ళింటినుంచి వచ్చేవరకూ బాగానే వుందే? వాళ్ళత్తమ్మగారు కూడా బాగానే వున్నారు. మరి ఎందుకు సెలవు పెట్టుకున్నట్లు? పోనీ తను మళ్ళీ వాళ్ళింటికి వెళ్దామా అని అనుకొని ఆ అభిప్రాయాన్ని విరమించుకొంది శైలజ.

సాయంకాలం నాలుగు గంటలయింది. శైలజ బీచ్ వద్దకు వచ్చి కూర్చుంది. ఇంకా ఎండగావుంది. కొబ్బరి బొండాం కొనుక్కోనీ నీళ్ళు తాగింది. వేరు శనగ పప్పు, బజ్జీలు కొనుక్కుని తింది. ఏదో నోటి తీటకి తినే సిందికాని కడుపులో పడ్డాక గాభరాగా అనిపించింది.

ఎలాగో అయిదయ్యే వరకూ కూర్చుంది. పిల్లలంతా ఒక్కొక్కరే రావడం మొదలుపెట్టేరు. మరి కాస్సేపట్లో ఆడా, మగా, పిల్లా పెద్దా అంతా చేరుకోసాగారు. కెరటాలు ఒకదాని వెనుక ఒకటిగా ఉవ్వెత్తుగాలేచి పడుతున్నాయి. కెరటాల మీంచి వచ్చేగాలి సన్నటి నీటి తుంపరలను విసురుతున్నాయి. పోనుపోను వాతావరణం రమణీయంగా కన్పించసాగింది. సాయంసంధ్య, సూర్యాస్తమయం, చల్లటి పిల్లగాలులు, నీటి తుంపరలు, ఎగిరి పడే కెరటాలు అన్నీ అందంగా కన్పించసాగాయి. శైలజ ఎంతో తన్మయతతో తిలకించసాగింది.

"ఆంటీ! బఠానీలు తినండి" అంటూ రాముం చిన్నారి చేతులతో శైలజ నోటిదగ్గర బఠానీలు పెట్టేవరకు శైలజ వులిక్కిపడి ఈ లోకంలోకి వచ్చిపడింది.

"ఏదో ఊహాలోకంలో వున్నట్లున్నారు" వినోద్ పలకరింపుగా నవ్వుతూ అన్నాడు.

"అహ ఏంలేదు" అంది శైలజ.

"బఠానీలు నువ్వే తిను బాబూ" అంటూ

బాబుకి తినిపించింది శైలజ.

"వినూత్నాని కలిశారా? " వినోద్ అడిగేడు.

"ఆ చూసి వచ్చేను" అంది శైలజ వినోద్ ముఖంలోకి చూస్తూ. అతను ఏమైనా వాళ్ళ విషయాలు చెప్పడానికి ప్రయత్నిస్తాడేమోనని.

"ఇవ్వాళ మళ్ళీ వినూత్నాని కలవాలని హాస్పిటల్‌కి వెళ్ళేను. కాని వినూత్నాలేదు. రాలేదుట. సెలవు పెట్టింది"

"ఓహో" అన్నాడు వినోద్.

శైలజనే చూస్తూన్న వినోద్ బుర్రలో ఎన్నో ఊహలు మెదుల్తున్నాయి. శైలజ గురించి ఎన్నో విషయాలు అడిగి తెలుసుకోవాలనుకుంటున్నాడు. కాని సంభాషణ ఎలా మొదలుపెట్టాలో, ఏమేం ప్రశ్నలు వేయొచ్చో, ఏ విషయాలు మాట్లాడితే ఆమె ప్రసన్నంగా మాట్లాడుతుందో తెలియడంలేదతనికి. బాబు దూరంగా ఇసుకలో గూళ్ళు కట్టుకుంటూ ఆడుకుంటున్నాడు.

"ఇవ్వాళ మా అమ్మ కూడా బీచ్‌కి వస్తానంది" వినోద్ అన్నాడు శైలజవైపే చూస్తూ.

శైలజ ఏదో ఆలోచిస్తూ "ఓహో అలాగా" అంది.



"అమ్మ ప్రత్యేకించి నిన్ను చూడ్డానికే వద్దామనుకుంటోంది శైలజా" అన్నాడు వినోద్.

"ప్రత్యేకించి నిన్ను చూడ్డానికే" అన్న మాటలకి శైలజ వులిక్కిపడి ఆలోచనలోంచి తేరుకుని, "నన్ను చూడ్డానికా ఎందుకూ నేనే వస్తానులే మీ ఇంటికి ఒకనాడు. నాకోసం

స్పెషల్‌గా ఏమీ వండక్కరలేదు. నేను ఏ కూరలు వండినా తింటాను. ఏమీ లేకపోతే ఏ పచ్చడో, చారో, పులుసుతోనో తినేయగలను. వినోద్, అడుగో బాబు నీళ్ళవైపు వెళుతున్నాడు. వెళ్ళి తీసుకురండి"

"వీడెప్పుడూ ఇంతే" వినోద్ విసుక్కుంటూ లేచాడు.

"వెధవా ఎన్నిసార్లు చెప్పేను నీళ్ళవైపు వెళ్ళొద్దని" అంటూ వీపు మీద రెండు చరచి తనతో తీసుకువచ్చేడు. "ఇక్కడే ఆడుకో అల్లరి చేస్తే ఆంటీకొడ్తారు" అంటూ "వీణ్ణి వాళ్ళమ్మమ్మ వాళ్ళింట్లో దింపి వద్దామనుకుంటున్నా"నన్నాడు వినోద్.

వీపు మీద చరచిన దెబ్బలకి ముఖం కొంచెం చిన్నదైనా మళ్ళీ మర్చిపోయి ఆడుకోసాగాడు రామం.

శైలజ ఎందుకో ఇవన్నీ ఇవ్వాళ పట్టించుకోకుండా "వినోద్ మీరు నాకు కవిత ఎడ్రసు కూడా ఇవ్వండి. నేనొకసారి వెళ్ళి చూసి వస్తాను" అంది.

వినోద్ ఇవ్వాళ శైలజతో ఎన్నో విషయాలు ప్రేమగా మాట్లాడదామనుకొన్నాడు. కాని కొంత పిల్లవాడి అల్లరీ, కొంత శైలజ విముఖతా అతనికి చికాకును కల్గిస్తున్నాయి. దానికితోడు కవిత ఎడ్రసు శైలజ అడగగానే అతని మనస్సు కూడా విషాదాన్ని ఆవరించింది.

"అయితే కవిత గురించి నీకేమీ తెలియనే తెలియదా శైలజా" అడిగాడు వినోద్.





"ఏం ఏం జరిగింది వినోద్, నేను ఈ కంట్రీలోనే లేనుకదా! ఇంతకీ ఎక్కడ వుంది కవిత? ఉద్యోగం చేస్తోందా? మానేసిందా? అసలు మనందరిలోకీ మొట్టమొదట జాబ్ దొరికి జాయిన్ అయింది కవితేకదా"

"శైలజా ఐయామ్ సారీ, కవిత మనకిక లేదు. ఆత్మహత్య చేసుకొంది"

శైలజ ఒక్కసారిగా 'వినోద్' అని షాకు తిన్నంత గట్టిగా అరిచి అలానే వుండిపోయింది.

వినోద్ తల వంచుకు కూర్చుని ఇసుకలో గీతలు గీయసాగాడు. కొంచెంసేపు పోయాక తేరుకుని శైలజ అడిగింది.

"ఏమిటి వినోద్ ఇదంతా ఎలా జరిగింది. కవిత అంతపిరికిదని నేనెప్పుడూ అనుకోలేదు. అయినా ఆత్మహత్య చేసుకొని చనిపోయేటంత ఖర్మ దానికేం పట్టింది. మెడిసిన్ చేసి డాక్టరయింది. తన డబ్బు తను సంపాదించుకుంటోంది. ఎవరిమీదా ఆధారపడక్కరలేదు. ఎవరిచేతా ఏమాటా పడక్కరలేదు.'

"నిజమే అనుకో. ఎవరి కుటుంబంలో ఎలాంటి గొడవలుంటాయో మనకేం తెలుసు. వాళ్ళూ వీళ్ళూ అనుకొన్న మాటల్ని బట్టి కుటుంబంలో జరిగిన అవమానాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకుందని విన్నాము అంతే" అన్నాడు వినోద్.

శైలజ మనసు బాధతో మూలిగింది.

వినోద్ కూడ ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. 'ఇవ్వాళ బాబుని తీసుకొని బీచ్‌కి ఎందుకు వచ్చానా' అని అనుకున్నాడు. అమ్మ రాకపోవడమే మంచిదయింది. ఇలాంటి వాతావరణంలో అమ్మ శైలజతో మాట్లాడేందుకు ఇరకాటంలో పడేది.

కొంచెం సేపయ్యాక వినోద్ అన్నాడు, "బాధపడి ఎవ్వరం ఏమీ చెయ్యలేము శైలజా. ఎవరికర్మ వాళ్ళది"

"అలా అని వదిలేయగలమా వినోద్. ఆపదలలో ఒకరినొకరు ఆదుకోడమే స్నేహ ధర్మం. మనం ఇంతమంది వున్నాము. ఎవ రమూ కూడా కవితకెలాంటి సాయమూ చేయలేకపోయేము. ఎందుకిలా జరిగిందో నేను ఊహించలేకపోతున్నాను" అంది శైలజ.

తరువాత చాలా సేపటివరకూ ఇద్దరూ ఏంమాట్లాడలేదు. అలా ఎగిరి పడే కెరటాల వంకే చూస్తూండిపోయారు.

కొంచెం సేపయ్యాక వినోద్ లేచి బాబుని ఎత్తుకొని, "శైలజా ఇవ్వాళ ఇంట్లో కొంచెం పనుంది. అమ్మ నా కోసం చూస్తూం టుంది. నేను వెళ్ళొస్తాను. నువ్వు తప్పక మా ఇంటికి రావాలి సుమా" అన్నాడు వెళ్ళ బోతూ.

"వినోద్! కవిత గురించి ఇంకా తెలుసు కోవాలనుందికాని ఇప్పుడింక నా మనస్సు ఏమీ బాగులేదు. నేను హాస్టల్‌కి వెళ్లిపో తాను" అంటూ శైలజ కూడా లేచింది.

శైలజ హాస్టలు చేరేసరికి మాధురి రూములో శైలజకోసం ఎదురుచూస్తోంది.

"శైలజా ఎక్కడికెళ్ళిపోయావు. సాయంత్రం నన్ను వేగం రమ్మన్నావుకదా! మనిద్దరం ఎవరింటికో వెళ్ళాలి సర్ప్రైజు అన్నావు. ఇదుగో నేను వేగం వచ్చి నీకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. నువ్వేమో రూములో లేకుండా నాకు సర్ప్రైజు ఇచ్చేవు. ఇంతకీ ఎక్కడికెళ్ళావేటి? ముఖం ఏమిటి? అలా నల్లగా మాడిపోయింది. ఏదన్నా విషం మింగావా ఎక్కడన్నా? జాగ్రత్త మన దేశంలో ఎప్పుడెక్కడ ఏం జరుగుతుందో కూడా ఊహించలేము. ఇంతకీ ఏంజరి గింది. నువ్వెక్కడికెళ్ళావు? " అంది మాధురి గుక్కతిప్పుకోకుండా.

"మాధురీ ముందు ఓ కప్పు వేడి కాఫీ ఇవ్వవే, తల బద్దలైపోతోంది"

"తలనొప్పా, నేననుకున్నాలే. లేడికి లేచిందే ప్రయాణమన్నట్లు ఎండలో ఎక్కడె క్కడికో తిరిగుంటావు. ఇదుగో ఇంద ఈ టాబ్లెట్ వేసుకొని కాఫీ తాగు" అని మాధురి శైలజకి టాబ్లెట్టిచ్చి కాఫీ చేసి చ్చింది. కాఫీ ఇన్‌స్టంట్ పొడి వగైరాలన్నీ హాస్టల్లో తన రూములో ఎప్పుడూ వుంటాయి మాధురికి.

శైలజ మంచంమీద పడుకుంది. మాధు రికి శైలజ వైఖరి అర్థంకాలేదు. శైలజకి ఏమైె నట్లు. ఏదైనా మాట్లాడించవచ్చా కూడదా!

ఇద్దరూ కాస్సేపు మౌనంగా వుండిపో యారు.

శైలజ కొద్దిగా కళ్ళు తెరచి "మాధురీ మన కవిత ఆత్మహత్య చేసుకుందిటకదూ" అంది.

మాధురికి ఇప్పటికి అర్థమయింది. శైలజ ఎందుకలా అయిపోయిందో. అయితే ఈ వార్త శైలజకెవరు చెప్పేరో, ఎలా వచ్చిందో మాత్రం ఇంకా ఊహించలేకపోయింది.

"అవును శైలూ"

మాధురి శైలజని ప్రేమగా పిలిచినప్పుడు అప్పుడప్పుడూ శైలూ అంటుంది.

"అవును శైలూ కవిత మనల్ని అన్యాయం చేసిపోయింది"

"కవిత మనల్ని అన్యాయం చేసిపో యిందా? లేక కవితకే అన్యాయం జరిగిపో యిందా? అసలేం జరిగింది? కవిత ఆత్మ హత్యకి కారణం ఏవో కుటుంబ కలతలని విన్నాను. డాక్టరయి వుండీ ఇంత పిరికిది ఎలా అయిందే కవిత? " శైలజ రొప్పుతూ అడిగింది.

"డాక్టరవనీ, బండరాయికానీ పరిస్థితుల ప్రభావం మనుషుల్ని పీడిస్తూంటే మనమేం చెయ్యలేము" మాధురి కూడా కోపంతో ఊగిపోతున్నది. ఆమె మనస్సు కూడా చెప్ప లేని బాధతో కుతకుతలాడిపోతున్నది.

మాధురినా స్థితిలో చూసేక శైలజ తను కొంచెం శాంతించటం మొదలుపెట్టింది.

అయితే మిత్ర బృందం అంతా కూడా కవిత గురించి బాధపడ్తున్నారన్నమాట.

మాధురి అడిగింది. "అయితే కవిత ఆత్మ హత్య చేసుకుంది అని నీకు చెప్పిన వాళ్ళే మిగతా వివరాలు కూడా ఎందుకు చెప్ప లేదు? లేక నువ్వే వినలేక వచ్చేశావా! ఇంతకీ నీకావార్త చెప్పిన వాళ్ళెవరే శైలూ"

"మన డాక్టరు వినోద్, మూడు రోజుల నుంచి బీచ్‌లో కలుస్తున్నాడు. మొన్న వినూత్న ఎడ్రసు ఇచ్చేడు. నిన్న వినూత్న వాళ్ళింటికి వెళ్ళేను. ఇవ్వాళ కవిత ఎడ్రసు అడిగాను. ఈ దారుణ వార్త విన్నాను. నీకు నేను సర్‌ప్రైజు ఇద్దామనుకున్నది మనం కవితా వాళ్ళింటికి వెళ్దామని మాధురీ. నిన్నందుకే సాయంత్రం తొందరగా రమ్మ న్నాను" అంది శైలజ.

"అయితే శైలూ నీకు చాలా విషయాలు తెలియవు. నువ్వు ఇన్నాళ్లూ ఇండియాలో లేకపోవడంచేత నీ సంగతులు మాకూ మావి నీకూ ఏమీ తెలియలేదు. అదీగాక మనమెవరం కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు రాసుకోలేదు. అయినా మాకుగా మేము రాయడానికి మాకేమంత మంచి వార్తలు న్నాయని. ఇక్కడున్న మేమందరం ఏదోవి ధంగా సానుభూతికోసం ఎదురుచూస్తున్న వాళ్ళమే"

"నేను ఇండియాకి వచ్చి మీ అందరి సుఖ జీవితాలూ చూసి తృప్తిగా వెళ్దామనుకొ న్నాను. కానీ ఎవరి జీవితం చూసినా ఒక చిన్నకథ అయి కూర్చుందన్నమాట. వినూత్న వైఖరి కూడా నాకేమంత తృప్తి అనిపించలేదు. అది పైకి నవ్వుతూ వాగు తున్నా లోపల దావానలం మండుతున్నట్లే వుంది. పాపం వాళ్లత్తగారు దానిని కనిపె ట్టుకునుండక పోతే వినూత్న జీవితం ఇంకెలా మారేదో చెప్పలేము. నేను దాని కథను పూర్తిగా విననూలేదు. వాళ్లాయనను చూడనూలేదు. కాని తనేదో సుఖంగా వున్నానని నన్ను నమ్మించడంకోసం నటిస్తు న్నదా అనిపించిందే మాధురీ" అంది శైలజ కంఠంలో బాధని మిళితంచేస్తూ.

"అంతే! ఎవరి జీవితాలు వాళ్లవి. వాళ్ల వాళ్ల కర్మలననుసరించి అనుభవిస్తున్నారు" అంది మాధురి వేదాంత ధోరణిలో.

"పెళ్లయి సంసార బాధలంటే ఏమిటో తెలియని నీకు అప్పుడే ఇంత వేదాంతం ఎలా వచ్చిపడిందే, బాబూ"

"వైరాగ్యానికీ, వేదాంతం చెప్పడానికీ పెళ్లి ఒక్కటే జీవితంలో పరమావధికాదు. మన ఆశలన్నీ అడియాసలయితే వైరాగ్యం ఏర్పడుతుంది. పెంచుకొన్న మమతలు మధ్యలో తృంచివేయబడితే వైరాగ్యం ఏర్ప డుతుంది. ప్రేమించిన వాణ్ణి చేజిక్కించుకో లేక పోయినా పెళ్లిచేసికొన్నవాడు ప్రేమించ కపోయినా, ప్రేమించిన భార్యకాని, భర్తకాని మరణించినా వైరాగ్యం ఏర్పడుతుంది. కొందరు అమ్మానాన్నల మాట విని పెళ్లిచే సికొని గొప్ప త్యాగం చేశామనుకుంటారు. పిల్లల పెళ్లిళ్లు చేసిన తల్లిదండ్రులు తమ బాధ్యతలు వదిలిపోయాయనుకుంటారు. పుట్టిన దగ్గర్నుంచీ ఎప్పుడూ దేనినో అందు కోవాలనే తపన, అందుకోలేకపోతే వైరాగ్యం, ఇలా ఇంకా ఎన్నెన్నో..."

"ఆపవేబాబు ఆపు నీవైరాగ్యం లెక్చరు విన్నాక నాకిప్పుడు వైరాగ్యం వస్తోంది. ఇంతకీ కవిత, వినోద్‌ల గురించి చెప్పనే లేదు" అంది శైలజ.

"కవిత ఆత్మహత్య చేసుకోవడం నిజం, అది చాలా పెద్ద కథ. ఎందుకైనా మంచిది. నాకు చాలా నీరసంగా వుంది. మనం భోంచేసి డాబా మీదికి వెళ్లి కూర్చుని చెప్పుకుందాం. ఏమంటావు శైలూ? "

శైలజ తలూపింది.





భోజనాలయ్యాక మాధురి, శైలజ హాస్టల్ డాబా మీదికిపోయి ఓ వారగా కూర్చున్నారు. వాతావరణం ప్రశాంతంగా వుంది. వెన్నెల మసకమసకగా వుంది. చల్లగా గాలి వీస్తోంది.

వున్నట్లుండి "శైలూ టేబిలుమీద పెట్టిన మేగజైనులో కటింగు చూశావుకదా!" అంది మాధురి.

శైలజ గతుక్కుమంది. అయితే ఇదేదో మాగజైనులో కటింగును గూర్చి అడగడానికే మాధురి తనను మేడమీదికి రమ్మందా? పోనీలే ఇలాగైనా తను మాధురి విషయాలు కూడా తెలుసుకోవచ్చు అని అనుకొని పైకి "మేగజైను టేబిలు మీద వుంది చదవడానికే కదా! అందుకే తీసి చదివాను" అంది శైలజ.

"శైలూ నేనడిగింది మేగజైను చదివావా అని కాదు. అందులో వున్న 'వధువుకావలెను' అన్న కటింగ్ సంగతి. ఆ కాగితం చదివావా!" అని అంది మాధురి. ఈసారి అడిగినప్పుడు మాధురి స్వరంలో కొంచెం తీక్షణత చూసి శైలజ ఏదో తప్పు చేసినదానిలా తలవంచుకొని 'చదివాను' అని అంది.

"అతగాడెవరనుకున్నావు అదే ఆ పెళ్లికొడుకుగారు? "

శైలజ ఎవరన్నట్లు తలెత్తి చూసింది.

"మన కవిత భర్త చంద్రశేఖరం"

"మన కవిత భర్త చంద్రశేఖరమా! అతగాడిప్పుడమెరికాలో వుంటున్నాడా? "

"అవును"

శైలజకి లీలగా వెనుకటి దినాలు జ్ఞాపకం వచ్చేయి.

"కవితని వాళ్లమ్మా నాన్న ఎవరో ఎం. బి. ఎ. చదివి బిజినెస్ చేస్తున్న అబ్బాయికిచ్చి చేద్దామనుకుంటున్నట్లు చెప్పేరు. నేను న్యూజిలాండుకు వెళ్లేముందు వాళ్లింటికి వెళ్లేనుకదా! అప్పుడు వాళ్లు చెప్పేరు. ఈ సంబంధం వాళ్లు ఒప్పుకునేట్లున్నారనీ, త్వరలోనే ముహూర్తాలు చూసి పెళ్లిచేస్తామనీ, మన ఫ్రెండ్సందరూ తప్పక కవిత పెళ్లికి రావాలనీనూ. అయితే తను అప్పుడు న్యూజిలాండు వెళ్లిపోతున్నది కనుక బహుశ పెళ్లికి రాలేకపోవచ్చునని కూడా చెప్పింది. అయినా శుభలేఖ తప్పక పంపిస్తే తను అక్కడికి వెళ్లేక కవిత పేరుతో తన ఎడ్రసుతో ఉత్తరం రాస్తానని చెప్పినట్లు గుర్తు. అయితే ఈ చంద్ర అత నేనన్నమాట. నేనప్పుడు పెళ్లికి లేనుకనుక నాకతనితో అసలు పరిచయంలేదు. మీరందరూ పెళ్లికి వెళ్లేరుకదా అందుకే మీకు బాగా తెలుసు" అన్నది శైలజ.

"అవును శైలూ మేమంతా పెళ్లికి వెళ్లేము. పెళ్లికొడుకు చంద్రశేఖరం అందగాడు. స్ఫురద్రూపి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తుండేవాడు. పెళ్లిలో మా అందరితోటీ ఏవో జోకులు వేస్తూ నవ్విస్తూ మాట్లాడేడు. కవితా వాళ్ల నాన్నగారు చంద్రశేఖరం బిజినెస్ కోసం బోలెడంత డబ్బు ఇచ్చేరు. పెళ్లి కూడా చాలా ఘనంగా జరిపించారు. కవిత వాళ్లకి ఒక్కగానొక్క కూతురు కనుక కూతుర్నీ అల్లుణ్ణీ తమతోనే వుండివాళ్లకి కొడుకుల్లేని కొరత తీర్చమన్నారు.

"చంద్రశేఖరం వాళ్ల కోరికని మన్నించాడు. అత్తగారింట్లో అతనికి అన్నీ మోజుగా జరుగుతున్నాయి. కవితకి కె. జి. హెచ్‌లో వాళ్ల నాన్నగారి పలుకుబడితో వెంటనే వుద్యోగం దొరికింది.

"చంద్రశేఖరం బిజినెస్ బాగానే సాగుతోంది. కొన్నాళ్ల తరువాత కవితావాళ్ల నాన్నగారు అతనికి ఒక కారు కూడా కొనిచ్చేరు. కవితకి హాస్పిటల్లో నైట్‌డ్యూటీ, డే డ్యూటీ అంటూ డ్యూటీ లుండేవి. డాక్టర్లు కదా షిప్టు డ్యూటీలు కూడా వుండేవి. కారు కొన్న మొదట్లో చంద్రశేఖరం కవితని హాస్పిటల్లో ఆమె డ్యూటీ టైముకి చేర్చేవాడు.

తర్వాత తర్వాత అతనికి బిజినెస్ ఎక్కువవుతున్న కొద్దీ నైట్ డ్యూటీలప్పుడు మాత్రమే దింపి వచ్చేవాడు.

"రానురాను కవితకి ఎందుకో అతనిపై విముఖత్వం ఏర్పడసాగింది. దానికి కారణం బహుశ అతను హాస్పిటల్లో లేడీ డాక్టర్లతోటీ నర్సులతోటీ కూడా జోకులు వేస్తూ నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడటమే కావచ్చు

"ఒకనాడు వాళ్లిద్దరికీ ఇలా సంభాషణ జరిగిందిట.

"మీరు రేపట్నుంచీ నన్ను డ్రాప్ చేయనక్కరలేదు" అంది కవిత.

"ఓకే చాలా సంతోషం. నాకు కొంత శ్రమ తగ్గుతోందన్న మాట. అయితే ఇంక నీకు రేపట్నుంచీ నైట్ డ్యూటీలు లేవన్న మాట"

"నాకు కాదు. మీకుండవు" కవిత ధోరణి అతనికి కొంత కటువుగా విన్పించింది.

"కవితా" అని గట్టిగా అని మళ్లీ మామూలు ధోరణిలో "నాకూ రాత్రిళ్లు ఎప్పుడు పడితే అప్పుడు రావడంతో నిద్రలేకుండా ఆరోగ్యం పాడవుతోంది. సరే మీ అమ్మానాన్నలతో కూడ చెప్పు నన్ను రావద్దన్నావని. లేకపోతే వాళ్లు నేనే నిన్ను తీసుకెళ్లి తీసుకురావటంలేదనుకుంటారు"

"కవిత ఒక నమ్మకమైన రిక్షావాణ్ణి మాట్లాడుకొని వెళ్లసాగింది. వాళ్లమ్మానాన్నగార్లతో "ఆయనకి బిజినెస్ ఎక్కువై బాగా అలసిపోతున్నారమ్మా. నాకు డ్యూటీలు రోజూ ఒక్కలాగ వుండవుకదా! ఆయన ఆరోగ్యం ముఖ్యమని నేను రిక్షా మాట్లాడుకొని వెళ్లిపోతున్నాను" అంది.

"పోనీ నాన్నగారు వచ్చి దింపుతారులే అమ్మా" అని కవితా వాళ్ళమ్మగారు అన్నారు. కాని కవిత ఒప్పుకోలేదు.

"కానీ చిత్రమేమిటంటే హాస్పిటల్లో ఎవరూ కూడా కవితని ఒక్క ప్రశ్న కూడా వెయ్యలేదు.

"కవిత రిక్షాలో ఎందుకొస్తోందీ, వాళ్ళాయన ఎందుకొచ్చి దింపడంలేదూ అని ఒక వేళ ఎవరైనా అడిగితే తను ఏమి జవాబు చెప్పి తప్పించుకోవాలా అని కూడా అనుకుంది. కవితకి అలాంటి శ్రమ ఏమీ కలుగలేదు. హాస్పిటల్లో వాతావరణం అంతా మామూలుగానే వుంది. కవిత కాశ్చర్యం వేసింది. ఎప్పుడయినా ఆయన రావడం లేటయినా తన స్నేహితులు తనని ఏదో వెటకారం చేసి ఆనందించేవారు. ఆఖరికి తను బెస్ట్‌ఫ్రెండ్ అనుకొన్న సరోజ కూడా ఏమీ జరగనట్లూ ఏమీ ఎరగనట్లూ ప్రవర్తించసాగింది. "చంద్రశేఖరం కాని తను లేనప్పుడు వీళ్ళతో ఏమైనా మాట్లాడి ఇలాంటి వాతావరణం సృష్టించాడా ఏమిటి చెప్మా" అనుకుంది.

"కవిత సన్నగా నాజూగ్గా సన్నజాజిమొగ్గలా వుంటుందిగదా. ఆమె తల్లిదండ్రులకి తనొక్కతే సంతానం కావడంతో చాలా ముద్దుగా గోముగా పెరిగింది. ఆమె ఏది కోరితే ఆ వస్తువు వెంటనే వచ్చిపడేది. చిన్నప్పుడు ఎక్కువగా స్నేహితులతో కలిసి తిరిగేదికాదు. ఇంట్లో ఒక్కతే తన ఆటబొమ్మలతో ఆడుకునేది. అప్పుడప్పుడు తల్లిని పిలిచి తనతో భాగస్వామిని చేసి తను ఆటల్లో వండిన వంటకాలను వడ్డించేది. ఆ చేష్టలకే ఆ తల్లి మురిసిపోయి తన దృష్టిసోకకుండా 'దిష్టి'తీసి పారేసేది.

"కవిత మిగతా విషయాలలో ఎలా వున్నా చదువు మాత్రం శ్రద్ధగా పట్టుదలతో చదివేది. సినిమాలన్నా షికార్లన్నా ఎప్పుడూ ఏమంతగా ఆసక్తి ప్రకటించేది కాదు. సాహిత్యం అన్నా సరదా కబుర్లన్నా కూడా ఏమంత ఉత్సాహం చూపించేదికాదు. ఎక్కడికన్నా వెళ్ళినా వాళ్ళమ్మతోనే





వెళ్ళివస్తూండేది. అందుకే ఆమెకి స్కూల్లోనూ, కాలేజీలోనూ కూడా ఎక్కువ మంది స్నేహితులు లేరనే చెప్పాలి.

"చంద్రశేఖరం ఆమె స్వభావాలకి పూర్తిగా వేరుగా వుంటాడు. అతను ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూనే వుంటాడు. గలగలా మాట్లాడేసి కలకలా నవ్వేస్తూంటాడు. అతను కవిత పెరిగిన వాతావరణాన్ని కవిత మనస్తత్వాన్ని సంపూర్ణంగా అర్థంచేసుకున్నాడు. దానికితోడు పెళ్ళికి ముందు తన మామగారు తన రెండు చేతులూ పుచ్చుకొని ఎవరూ లేనిచోటికి తీసికెళ్ళి కవిత మనస్తత్వాన్ని చెప్పి "ఇంక దానికి సర్వస్వమూ నీవే. దానికే కాదు మాకు కూడా సర్వస్వమూ మీ ఇద్దరే" అని గోప్యం లేకుండా అంతా వివరించి అల్లుణ్ణి వశపరుచుకున్నాడు.

మొదట్లో కొన్నాళ్ళు కవిత చంద్రశేఖరం తోపాటు సినిమాలకీ, షికార్లకీ వెళ్ళినా సినిమాల్లో తనకి నచ్చని విషయాన్ని ముఖం ఆముదం తాగినట్లు పెట్టి మరీ చెప్పేది.

ఎంతసేపూ తన గదిలో ఏవో పుస్తకాలు ముందేసుకు కూర్చోమంటే సరదా ఆమెకి.

"చంద్రశేఖరం ఎంతో లాలింపుగా ముద్దుగా తనవైపు తిప్పుకోబోయాడు. ఒక నాడు అందరూ భోజనాల దగ్గర కూర్చున్నారు. "కూర బావుంది. పచ్చడి బాగుంది' ' అంటూ రుచుల్ని మెచ్చుకుంటూ భోంచేయసాగారు.

"మీ అమ్మాయికి కూడా రేపట్నుంచీ వంట చేయడం నేర్పండి అత్తగారూ. నాకు కవిత చేతి వంట తినాలని వుంది. ఏం కవితా రేపు నువ్వు వంకాయ వేపుడు చేసి వడ్డిస్తావు కదూ!" అన్నాడు చంద్రశేఖరం కవితవైపు చూసి నవ్వుతూ.

"ఆ వంటలు చేస్తూ కూర్చోడానికి నేనేం వంటలక్కనా. అయినా నాకింకేం పనిలేదా! ఇప్పటికే ఉద్యోగంవల్ల అలిసిపోతున్నాను. ఇంక వంటచెయ్యడమొక్కటే తక్కువ. అదీ గాక నాకు అమ్మ చేస్తేనే ఇష్టం" అనేసి కంచంలో మజ్జిగ పోసుకోకుండానే చెయ్యి కడుక్కుని తన గదిలోకి వెళ్ళిపోయింది కవిత.

"వంటలక్క" అని కూతురు అన్న మాటలకి తల్లి బాధ పడినా "నాకు మా అమ్మ చేస్తేనే ఇష్టం" అన్న మాటని ఆప్యాయంగా తీసుకొన్నది, ఆ మహాఇల్లాలు కవిత తల్లి పార్వతిగారు.

"తప్పమ్మా దుడుకుతనం కూడదు" అంటూ కవితతండ్రి విశ్వనాథంగారు కూతురు వెళ్ళినవైపు చూసి అల్లుడు వైపు బాధగా చూసేరు.

"చంద్రశేఖరం ఏంలేనట్లు, ఏం ఫరవాలేదన్నట్లు చూసి చేయి తుడుచుకొని తను కూడా గదిలోకి వెళ్ళిపోయాడు.

"కవితా నీకీవారమంతా నైట్ డ్యూటీలులేవు కదా!"

"అవును లేవు, నాకు నిద్రవస్తోంది. మీరు త్వరగా వస్తున్నారా లేదా" అంది కవిత.

"నువ్వు పడుకో. నాకింకా నిద్రరావటం లేదు. నేనలా బజారువైపు వెళ్ళివస్తాను" అంటూ చొక్కావేసుకొని జోళ్ళు తొడుక్కుని కవితనుండి ఏమాటా ఎదురు చూడకుండానే వెళ్ళిపోయాడు చంద్రశేఖరం.

"ఆవేళప్పుడు అల్లుడలా బయటికి వెళ్ళిపోవడం కవిత తల్లిదండ్రులిద్దరూ చూసి అల్లుడికి కవిత మీద కాని కోపం వచ్చిందేమోననుకున్నారు.

"పొద్దున్న కాఫీ కూడా కవిత తల్లి తెచ్చి తన భర్తకీ అల్లుడికీ కలిపి టేబులుమీద పెడ్తుంది. కవిత నాన్నగారు విశ్వనాథంగారు అల్లుణ్ణి పిలిచి ఇద్దరూ కాఫీ తాగి పేపరు చదువుకుంటారు. అతను స్నానం

చేసి తయారవుతున్న సమయానికి కవిత నిద్రలేవడమో లేకపోతే డ్యూటీనించి రావడమో జరుగుతూంటుంది.

"పెళ్ళయి ఇన్ని నాళ్లయినా కవిత చంద్రశేఖరానికి టూత్‌బ్రష్ కాని, తువ్వాలు కాని అందించడం, కాఫీ తీసుకొచ్చి ఇవ్వడం లేకపోతే భోజనానికి అన్ని ఏర్పాట్లు చేసి "రండీ భోజనానికి" అని పిలవడం కాని జరుగలేదు. పైపెచ్చు చంద్రశేఖరం ఆమెను కారులో దింపేటప్పుడు ఆవిడ మర్చిపోయే స్టెతస్కోపు, పర్సు మొదలైనవి తెచ్చిచ్చేవాడు. కవిత వృత్తి ధర్మాన్ననుసరించి ఆమెకి కొన్ని పనులు చేయడానికి తగిన వీలుచిక్కేది కాదు. కాని తల్లిదండ్రులు మాత్రం ఊరుకోలేదు.

"విశ్వనాథంగారు అప్పుడప్పుడు కవిత వినేలా "పార్వతీ నా పర్సు పట్రా, తువ్వాలు పట్రా, కళ్ళజోడు ఎక్కడుందీ" అని అరచి ఆవిడ కొంచెం ఆలశ్యంచేసినా కోప్పడి "నేనేం అల్లుడు చంద్రశేఖరాన్ని అనుకున్నావా! కవితలా ఏ పనిచేయక పోయినా క్షమించి ఆదరించి ప్రేమించడానికి" అని గదమాయిస్తూండేవాడు, అల్లుడు లేనప్పుడు కూతురు వినేటట్లుగా.

"ఒకనాడు కవిత ఇలాంటి తండ్రి సూటీపోటీమాటలు వింటూనే ఏడవసాగింది. విశ్వనాథంగారు గాభరాపడి "ఏవమ్మా ఏం జరిగింది" అంటూ సముదాయించబోయారు.

"కవిత అంది, "నేనెవరికీ అడుగులకి మడుగులొత్తి చాకిరీలు చెయ్యలేను. అవన్నీ చేస్తేనే భర్త ప్రేమిస్తాడనుకొంటే నేనేం చేయలేను. నేనెలా వున్నా నా భర్త నన్ను ప్రేమించాలి అని అనుకునే స్వభావం నాది. బహుశ అది నా వీక్‌నెస్ ఏమో!"

"పోనీలెండి మావగారూ, ఒక్కొక్కళ్ళకి ఒకో రకమైన వీక్‌నెస్ వుంటుంది. రా కవితా రా అలా చల్లగాలికి డాబామీదికి వెళ్ళివద్దాము" అంటూ అప్పుడే వచ్చిన చంద్రశేఖరం ఆమె చెయ్యిపట్టుకొని తీసుకు వెళ్ళిపోయాడు.

"ఆమె భర్త హృదయంలో తలదాచుకొని అతని అడుగులో అడుగు వేసుకుంటూ నడిచింది.

"తర్వాత చాలారోజులు గడిచాక ఒకవాడు కవిత నవ్వుతూ ఏదో మాట్లాడుతూంటే తల్లి పార్వతి కవితకి బుద్ధులు చెప్పసాగింది.

"చూడమ్మా కవితా స్త్రీ మొదట్లో ఒయ్యారంగా సుతారంగా ప్రేమలు ఒలకబోస్తూ వున్నా రానురాను పురుషుడికి, పిల్లలకి కూడా కడుపులోంచి ప్రేమ కలిగేటట్లు చేసుకోవాలి. అంటే కామం కలకాలం వుండదు. స్త్రీ పురుషులు పెద్దవాళ్ళవుతున్నకొద్దీ శరీరాల్లో వేడి తగ్గి ఒకరికొకరు శారీరకంగా ఆకర్షణకి దూరమవుతూ మానసికంగా పవిత్రమైన ప్రేమకు దగ్గరౌతారు. భర్తకోసం ఎదురుచూడడం, భర్తకిష్టమైన పదార్థాలను వండిపెట్టి భర్తను మురిపించి, ఆయన లాలింపులో కరిగిపోతే, అతనామెను ఆ ఇంటి ఇల్లాలిగా భావించి ఇంటిల్లిపాదీ ఆమె మాటను జవదాటకుండా గౌరవించేటట్లు చేస్తాడు. ఆమె గృహిణి అవుతుంది. భార్యాభర్తలు ఇద్దరూ కష్టసుఖాలను సమంగా పంచుకొని ఆనందంగా అనుభవించాలి. ఎన్ని మతాలున్నా, ఎన్ని కులాలున్నా, ఎన్ని భాషలున్నా ప్రపంచం మొత్తంమీద స్త్రీ పురుష ధర్మాలు ఇవేనమ్మా!

"నేనెందుకు ఆయనకి చెయ్యాలి అని స్త్రీ అనుకుంటే నేనెందుకు సంపాదించి పెట్టాలి అని పురుషుడూ అనుకుంటాడు. ఎవరి అవసరాలు తీరేక వారు వేరువేరు మార్గాలు ఇలాంటి చిన్నచిన్న కలతలతోటే చూసుకుంటారు. నేనింటికి వేగం వెళ్ళిపోతాను. ఇంట్లో నా భార్యా పిల్లలూ నాకోసం




ఎదురుచూస్తూంటారు అన్న భావన పురుషుడికి స్త్రీ కలిగించాలి. మేమంతా కాపరాలు చెయ్యలేదా, పిల్లల్ని కనలేదా! సంసారంలో అన్యోన్యత చాలా అవసరమమ్మా కవితా!

"చిన్నప్పుడంతా నిన్నెంతో ముద్దుగా పెంచాం. కాని ఇప్పుడు నీ సంసారంలో చిటపటలు చేలరేగకుండా మేము సరైన సమయంలో నీకు బుద్ధిచెప్పివుంచడం మా విధి. అందుకేనమ్మా కవితా నీకింతగా ఇవ్వాళ చెపుతున్నది" పార్వతి కాసేపు ఆగింది.

"అయిందా అమ్మా నీ ఉపన్యాసం. నాకు మెడిసిన్‌లో ఇవన్నీ నేర్పలేదు... లేకపోతే"

"ఇవన్నీ మెడిసిన్‌లో నీకు చెప్పరు కవితా. ఇవి పుట్టింటినించి అత్తవారింటికి వెళ్ళే ఆడపిల్లకి తల్లిదండ్రులు బోధించాల్సిన నీతులు" అంటూ విశ్వనాథంగారు అప్పుడే లోపలికొచ్చి జోళ్ళు విప్పుకుంటూ అన్నారు.

"ఇంతసేపూ అమ్మ ఉపన్యాసం విన్నాను. ఇంక నీది వింటాను నాన్నా"

"అమ్మా కవితా నీకు మెడిసిన్‌లో ఓర్పు అనేది నేర్పుతారనుకుంటాను. లేకపోతే పేషెంట్ల గతి ఏమౌతుందో ఏమో" పార్వతి అంది.

"అమ్మా హాస్పిటల్లో నాకు డాక్టరుగా చాలామంచి పేరుందమ్మా..." కవిత ఇంక మళ్ళీ అమ్మా నాన్నల మాటలు వినకుండా తన రూములోకి వెళ్ళిపోయింది.

"పార్వతి తలపట్టుకుంది. విశ్వనాథం గారు ఆమెను అనునయించారు.

"రూంలోకెళ్ళిన కవిత తన మంచంమీద పడుకుని చంద్రశేఖరం గురించి దీర్ఘంగా ఆలోచించసాగింది.

"చంద్రశేఖరానికి తనంటే ఇష్టముందా! లేదా! అమ్మా నాన్నల ముందు తనతో ప్రేమగా వుంటున్నట్లు తనమీద ప్రేమ ఒలకబోస్తున్నాడా? అతన్ని చూస్తే అలా అనిపించదు. నిజంగానే తనని లాలిస్తూ నవ్విస్తూ మాట్లాడుతాడు. తనని ఎన్నడూ పల్లెత్తుమాట అనలేదు. అతని ఉద్యోగం అతనికున్నా తను ఎక్కడ కష్టపడుతుందో నని తనను హాస్పిటల్లో దించి మళ్ళీ వెనక్కి ఇంటికి తీసుకువచ్చి ఇలా ఎన్ని రకాలుగా బాధ్యతలు వహిస్తున్నాడు. తనకోసం ఎన్నిసార్లు మల్లెపూలు, సెంటు సీసాలు తెచ్చి పెట్టాడు. ఏదైనా ఊరు వెళితే పట్టుచీరలూ అవీ తనకు నచ్చిన రంగులలో తెచ్చేవాడు. పోయిన పండక్కి అమ్మకీ నాన్నకీ కూడా బట్టలూ స్వీట్సూ తెచ్చిచ్చేడు. అతనిలో ఎంత చూసినా ఏ లోపం కనపడడంలేదు. మరెందుకు తను అతని ప్రేమకి దాసోహ మనలేకపోతోంది? అమ్మ అతని సంరక్షణ అంతా తననే చేయమంటోంది. అలా చేస్తే తనూ అతనూ మానసికంగా దగ్గిరౌతారా? సరే కాని అతని వైఖరి చూస్తే తనకి మాత్రం అలా అనిపించదు.

"ఎంచేతనంటే-

"అతను హాస్పిటల్‌కి తన కోసం వచ్చినప్పుడు తన స్టాఫ్ నందరినీ ఆకట్టుకున్నాడు. అందరూ అతనంతటి మంచివాడుండడని సర్టిఫికేట్ ఇచ్చేరు. పైగా కవిత చాలా అదృష్టవంతురాలు అని కూడా అన్నారు.

"కవితని చేసుకున్న చంద్రశేఖరం అదృష్టవంతుడా లేక చంద్రశేఖరాన్ని చేసుకొన్న కవిత అదృష్టవంతురాలా? ఎవరు నిర్ణయిస్తారు? .

"కవిత ఆలోచిస్తోంది. తనకేం తక్కువని. చదువుంది. సంస్కారముంది. ఉద్యోగముంది. తన తండ్రికి ఒక్కగానొక్క కూతురు. తండ్రి సంపాదించిన బోలెడంత ఆస్తికి తనొక్కతే వారసురాలు. ఇన్నీ ఒక్కసారే అందుకొన్న చంద్రశేఖరమే అదృష్టవంతుడనాలి.

"అందుకే పోనుపోను కవితకి అతనిమీద అసూయ ప్రారంభమైంది. ముఖ్యంగా తన ఆప్తమిత్రురాలు సరోజ చంద్రశేఖరం గురించి ఎక్కువగా పొగుడుతూ మాట్లాడు తున్నప్పుడు...

"సరోజ తెల్లటి తెలుపు కాదు. నలుపూ కాదు. చామనచాయ. పెద్ద కళ్ళు. ఆమె కనురెప్పలు అస్తమానూ కదిలిస్తూ మాట్లా డుతూంటే ఎదుటివాళ్ళని ఏదో కవ్విస్తు న్నట్లే వుంటుంది. వెడల్పాటి ముఖం. నల్లటి పొడుగాటి జడ. చూడగానే ఆకర్షణీ యంగా వుంటుంది.

"కవిత స్టాఫ్‌లో ఫీమేల్ నర్సులతో కూడా చంద్రశేఖరం అలానే నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడేవాడు. వాళ్ళతన్ని "సార్ సార్" అని పలకరిస్తారు. నర్సులలో సావిత్రి అన్న నర్సు తన పుట్టినరోజుకి స్వీట్సు తెచ్చి చ్చింది. చంద్రశేఖరం వెళ్ళి ఆమెకొక చీరాజా కెట్టూ వున్న పేకెట్టు కొని కవితచేత ఇప్పిం చేడు.

"సావిత్రి చాలా బావుంటుంది. నర్సుట్రై నింగు అయి రెగ్యులర్ నర్సుగా రెండు సం॥లనుంచీ పనిచేస్తున్నది. చాలా మర్యా దస్తురాలు. మర్యాద కల కుటుంబంలోంచి వచ్చింది. తల్లిదండ్రులు ఏమంత వున్న వారు కాకపోవడంచేత, తన వెనుక ఒక చెల్లీ ఇద్దరు తమ్ముళ్ళ బాధ్యత స్వీకరించడం చేతా, తెలివైనదే అయినా పై చదువులకి పోలేక నర్సు ట్రైనింగులో చేరిపోయింది. చంద్రశేఖరం మాటలకి చేష్టలకీ కూడా ఎక్కువ ఆకర్షితురాలైంది సావిత్రి మాత్రమే.

"సావిత్రి, చంద్రశేఖర్‌లు అప్పుడప్పుడు రహస్యంగా కలుసుకుంటూండేవారు. ఆమెకు నైట్ డ్యూటీలుంటే డే టైంలోనూ, డే డ్యూటీలుంటే ఫస్ట్ షో సినిమా టైంలోనూ అలా కలుస్తూండేవారు. ఎన్నో సార్లు కలిసి సినిమాలకి వెళ్ళేరు. తర్వాత తర్వాత ఇంట్లో బిజినెస్ టూర్ అని చెప్పి ఎక్కడో హోటల్లో రూము తీసుకొని ఇద్దరూ హాయిగా కాలక్షేపం చేసివచ్చేవారు.

"ఉన్నట్లుండి ఒకనాడు చంద్రశేఖరం "కవితా మనం వేరే ఇంటికి వెళ్ళిపోదాం" అన్నాడు.

"కవిత వులిక్కిపడి "ఎందుకూ" అంది.

"నీకు తల్లివి కావాలని లేదా" చెవిలో రహస్యంగా మాట్లాడుతున్నట్లు అడిగేడు చంద్రశేఖరం.

"కవిత సిగ్గుపడింది. అది స్త్రీ సహజమైన సిగ్గు. అలా సిగ్గు పడుతూనే అడిగింది. "అలా కావడానికి మనం వేరే ఇంటికి ఎందుకు వెళ్ళిపోవడం?"

"చంద్రశేఖరం అన్నాడు. "ఈ పెద్దవాళ్ళ ముందర మనకిద్దరికీ ఏమంత స్వేచ్ఛలేదు. ఈ ఇంట్లో నాకేం కావాల్సినా నేనే చేసుకో వాలి. లేదా, మీ అమ్మగారో, మీ నాన్నగారో లేకపోతే ఏ పని వాళ్ళో చేస్తారు. మనం వేరే ఇంటిలో వుంటే మన పనులు మనమే చేసుకుంటూ అన్యోన్యంగా వుండవచ్చును కదా!"

"అబ్బ" కవిత అంది. "నేను వంటా వార్పూ చేయలేనండీ. పనిమనిషిని పెట్టు కొని అంట్లు వేయడం, బట్టలుతికించడం, ఇల్లు శుభ్రంచేయించడం ఇలాంటి పనులన్నీ అమ్మో ఇవన్నీ నావల్ల కాదుబాబూ. అదీ కాక నాకు అమ్మా నాన్న దగ్గిరే అలవాటు. నేనెక్కడికీ రాను"

"కాని, చంద్రశేఖరం వేరే కాపురం పెడ్దాము అని ఒకటే పట్టుదలగా అన్నాడు.

"మర్నాడు కవిత వాళ్ళమ్మా నాన్నలతో చెప్పింది. వాళ్ళూ అల్లుడు మాటలకి మొదట ఆశ్చర్యపోయినా తర్వాత అమ్మాయి క్షేమం ఆలోచించి సరేనన్నారు. కానయితే అంత పెద్ద ఇంట్లో వాళ్ళిద్దరే మసలడం కష్టం కనుక ఆ ఇంట్లోనే ఒక





పోర్షనులో కవితనీ అల్లుణ్ణి వేరే కాపుర ముండమన్నారు.

చంద్రశేఖరం అభిప్రాయం అది కాదు. తన రాకపోకలు, తన వ్యవహారాలు అత్త గారికికాని, మామగారికికాని ఎట్టి పరిస్థితులలోనూ తెలియకూడదు. అతనిమీద వాళ్ళకి ఎలాంటి అనుమానం రాకూడదు. వేరే పోర్షనులో వాళ్లుంటున్నా అదే ఇంట్లో వుంటే తన కెలాంటి అవకాశాలూ వుండవు. అంచేత కవిత తల్లిదండ్రులు ఎంత బతిమిలాడినా తను ససేమిరా ఒప్పుకోలేదు. ఆఖరికి విశ్వనాథంగారే అన్నారు.

"పోనీ హాస్పిటల్ కి దగ్గరగా మంచి ఇల్లేదన్నా చూసి తీసుకో. మాకు కూడా అప్పుడప్పుడు వచ్చి అమ్మాయిని చూసిపోడానికి వీలుంటుంది. త్వరలో మంచి ముహూర్తం చూసుకొని మారుదురుగాని"

"పార్వతికిగాని విశ్వనాథంగారికి కాని చంద్రశేఖరం మీద ఎలాంటి అపనమ్మకమూ లేదు. బహుశః అల్లుడికి కోపం రావడానికి కారణం తమ కూతురే అని కూడ వాళ్ళు అప్పుడప్పుడు బాధపడుతూంటారు. ఒక్కగానొక్క బిడ్డ అని ముద్దుగా పెంచుకోడంచేతనే ఆమెకు పట్టుదల పంతం ఎక్కువైయుండొచ్చని కూడా అనుకున్నారు. అయినా తమ కూతురి లోపమున్నా కవిత తమకు ఒక్కగానొక్క బిడ్డ. ఆమె మనసు కష్టపడినా, కంట తడి పెట్టినా తాము సహించలేరు.

"అల్లుడికి బిజినెస్టూర్ లు ఎక్కువైపోయాయి. తరుచు ఈమధ్య టూర్మీద వెళ్ళిపోతున్నాడు. విశ్వనాథంగారికి అల్లుడి ప్రవర్తన మీద కొంచెం అనుమానం వేయసాగింది. అయితే అతనావిషయం ఇంట్లో వాళ్ళ దగ్గిర ప్రస్తావించలేదు.

"కవిత, చంద్రశేఖర్ లు వేరే కాపురం హాస్పిటల్ కి దగ్గరగా పెట్టినా ఉప్పుతో తొమ్మిదీ రోజూ ఏదో టైంలో విశ్వనాథం గారు వచ్చి తమ కూతుర్ని చూసి ఇచ్చివెళుతున్నారు. చంద్రశేఖరానికి తెలుసు. ఏదీ ఒక్క రోజులో జరిగే పని కాదని. అలానే నాల్రోజులకొకసారి కవిత వాళ్ళ వాళ్ళ దగ్గిరకివెళ్ళి రెండేసి రోజులుండి మరీ వస్తూండేది. పేరుకి వేరింటి కాపురమైనా కవిత చంద్రశేఖరం టూర్ లో వున్నప్పుడు వాళ్ళమ్మా వాళ్ళింట్లో వుండడం మొదలుపెట్టింది.

"చంద్రశేఖరం దేనికీ అభ్యంతరం చెప్పలేదు. కవిత యధాప్రకారం హాస్పిటల్ కి వెళ్ళివస్తూనే వుంది.

"చంద్రశేఖరం కొన్నాళ్ళతర్వాత కవితచేత పది రోజులు సెలవు పెట్టించి హనీమూన్ కి వెళ్ళి వచ్చేరు. హనీమూన్ నుంచి వచ్చిన తర్వాత కవితలో కొద్దిగా మార్పు వచ్చింది.

ముఖంలో సంతోషం, తెలియని ఆనందం చోటుచేసుకున్నాయి. పార్వతి విశ్వనాథం కూడా చాలా సంతోషంగా వున్నారు. కవిత గర్భంధరించాలని మనసులో అనేక దేవుళ్ళకి మొక్కుకున్నారు కూడాను.



" ఆరోజు రాత్రి మహా భయంకరమైనది. కవితకి నైట్ డ్యూటీ వున్నరోజు. ఒంట్లో ఏమంత బాగాలేదని కవిత వాళ్ళమ్మా

వాళ్ళింట్లోనే వుండి రాత్రి ఎనిమిది గంటలకి ఫోంచేసి తన ఇంటికి వచ్చింది. తల విపరీతంగా నెప్పిగా వుందని కొంచెంసేపు పడుకుని లేచి హాస్పిటల్‌కి ఫోను చేసింది. ఇంకా నైట్‌డ్యూటీ డాక్టర్లెవరూ రాలేదు. డేడ్యూటీ వాళ్ళే రౌండ్సులో వున్నారు. వెంటనే సరోజ ఇంటికి ఫోనుచేసింది. సరోజకి కూడా ఒంట్లో బావులేక ఆరోజు సెలవు పెట్టుకుందిట. తనకి బదులు సరోజని వెళ్ళమని రిక్వెస్టు చేద్దామనుకుంటే, ఆమెకీ డ్యూటీ వుండి, దానిని ఎవరికో అప్పగించి సెలవు పెట్టుకొని ఇంట్లో పడుకుందిట. ఇంక కవితకి హాస్పిటల్‌కి వెళ్ళక తప్పలేదు.

"లేచి ముఖం కడుక్కుని తయారై వాచీలో టైము చూసుకొంది. పావుతక్కువ పదికావస్తున్నది. రాత్రి పదిగంటలనుండీ మర్నాడు పొద్దున్న ఎనిమిది గంటలవరకూ డ్యూటీ చెయ్యాలి. ఇంకా చంద్రశేఖరం రాలేదు. బహుశ అతను వచ్చేసరికి ఆలశ్యం కావచ్చును. తను రిక్షా వేసుకొని వెళ్ళిపోడానికే నిశ్చయించుకొని ఓ రిక్షాని కేకేసి మాట్లాడుకుని ఎక్కి కూర్చుంది.

"కవిత హాస్పిటల్ చేరిందేకాని విపరీతమైన తలనెప్పితో బాధపడుతూ స్టాఫ్ రూములో టాబ్‌లెట్ వేసుకొని పడుకొంది.

"ఏదైనా అర్జంటుపనుంటే లేపి చెప్పమని వార్డు నర్సుకి చెప్పింది. కొంచెంసేపట్లో డా॥ సరోజ తరపున వచ్చిన డాక్టరు ఆనంద్ వచ్చి కవిత పరిస్థితిని చూసి- "కవితగారూ నేను మీ ఇద్దరి తరపునా కేసులు చూసుకుంటాను. మీరు ఇంటికి వెళ్ళి రెస్ట్ తీసుకోండి" అని చెప్పాడు.

"కవిత కూడా అలాగే అనుకుంది. వార్డు బాయ్ వెళ్ళి రిక్షా తెచ్చి ఆమె నెక్కించి తను సైకిలు మీద ఆమె వెంట వెళ్ళాడు. ఇల్లు చేరువ కాగానే కవిత వార్డ్ బాయ్‌ని పంపేసింది. తనింట్లోకి వెళ్ళి రిక్షా డబ్బులు తెస్తానని వచ్చింది. వీధితలుపు లోపల గడియవేసివుంది. అంటే చంద్రశేఖరం తను డ్యూటీకి వెళ్ళాక ఇంటికి వచ్చి పడుకుని వుంటాడు.

"కవిత నీరసంతో తలుపుమీద తట్టసాగింది. బాగా మూడు నాలుగుసార్లు గట్టిగా కొట్టేవరకూ చంద్రశేఖరం లేచి వచ్చి తలుపు తెరవలేదు. "ఈవేళప్పుడెవరు వొచ్చారబ్బా! ఎవరన్నా పేషెంట్లు కాని వచ్చారా" అనుకుంటూ చంద్రశేఖరం లుంగీ సవరించుకొని భుజంమీద చొక్కా పడేసుకొని వచ్చి తలుపు తీశాడు.

కవిత లోపల ప్రవేశిస్తూనే పర్సు, స్టెత్ సోఫాలో పడేసి నీర్సంగా చంద్రశేఖరంతో "రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేయండి" అని అంటూ బెడ్‌రూమ్‌లో కెళ్ళి పరుపుమీద అడ్డంగా పడినట్లే పడుకుంది.

"కవితకి తను దేనిమీదో మరో శరీరం మీద పడినట్లు అనిపించి ఆ చీకట్లో కెవ్వున కేకేసి లేచి కూర్చుంది. ఆ పక్కనే వున్న స్విచ్ ఆన్‌చేసి బెడ్‌లైటు వెలిగించవచ్చు, కానయితే తను శక్తిని కూడదీసుకొని లైటు వేద్దామనుకుంటూండగానే ఏదో అస్పష్టంగా నీడలా ఒక ఆకారం కదిలి ఆ గదిలోంచి బయటికి వెళ్ళిపోయిట్లనిపించింది. కవిత దిగ్భ్రాంతురాలై నిశ్చేష్టురాలైంది.

చంద్రశేఖరం రిక్షావాడికి కొంచెం ఎక్కువ డబ్బిచ్చి జాగ్రత్తగా వెళ్లమని చెప్పి తలుపు లేసి బెడ్‌రూమ్‌లోకి వచ్చి "లైటు వేసుకోలేదేం కవితా" అంటూ వచ్చి లైటు వేశాడు.

"కవిత బిక్కుబిక్కుమంటూ భయంతో అతనివైపు చూస్తూ కూర్చుంది.

"కవితా ఏం అలా వున్నావు? ఒంట్లో బాగాలేదా? " అంటూ నుదుటిమీద చేయివేసి చూశాడు. "అబ్బో జ్వరం పేలిపోతోంది. టాబ్లెట్సేవన్నా వేసుకోలేకపోయావా? నేనేమన్నా మందులు తీసుకురానా. సరిగా పడుకో. లేకపోతే మెడ నెప్పి




పుడుతుంది" అనునయిస్తున్నట్లుగా అన్నాడు చంద్రశేఖరం.

"కవిత బెడ్‌మీద, కిందా, పక్కసందుల లోకి ఇటూ అటూ చూడసాగింది.

"కవితా ఏమిటీ వెతుకుతున్నావు! పడుకో!" అన్నాడు చంద్రశేఖరం.

"కవిత ఏమో చెప్పాలి, ఏమో అడగాలి అని అనుకొని "ఏమండీ నేనిక్కడ బెడ్‌మీద ఎవరో మనిషి వుండడం చూశాను" అంది నీర్సంగా.

"మనిషా? కవితా" అన్నట్లు ఆవిడవైపు అనుమానంగా చూసినట్లు చూసి, "కవితా నీకు జ్వరం ఎక్కువగా వున్నట్లుంది. మీ అమ్మగార్ని, మీ నాన్నగార్ని పిలవనా! నువ్వు ఏవేవో మాట్లాడుతున్నట్లున్నావు. ఇది కాని సంధి జ్వరం కాదుకదా!" అన్నాడు చంద్రశేఖరం నుదుటిమీద పడు తున్న ఆమె ముంగురుల్ని వెనక్కి తోస్తూ.

"లేదండీ, నేను, నేను నిజంగా ఎవరో ఇలానే వెళ్లిపోవడం చూశాను" అంది.

"చంద్రశేఖరం లేచి ఒక తువ్వాలును చల్లటి నీళ్లల్లో తడిపి ఆమె నుదుటిమీద ఒత్తుతూ కవితా అంతా నీ భ్రమ. నిద్రపో. నిద్ర పట్టితే అంతా బాగైపోతావు అంటూ ఆమెని మెల్లిగా పడుకోబెట్టి చిన్న పిల్లని జోకొట్టినట్లు జోకొట్టసాగాడు.

తను చూసిన విషయాన్ని మర్చిపోలేకా అతను చూపిస్తున్న ఆప్యాయతని అందుకో లేకా చాలాసేపటివరకూ సతమతమయి ఏ తెల్లవారుజాముకో నిద్రాదేవి ఒడిలో చేరింది.

"చంద్రశేఖరం లేచి కాఫీ చేసుకొని తను తాగి ఫ్లాస్కునిండా పోసి బ్రేక్‌ఫాస్ట్‌కి బ్రెడ్ స్లైసెస్ తయారుచేసి పెట్టాడు.

"కవిత లేచేసరికి బాగా పొద్దెక్కింది. తల నెప్పి తగ్గింది కాని శరీరంలో చెప్పలేనంత నీర్సం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది. బెడ్‌మీంచి దిగి దుప్పట్లు మడత పెట్టి తలగడాలు సవ రిస్తుంటే అక్కడ ఒక జాకెట్టు కన్పించింది. గబుక్కున దానిని తీసి తన పెట్టెలో పెట్టే సింది. ఆ జాకెట్టు తనది కాదు. తన తల్లికీ అలాంటిది లేదు. ఆ సైజు కూడా తనదీ, తన తల్లిదీ అసలే కాదు. అయితే మరెవ రిదై వుంటుంది. అదిక్కడికి ఎలా వచ్చింది?

"కవిత బ్రష్ చేసుకొని ఫ్లాస్కులో కాఫీ తాగి కిటికీ దగ్గర పడకకుర్చీలో కూర్చుంది. ఇంతలో కవిత తల్లిదండ్రులు పార్వతీ, విశ్వ నాథంగారలు చంద్రశేఖరం కారులో వచ్చారు.

"వస్తూనే పార్వతి కంగారుగా "ఏమ్మా కవితా ఎలా వున్నావు? జ్వరం తగ్గిందా? రాత్రంతా పలవరిస్తూనే వున్నావట. రామ్మా... ఎలాగో అలాగా ఇంటికెళదాం" అంది.

"విశ్వనాథంగారు కూడ కూతురు నుదు టిమీద చెయ్యివేసి చూసి, "ఇప్పుడేమంత జ్వరంగా వున్నట్లు లేదే" అని "పదమ్మా కవితా ఇంటికి వెళదాం మళ్ళీ నీకు రాత్రివ రకూ డ్యూటీ లేదుకదా" అన్నారు.

"కాని... ఎప్పుడూ ఎవ్వరూ ఊహించని మార్పు కవిత జవాబులో వాళ్లు విని ఆశ్చ ర్యపోయారు.

"ఇప్పుడింక నీర్సం తప్ప ఏమీ లేదమ్మా. బాగానే వున్నాను. మీరు వెళ్ళిపొండి. నేనె క్కడికీ రాను. నాకు మీరు పథ్యం కూడా పంపవద్దు. ఆయన బ్రెడ్ తెచ్చిపెట్టారు. కావాలంటే నా కోసం ఆయన శలవు పెట్టు కుంటారు"

"ఈసారి ఆశ్చర్యపోవడం చంద్రశేఖరం వంతు అయింది. కవిత ఎప్పుడూ తలిదం డ్రుల పేరు చెబితే పరుగులు తీసేది. ఇవ్వాళ ఎందుకు వెళ్ళనంటోంది? మన

సులో భావాన్ని పైకి కనిపించనీకుండా అత నన్నాడు. "అవసరమైతే నేను తప్పకుండా శలవు పెట్టుకొని కవిత దగ్గరుంటాను. మీరిద్దరూ వెళ్లిరండి మామగారూ"

"చంద్రశేఖరం మాటలకి వాళ్ళిద్దరూ చాలా సంతోషించినా పార్వతి మాత్రం కవి తని ఒదిలి వెంటనే వెళ్ళిపోలేకపోయింది. "పోనీలే ఇక్కడే ఇంత చారూ, అన్నం వండి వెళతాను" అంటూ వంటింట్లోకి దారితీ సింది.

"చంద్రశేఖరం "నేను స్నానం చేసి వస్తాను" అంటూ బాత్‌రూమ్‌లోకి దారితీ శాడు.

"విశ్వనాథంగారు అక్కడే మరో కుర్చీలో కూర్చుని కిత్రంరోజు పేపరును తిరగేయసా గారు.

"అమ్మా ఫ్లాస్కులో కాఫీ వుంది నాన్నగా రికిచ్చి నువ్వు కూడా తాగమ్మా" అంది కవిత.

"అలాగే" అంటూ పార్వతి కాఫీనందించి విశ్వనాథంగారితో "మనం ఇంకొక గంటలో వెళ్ళిపోదాం" అంది.

"కవిత ఏం మాట్లాడలేదు.

"చంద్రశేఖరం స్నానంచేసి వచ్చి తయారై "మీరున్నారు కనుక నేను ఒకసారి ఆఫీసుకి వెళ్ళి గంటలో వస్తాను. అని చెప్పి ఏం తిన కుండానే వెళ్ళిపోయాడు. వెళ్లేముందు కవిత వైపు వంగి 'నేను త్వరగా వచ్చేస్తానులే' అన్నాడు.

"కవిత మళ్ళీ ఏం మాట్లాడలేదు.

"ఆమె హృదయంలో అగ్నిపర్వతం బద్దల వుతోంది. ఆమె మనసులోని మాట ఎవరి కైనా చెప్పాలా వద్దా? అసలు తల్లికైనా చెప్పాలా వద్దా? చెప్పాల్సివస్తే ఏమని చెప్పాలి? ఎలా చెప్పాలి? చివరికి ఎవరికీ ఏమీ చెప్పకూడదనే నిశ్చయించుకుంది.

"కాస్సేపటికి మందు ప్రభావంవలన మళ్ళీ నిద్రపట్టేసింది. పార్వతీ విశ్వనాథ్‌లు కూడ 'లోపలికెళ్ళి పడుకోమ్మా' అని కవితని లేపి చెప్పలేదు.

"కవితకి పోనుపోను చంద్రశేఖరం మీద విశ్వాసం నశించసాగింది. అతను వేరే ఇల్లు తీసుకొని వుందామన్నది ఇందుకోసమన్న మాట. తనకి నైట్ డ్యూటీలున్నప్పుడల్లా అతను తమ పడకగదిలో హాయిగా ఆనం దంగా కాలక్షేపం చెయ్యొచ్చు.

"తను మొదట్లో తన ప్రాణస్నేహితురా లైన సరోజనే అనుమానించింది. కాని ఇప్పుడు సరోజ అసలు తనతోనే కాదు తన భర్త పలకరించినా ముభావంగా వుంటు న్నది.

"అయితే అనుమానించదగ్గది ఒక్క సావిత్రే. అవును సావిత్రే. తప్పకుండా ఆ రాత్రి తమ ఇంట్లో వున్నది సావిత్రే. ఆ నీడ అలా కదిలిపోతుంటే సావిత్రి నడిచినట్లు గానే అనిపించింది. నీరసంలో తనంత బాగా గమనించలేకపోయింది. పైగా చీక టిగా కూడా వుంది.

"ఇప్పుడు కవితకి అన్నీ స్పష్టంగా తెలిసి పోయాయి. సావిత్రి ఒకనాడు తన పుట్టిన రోజని స్వీట్లు తెచ్చిచ్చినప్పుడు చంద్రశేఖరం తనచేత ఆమెకి 'చీరా జాకెట్టూ' ఇప్పిం చాడు. సందేహం లేదు. ఇది ఆమె జాకెట్టే. ఆమెదే. అమ్మో తమ హాస్పిటల్లో పనిచేసే నర్సు సావిత్రి ఇంతకు తెగిస్తుందా? ఇంత పనిచేస్తుందా?

"కవిత హాస్పిటల్‌కి వెళ్లివస్తున్నదే కాని నర్సు సావిత్రిని చూడలేకపోతున్నది. తను డ్యూటీలో వున్నప్పుడు సావిత్రి తనకి డ్యూటీ పడకుండా వీలైనంతవరకూ కాపాడుకుంటు న్నది. అలాంటి సమయాలలో కవితకి చంద్రశేఖరం ఆఫీసులో వుంటున్నాడో లేడో అన్న అనుమానంతో వుండేది.

"చంద్రశేఖరం రాత్రిళ్లు లేటుగా ఇంటికి





వచ్చినప్పుడు హాస్పిటల్లో స్టాఫ్ ఎవరెవరు డ్యూటీలో వున్నారో కనుక్కునేది. రాను రాను ఆమె వైఖరి స్టాఫ్‌మెంబర్లకి కూడా ఆశ్చర్యం, విసుగు కలిగించడం మొదలుపెట్టింది.

"ఇంకోరోజు చంద్రశేఖరం కవితకి నైట్ డ్యూటీ వున్ననాడు ఆలస్యంగా ఇంటికి వచ్చాడు. పోర్టికోలో ఆగిన కారు కిటికీల లోంచి వచ్చే వెలుతురును చూసి కారు మళ్ళీ వెనక్కి స్టార్టు చేసి డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు. కారు ఆగిన చప్పుడు, మళ్ళీ స్టార్టు చేసిన చప్పుడూ విని కవిత గబగబా కిటికీ వద్దకి వచ్చి కర్టెను తొలగించి చూసింది.

"కారు తమదే. డ్రైవ్ చేస్తున్నది చంద్రశేఖరమే. పక్కన కులుకుతూ కూర్చున్నది సావిత్రి. సందేహం లేదు. సావిత్రే. తను స్పష్టంగా చూసింది. వీళ్ళిద్దరూ ఫస్ట్‌షో సినిమాకి వెళ్ళివచ్చారు. ఇంట్లో లైట్లు వేసి వుండడంచేత ఎవరో వుండివుంటారనుకుని సావిత్రితో ఇంట్లో ప్రవేశించే ధైర్యం చాలక ఆమెను తీసుకొని వెనక్కి వెళ్ళిపోయాడు చంద్రశేఖరం. ఆమెను దింపి తనొక్కడూ ఇంటికి తిరిగివచ్చి "అయ్యో నువ్వింకా వెళ్ళ లేదా? " అని అడిగినా తను ఆశ్చర్యపోదు తన తండ్రి తమ కోసం కారు కొనిస్తే అనుభవిస్తున్నది వేరొకరు- అనుకుంది కవిత.

"చంద్రశేఖరం తనకు తాళికట్టిన భర్త. ఈ ఇల్లు తనది. ఈ ఇంట్లో పడక గది తనది. పడక గదిలోని పక్కబట్టలు తనవి. ఈ ఇంట్లో ప్రతీ వస్తువు తనదే. ఆ కారు తమకి తన తండ్రి కొనిచ్చాడు. ఈ ఇంట్లోని ప్రతీ చిన్న వస్తువూ తను అనుభవించతగ్గవి, తను ఆనందించదగ్గవి. ప్రతీ చిన్న విషయమూ తను సంతోషించదగ్గవి. అన్నీ తనవే. తన స్థానాన్ని ఆక్రమించుకోడానికి కాని, పంచుకోడానికి కాని మరో స్త్రీకి అర్హత లేదు. తనకి లభించని సుఖం, శాంతి తను బతికుండగా తన కళ్ల ఎదుట మరొకరు బలవంతంగా లాగేసుకొని అనుభవించడం చూస్తుంటే తనకి ప్రాణం పిండి ఎవరో పట్టుకుపోతున్నట్లనిపించింది.

"సావిత్రి, సావిత్రి, సావిత్రి" ఆ పేరు తలుచుకున్నప్పుడల్లా కవితకి కడుపులో చేయిపెట్టి కెలికినట్లవుతోంది. ఆలోచించే శక్తిపోయి విపరీతంగా నీర్సంగా వుంటోంది. అప్పుడప్పుడు చంద్రశేఖరం తనతో ప్రేమగా వుంటున్నా అతనిమీద విపరీతమైన ద్వేషం పుట్టుకువస్తోంది. "ఎంత మోసగాడు, ఎంత దుర్మార్గుడు, ఎంత నమ్మకద్రోహి. కవిత అతని గురించి ఏమాత్రమూ మంచిగా ఊహించలేకపోతోంది. పోనుపోను అతని నటనవలన అతని వునికే ఆమెకి ఏవగింపు కల్గిస్తున్నది.

"హాస్పిటల్లో ఇదివరకు స్టాఫ్ మెంబర్లందరూ ఎంతో గౌరవించేవారు. కాని ఇప్పుడు ఇద్దరిద్దరు, ఇద్దరు ముగ్గురు గ్రూపులకింద మారి తనని చూడగానే గుసగుసలు చెప్పుకుంటున్నారు. తను వాళ్ళని గమనిస్తున్నట్లున్నా, అటుగా వెళ్ళినా ఠక్కున మాట్లాడుకోడం మానేసి ఎవరి పనుల్లో వారు నిమగ్నులయినట్లుండేవారు. రోజులో ఒకసారైనా ఎవరో ఒకరు వచ్చి "మీ ఆరోగ్యం బావుంటోందా? " అని అడిగేవాళ్లే.

"ఏం ఏం వచ్చింది తన ఆరోగ్యానికి. తనూ అందరిలా తింటున్నది. హాయిగా ఉద్యోగం చేసుకుంటున్నది. తనకి ఏం లోటూ లేదే. ఎందుకిలా వీళ్ళంతా గుసగుసలు పోతున్నారు? అమ్మ కూడా రోజూ ఒకసారైనా నాన్నగారితో వచ్చి కొంచెంసేపు కబుర్లు చెప్పి వెళుతోంది. వెళ్లేముందు "వెళ్ళివస్తానమ్మా ఆరోగ్యం జాగ్రత్త" అంటూ మెట్లు దిగేది.

"అందరూ కూడా తనలో ఏదో మార్పు వున్నట్లు గమనించసాగారు. రెండురోజుల క్రితం సరోజ వచ్చి తన పెళ్ళి 'శుభలేఖ'

ఇచ్చి "తప్పకుండా రావాలే" అంది. పెళ్లి తిరుపతిలో చేస్తున్నారుట. సరోజని చూసిన కవిత తన ప్రాణస్నేహితురాలిని అనవసరంగా అనుమానించానే అని బాధపడి పైకి చెప్పలేక జలజలా కన్నీళ్లు కార్చింది.

"సరోజ ఆశ్చర్యపోయింది. "ఏం కవితా నాకు పెళ్ళంటే నువ్వు కంటతడి పెడ్తున్నావు" అంది. కవిత వెంటనే దుఃఖాన్ని దిగమింగుకొని "ఛ... ఇది ఏడుపు కాదే- సంతోషం... ఆనందబాష్పాలు లేవే" అంది సరోజని కౌగిలించుకుంటూ.

"సరోజ ఇంక ఏమీ ఎక్కువ మాట్లాడలేదు. వెళ్ళిపోయింది.

"మర్నాడు తను హాస్పిటల్‌కి వెళ్ళినప్పుడు అందరూ "నర్సు సావిత్రికి పెళ్ళి నిశ్చయమైంది" అని చెప్పుకోసాగారు. ఎవరూ డాక్టరు సరోజ గురించి పట్టించుకోవడమే లేదు.

"అదేమిటీ, రెండ్రోజుల క్రితం తనకి సరోజ వచ్చి పెళ్ళి శుభలేఖనిచ్చిందే. స్టాఫంతా సరోజ పేరు చెప్పకుండా సావిత్రి పేరు చెబుతున్నారేమిటీ" అని విస్తుపోయింది కవిత. అప్పుడప్పుడు హాస్పిటల్లో స్టాఫ్ కూడా తనని ఏడిపిస్తున్నారేమోననే అనుమానంతో వుండసాగింది. పోనుపోను అందరి దృష్టిలోనూ తనకి పిచ్చెక్కుతున్నదేమోనన్న అనుమానం కూడా వుండివుండొచ్చు

"ఆనాడు అమ్మ తన గదిలో తన చీరలన్నీ మడతపెట్టి ఉతికి ఆరేసి ఇస్త్రీ చేయవలసినవి తనతో తీసికెళ్ళడానికి పెట్టె సర్దుతోంది. చంద్రశేఖరం చెప్పి పెట్టినట్లుగా వేగంగా వచ్చాడు. విశ్వనాధంగారు, చంద్రశేఖరం కాఫీలు తాగుతూ ఓ మూల కూర్చుని అతినెమ్మదిగా రహస్యాలు మాట్లాడుకుంటున్నట్లు మాట్లాడసాగారు.

"ఆఖరికి విశ్వనాధంగారే కాఫీ ముగించి లేస్తూ,

"పోనీలేవోయ్. ఇంకొక్క వారం పదిరోజులు చూసి జాయిన్ చేద్దాం. అక్కడి వాతావరణంలో పిచ్చి తగ్గదుసరికదా ఎక్కువవుతుంది. మెల్లిగా ఏ ఊరన్నా తీసికెళ్ళి తగ్గేవరకూ వుంటాం. కొన్నాళ్లు హాస్పిటల్‌కి శలవు పెట్టిస్తాను. ఏ కొడైకెనాల్‌కో తీసికెళ్ళితే వాతావరణం మార్పుతో మళ్లీ అమ్మాయి మామూలుగా అయిపోతుంది. కవితని తీసుకొని నేనూ వాళ్ళమ్మా వెళతాములే. నువ్వు బిజినెస్ చూసుకో చంద్రశేఖరం" అంటున్నారు.

"ఆఖరికి చంద్రశేఖరం ఇంతకి తెగించాడన్నమాట. తన తప్పులు బైటపడి నలుగురూ అతనిని దుమ్మెత్తి పొయ్యకుండా మంచివాడిలా నటిస్తూ నాకు పిచ్చిని అంటగడ్తున్నాడన్నమాట.

'అమ్మా' కవిత అరిచింది గట్టిగా. అందరూ ఆ అరుపు విని భయపడి ఆమె గదిని చేరారు.

"నాకు పిచ్చిపట్టలేదు. నన్నెక్కడికీ తీసికెళ్ళక్కరలేదు"

"నీకు పిచ్చి అని ఎవరన్నారమ్మా. మనశ్శాంతికి మరో ఊరు వెళదామని అంటున్నాం అంతే" అన్నారు విశ్వనాధం గారు.

"మనశ్శాంతి మరో ఊరు వెళ్తే లభించేది కాదు నాన్నా" తన చూపులు చంద్రశేఖరం వైపు తిప్పి తీక్షణంగా చూస్తూ, "మరో జన్మ ఎత్తాలి" అంది.

"అమ్మా కవితా ఏమంత ఖర్మ వచ్చింది. ఒక్కగానొక్క పిల్లవి. అలాంటివి మాట్లాడకమ్మా. నువ్వెలా చెబితే అలాగే చేస్తాం" అంది తల్లి పార్వతి బెంబేలు పడిపోతూ.

"విశ్వనాధంగారికి "కవిత తప్పు ఏదన్నా వుండవచ్చును. కాని దానికి కారణం చంద్రశేఖరమేమోనన్న అనుమానం కొద్దిగా కలగ

సాగింది. దానికితోడు చంద్రశేఖరం కవిత చూపుల్లోని తీక్షణతని తట్టుకోలేక అటెటో చూస్తున్నట్లు నటించటం తను గమనించక పోలేదు.

"ఉన్నట్లుండి కవిత గడగడ వణకిపోసాగింది. కళ్లు తిరిగి పడిపోయింది. పార్వతీ, విశ్వనాథం ఆమెను మెల్లిగా బెడ్‌రూమ్‌లోకి చేర్చి బెడ్‌మీద పడుకోబెట్టారు. వళ్లు ముట్టుకు చూస్తే సలసల కాగిపోతోంది.

"పార్వతికంతా అయోమయంగానూ, ఏమిటో తెలియని భయంగానూ వుంది.

"చంద్రశేఖరం డాక్టరును తీసుకొస్తానని చెప్పి పరుగెత్తాడు.

"విశ్వనాథంగారికి కూడా ఏం జరిగిందో ఏం జరగబోతోందో తెలియడంలేదు. ఇంత హఠాత్తుగా కూతురి ఆరోగ్యం ఎలా దెబ్బతిందో ఆయనకంతుపట్టడంలేదు.

"చంద్రశేఖరం ప్రైవేటు ప్రాక్టీసు చేస్తున్న తనకి తెలిసున్న డాక్టరును తీసికొచ్చాడు.

"ఆయన కవితని అన్నివిధాలా పరీక్షచేసి "ఒంట్లో అనారోగ్యానికి ఏ కారణం లేదనీ, కేవలం మానసిక ఆందోళన తప్ప ఏమీలేదనీ చెప్పాడు. రేపు తన డిస్పెన్సరీకి వస్తే ఆమె గర్భవతి అవునో కాదో పరీక్ష చేసి చెపుతా"నని చేతులు కడుక్కుని తుడుచుకుంటూ అన్నాడు.

"ఆమె దేనిగురించో విపరీతంగా బాధపడుతోంది. ఆరోగ్యానికి స్థలం మార్పు ఎంతైనా అవసరం" అని విశ్వనాథంగారితో అన్నారు. చంద్రశేఖరం ఆయనని దిగబెట్టడానికి వెళ్ళాడు.

"పార్వతి "ఏమండీ అమ్మాయిని ఇప్పుడే మనం మన ఇంటికి తీసుకుపోదాం" అంది.

"విశ్వనాథంగారు "అల్లుడు రానీ, అల్లుడుతో అన్నీ వివరంగా మాట్లాడి తీసికెళ్దాం'' అన్నారు.

"డాక్టరుగారిచ్చిన ఇంజక్షనుకి కవితకి బాగా నిద్రపట్టేసింది.

"చంద్రశేఖరం వచ్చి "కవితను రెస్ట్ తీసుకోనీండి ఇవ్వాల్టికి. రేపు తీసికెళ్దురుగాని" అన్నాడు. ఆ రాత్రికి తనే వంటావార్పూ చేసి అందరికీ పెట్టాడు. పార్వతీ, విశ్వనాథం పిల్ల దగ్గరే కూర్చుని వున్నారు.

"తెల్లవారింది. కవితకి తెలివి వచ్చింది. కాని ఎన్నాళ్లనుంచో లంఖణాలు చేసినట్లు నీరసించిపోయింది.

"కవిత ఇక్కడే ఈ ఇంట్లోనే వుంటానని అంది. తనకి కొంచెం రెస్ట్ అవసరమనీ హాస్పిటల్ స్టాఫ్‌లో నర్సు సావిత్రి అంటే తన కిష్టమనీ ప్రస్తుతం తనకి సపర్యలు చేయడానికి సావిత్రిని పిలవమనీ తండ్రి విశ్వనాథంగారితో చెప్పింది.

"కవితకి కొంచెం బావుంది కనుకనూ, ఆమె తల్లిదండ్రులున్నారు, చూసుకుంటున్నారు కనుకనూ చంద్రశేఖరం ఆఫీసుకు సెలవు పెట్టకుండా అర్జెంటు మీటింగుకి ఎటెండయి వస్తానని వెళ్ళాడు.

"విశ్వనాథంగారు హాస్పిటల్‌కి ఫోనుచేసి సావిత్రితో "అమ్మా సావిత్రీ నువ్వు కొంచెం మా ఇంటికి వచ్చి కవితని చూసుకోవాలమ్మా. కవితకి నీ సేవే కావాలిట. అవసరమైతే సెలవుపెట్టుకొని రామ్మా" అన్నారు.

"సావిత్రి చంద్రశేఖరం ఆఫీసుకి ఫోను చేసింది. 'వెళ్ళాలావద్దా' అని అడగడానికి, కానయితే చంద్రశేఖరం ఆ సమయానికి అక్కడ సీటులో లేడు. ఏదో మీటింగులో వున్నాడు. ఇంక విధిలేక రమ్మనమని రిక్వెస్టు చేసినది విశ్వనాథంగారే కనుక బయలుదేరింది.

"కవిత నిద్ర నటించింది. పార్వతి అల్లుడొచ్చేలోపున ఏదైనా ఇంత వండి పెడదామనీ, కూతురు పడుకుంది కదానీ వంటింట్లోకి వెళ్ళింది. విశ్వనాథంగారు డ్రాయింగు రూములో కూర్చుని పేపరు తిరగేస్తు

న్నారు. కవిత తూలుతూ లేచి బీరువా తెరచి ఏదో తీసుకుని తన తలగడకింద పెట్టుకుంది. మధ్యలో అప్పుడప్పుడు తల్లి వచ్చిచూసి వెళ్తున్నది. తల్లికి అనుమానం కలగకుండా మళ్ళీ నిద్ర నటించసాగింది.

"సావిత్రి వచ్చింది. డ్రాయింగు రూము లోనే జోళ్ళు విప్పి తన పర్సును అక్కడే టేబులుమీద పెట్టి సరాసరి కవిత గదిలోకి వెళ్ళిపోయింది.

"కవిత నీరసంగా కళ్ళు తెరచి సావిత్రిని చూసి చిన్నగా నవ్వి మూలిగి కళ్ళు మూసుకుంది. సావిత్రి కవిత ముఖంలోకి సూటిగా చూడలేక తలదించుకునే ఆమె పక్క సవరించసాగింది.

"చంద్రశేఖరం ఇంకా రాలేదు.

"అమ్మా! సావిత్రి నాకు స్పాంజ్ వాష్ ఇస్తుంది. నువ్వు కొంచెం వేణ్ణీళ్లు పెట్టమ్మా' ' అంది.

"పార్వతి వేణ్ణీళ్ళు పెట్టడానికి వంటింటి వైపు వెళ్ళింది. సావిత్రి కవితకి చీర తీసి స్పాంజ్ వాషివ్వడానికి నడుంచుట్టూ రెండు చేతులు వేసి ఆమెని ఒత్తిగిలించడానికి ప్రయత్నం చేస్తున్న సమయంలో హఠాత్తుగా కవిత "ఇంక నువ్వు శాశ్వతంగా చంద్రశేఖరానికి దూరంగా వుండు" అంటూ తలగడకిందనున్న సిరెంజి తీసి సావిత్రి భుజంలో గుచ్చింది.

"కలలో కూడా ఊహించని పరిణామం చేత సావిత్రికి తప్పించుకోడానికి వీలులేకపోయింది. గట్టిగా అరచి అలాగే కవిత శరీరంమీద వాలిపోయింది.

"కవిత ఎంత వేగంగా ఆమెని సిరెంజితో పొడిచిందో అంత వేగంగా మళ్ళీ సిరెంజిని నింపి తను లేవలేదు కనుక తన తొడలో పొడిచేసుకొని అరచి పడిపోయింది.

"అరుపులకి పరుగెత్తి వచ్చిన పార్వతీ విశ్వనాధంలు కవిత ఏదో అఘాయిత్యం తలపెట్టిందని గుమ్మం దగ్గరే ఊహించారు. "అమ్మా కవితా" అంటూ వెళ్ళబోతున్న భార్యను గుమ్మం వద్దనే ఆపివేశారు విశ్వనాధంగారు.

"విశ్వనాధంగారు సావిత్రి వచ్చి కవితని ఏమైనా చేసిందా అని అనుమానించేరు. మరి ఆమె కూడా కవిత దేహంమీద అడ్డంగా పడివుందే. సందేహంలేదు. ఇద్దరి శరీరాల్లోనూ జీవుడు ఆడుతున్నట్లులేదు. ఇద్దరూ నిర్జీవుల్లా కనిపిస్తున్నారు.

"అమ్మా కవితా ఎంత పని జరిగిందమ్మా' ' అంటూ విశ్వనాధంగారు వాపోయారు.

"పార్వతి అంతా అర్థంచేసుకున్నట్లుగా గుమ్మంలోనే 'కవితా' అంటూ పడిపోయేరు.

"ఇంతలో చంద్రశేఖరం రానేవచ్చాడు. అక్కడి పరిస్థితుల్ని అర్థం చేసుకోడానికి అతనికి ఎంతోసేపు పట్టలేదు. నర్సు సావిత్రిని ఫోను చేసి పిలిపించినందుకు ఎంతో కోప్పడ్డాడు.

"సావిత్రిని ఫోనుచేసి ఎందుకు పిలిపించేరు. కవితకి సేవలు చేసేందుకు మనం ముగ్గురం వున్నాం కదా! మన కుటుంబంలో ప్రవేశించి ఆమె తన జీవితాన్ని కూడా ఆహుతి చేసుకుంది. ఎంత పనిచేసింది కవిత. ఇప్పుడు ఇద్దరూ మనకి కాకుండా పోయేరు. మామగారూ, హాస్పిటల్ స్టాఫ్, పోలీసులూ వచ్చే వరకూ ఎవరూ ఆ గదిలోకి 'వెళ్ళకండి" అంటూ చంద్రశేఖరం అక్కడే వున్న కుర్చీలో కూలబడి తలని రెండుచేతులతో పట్టుకొన్నాడు.

"నన్నొంటిగాణ్ణి చేసిపోయావా కవితా-అయ్యో ఆ సమయానికి నేనైనా లేకపోయానే ఎంత ఘోరం జరిగిపోయిందీ అయ్యో కవితా" అంటూ ఏడుపు మొదలు పెట్టాడు.

విశ్వనాధంగారు తమ దుఃఖం దిగమింగుకుంటూ అల్లుణ్ణి ఓదార్చబోయాడు.




"నాయనా చంద్రశేఖరం ఏడుస్తూ కూర్చుంటే జరగవలసిన పనులు ఆగిపోతాయి. కర్తవ్యాన్ని గుర్తించి మనం వెంటనే ఏం చేయాలో అది జరిపించాలి. మనం మగవాళ్ళం బెంబేలు పడిపోకూడదు. అసలేం జరిగిందో! వాళ్ళిద్దరూ నిజంగా మరణించారా లేక ఇంకా ఊపిరి ఆడుతోందా? అనడానికి హాస్పిటల్‌కి ఫోను చేసి డాక్టర్లని పిలిపించు. ఈలోపున నేను పోలీసులకి..."

"ఒద్దు మావగారూ పోలీసులూ గొడవా నేను భరించలేను. నా కవిత నాకు దక్కాలి. నేను హాస్పిటల్‌కి డాక్టర్లకి ఫోను చేస్తాను. దేవుణ్ణి ప్రార్థించండి. వాళ్ళిద్దరూ బతికుంటే మనమదృష్టవంతులమే..." అంటూండగానే విశ్వనాథంగారు ఎమర్జన్సీ వార్డుకి ఫోనుచేసి చెప్పేరు.

"నిముషాలలో ఇద్దరు ముగ్గురు డాక్టర్లు తమపరివారంతో ఏంబులెన్సు వాన్‌తోసహా వచ్చి చేరారు. రుమాలు పట్టుకొని కవిత చేతిలోని సిరెంజిని వేలిముద్రలు పోకుండా ఒక సురక్షితస్థానంలోకి చేర్చి సావిత్రినీ కవితనీ పరీక్షించేరు.

"ఇద్దరి ప్రాణాలూ ఎప్పుడో అనంతవాయువుల్లో కలిసిపోయున్నాయి.

"ఆ రెండు శవాల్నీ డాక్టర్లు పోస్టుమార్టం కోసం ఏంబులెన్సులో హాస్పిటల్‌కి తరలించి వాళ్ళే పోలీసులకి ఫోను చేసి చెప్పేరు. సిరెంజిమీద, సావిత్రి శరీరంమీదా కవిత వేలిముద్రలుండడంవలన కవితే సావిత్రికి ఇంజక్షను ఇచ్చి తనకి కూడా ఇచ్చుకున్నదని స్పష్టమౌతోంది.

"సావిత్రి వచ్చేటప్పుడు తనతో ఎలాంటి పరికరాలూ తేలేదని, తెచ్చుకున్న హేండు బాగ్, చెప్పులూ కూడా డ్రాయింగు రూంలోనే వదలి వెళ్ళినట్లు విశ్వనాథంగారూ, పార్వతీ కూడా చెప్పేరు.

"కవిత అర్థంలేని అనుమానంతో సావిత్రిని తమ ఇంటికి పిలిపించుకొని ఆమెని హత్యచేసి తను చనిపోయింది. అని కేసులో తేలింది.

"తమ కూతురి కాపురం పాడై కూతురు సర్వనాశనం కావడానికి సావిత్రే కారణమని పార్వతి విశ్వాసం. "ఇంక నువ్వు శాశ్వతంగా చంద్రశేఖానికి దూరంగా వుండు" అన్న కవిత మాటలు, సావిత్రి అరుపు విశ్వనాథంగారు స్పష్టంగా విన్నారు. కవిత తన చేతులతో తన జీవితాన్ని నాశనంచేసికొంది.

"తర్వాత కొన్నాళ్ళు గడిచాయి.

"రోజురోజుకీ కృంగి కృశించిపోతున్న అల్లుణ్ణిచూసి విశ్వనాథంగారు "నాయనా మా బాధలు మేం పడతాము. ఎన్నాళ్ళని సుఖంలేకుండా, ప్రశాంతత లేకుండా మాతో పాటే వుంటావు? నా మాట విని నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకో. లేకపోతే ఏ విదేశాలకో వెళ్ళిపో. ఈ ఆస్తినంతా అమ్మేసుకొని వెళ్ళిపో. మాకున్నది మాకు చాలు" అని ఎన్నో సార్లు చంద్రశేఖరాన్ని ఊరడిస్తూ చెప్పేరు.

"కవితలేని జీవితం వ్యర్థమన్నాడు చంద్రశేఖరం. ఆమె స్థానంలో తనింకెవ్వరినీ ఊహించలేనని కూడా అన్నాడు. తనకింక ఏ కోరికలూ లేవనీ అవన్నీ కవితతోటే పోయాయనీ వాపోయాడు.

"చివరికి ఆస్థిపాస్థులమ్మేసి అమెరికా వెళ్ళి మళ్ళీ ఏదన్నా చదివి అక్కడే స్థిరంగా నివసించడానికి వప్పుకున్నాడు చంద్రశేఖరం.

"ఈ... ఈ 'చంద్ర'యే మన కవిత భర్త చంద్రశేఖరం" అని దీర్ఘంగా నిట్టూర్చి కవిత కథని ముగింపుకి తెచ్చింది మాధురి.

కవిత చరిత్ర ఇంత విషాదభరితమని శైలజ ఎన్నడూ ఊహించలేదు. కవిత మనకికలేదు. కవితని మనమింక చూడలేం.

కవిత మనందర్నీ వదిలి శాశ్వతంగా వెళ్ళి పోయింది. "ఈ చంద్ర'యే మన కవిత భర్త చంద్రశేఖరం అని మాధురి అన్న మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి శైలజకి.

"మేట్రిమోనియల్ ఏడ్‌లో అతను డాక్టర్ చంద్ర అని రాసినట్లుందే. ఈ చంద్రయే ఆ చంద్రశేఖరమని నీకెలా తెలుసు?" అడిగింది మాధురిని.

"కాదు శైలూ అతను డా॥చంద్ర' అని రాయలేదు. నువ్వు మళ్ళీ 'కటింగ్' తీసి చదువు. 'చంద్ర' అని మాత్రమే రాసుకున్నాడు. అయితే ఈ 'ఏడ్'. ఇచ్చేముందు అతను విశ్వనాధంగారికి ఉత్తరం రాసాడుట:

"విశ్వనాధంగారు ఒకనాడు నాకు ఫోను చేసి "ఒక్కసారి వచ్చి వెళ్ళమ్మా మాధురీ. పార్వతికి ఈమధ్య బి.పి. ఎక్కువవుతూన్నట్లుంది" అన్నారు. కవిత పోయిందగ్గర్నుంచీ పార్వతిగారి ఆరోగ్యం ఏమీ బాగుండడంలేదు. నేనే వెళ్ళి ఆవిడని చూసి వస్తున్నాను.

"ఈ పైకథంతా అప్పుడూ అప్పుడూ పార్వతిగారూ విశ్వనాధంగారూ చెప్పినదే.

"విశ్వనాధంగారే చంద్రశేఖరం వుత్తరం రాసేడనీ పెళ్ళికి వప్పుకున్నాడనీ, కులమత భేదాలు, కట్నకానుకల ప్రసక్తే లేవు కనుక మాధురికి చంద్రశేఖరం గురించి పూర్తి వివరాలు చెప్పి "అతను అమెరికాలోనే సెటిల్ అవుతాడు. మాకు కొడుకైనా, అల్లుడైనా అతడే. నీకు అభ్యంతరంలేకపోతే చెప్పమ్మా. వెనుకటి రోజులు మర్చిపో. మా కవిత తనజీవితాన్ని తానే పాడుచేసుకుంది. నువ్వు మా కవితలాంటిదానివి కావు. నువ్వు నీ జీవితాన్ని తీర్చిదిద్దుకోగలిగితే అతను మంచివాడే. నీకూనచ్చవచ్చు నీ ఇష్టం అమ్మా!" అన్నారు.

"నేను ఆలోచించి చెపుతాను" అని వచ్చేసేను.

"ఎంత ఆలోచించినా అతనిమీద నాకు సద్భావం కలగలేదు. సావిత్రిని వలలో వేసుకొని ఆమె జీవితం, కవిత జీవితం నాశనం కావడానికి కారకుడు చంద్రశేఖరమే. కాబట్టి నాకు అతనిమీద ఏమాత్రం సదభిప్రాయంలేదు. కలుగదు, కలుగబోదు' ' మాధురి కోపంతో ఆవేశంతో అంది.

"నువ్వు కాకపోతే అతని జీవితం గురించి తెలియని వాళ్ళెవరైనా అతన్ని చేసుకోవచ్చు అప్పుడు వాళ్ళు సుఖంగా వుండనూ వచ్చు" అంది శైలజ.

మాధురి శైలజవైపు అనుమానంగా చూసింది. "నువ్వు కానీ చేసుకుందామనుకుంటున్నావేంటి శైలూ" అంది మాధురి.

"ఛ ఛ నాకేం కర్మ. నేనేం అనుకోవడం లేదు. తెలిసి తెలిసి గోతిలో పడాలని ఎవరూ అనుకోరు. అందులోనూ కవిత మన స్నేహితురాలు. ఆమె మానసికంగా ఈ నరరూప రాక్షసుని వలన ఎంత నరక యాతన అనుభవించిందో పాపం- ఇంతకీ నేను..." అని తన గురించి ఏదో చెప్పబోయి ఆగిపోయింది శైలజ.

"అవును కానీ శైలూ నువ్వింకా ఎవరినీ ఎందుకే ప్రేమించలేదు. త్వరగా ప్రేమించి పెళ్ళిచేసేసుకోవే. అలా ఒక్కొక్కరమే సెటిల్ అయితే బాగుంటుంది కదా" అంది మాధురి.

"అయితే బావుంటుంది. కాని అవకాశం, సమయం తోసుకురావాలి కదా! చూద్దాం అలా నాకేదన్నా తటస్థపడితే ముందు నీకే రాస్తాను" అంది శైలజ.

"పెళ్ళి పెళ్ళి అంటాం కానీ చేసుకున్న వాళ్ళేమంత సుఖపడిపోతున్నారులే. కవిత బతుకిలా అయిందా! వినూత్నకి సుఖం, శాంతి దూరం. వినోద్‌కి భార్య పోయింది"

"వినోద్‌కి భార్య పోయిందా? ఆ మాటె ప్పుడూ వినోద్ చెప్పలేదే. మరి ఆ పిల్లవాణ్ణి ఎవరు పెంచుతున్నారే" అంది శైలజ.

"అయితే నువ్వు వినోద్‌నీ, వినోద్ పిల్లవాడినీ చూసావన్న మాట. వాళ్ళమ్మగారితో కూడా మాట్లాడేవా? పాపం ఆవిడే ఆ పిల్లాణ్ణి సాకుతోంది. ఆ మనమడంటే ఆవిడకి పంచప్రాణాలూ"

"ఇండియా వదిలి న్యూజిలాండు వెళ్ళే ముందర నన్నొకసారి వాళ్ళింటికి వచ్చి పొమ్మన్నాడు. వీలు చూసుకొని వెళదామనుకుంటున్నానులే"

మాధురి ఆవులించడం మొదలుపెట్టింది "పద శైలూ చాలా పొద్దుపోయింది. ఇంక నాకు నిద్రముంచుకొస్తోంది" మాధురి లేచింది వెళ్ళడానికి ఉద్యమిస్తూ.

"పద కిందికి. రూముకి పోయి పడుకుందాం. నీకు రేపు పగలు డ్యూటీ లేదుగా. కొంచెం లేటుగా లేవచ్చునులే.

ఇద్దరూ కిందికి దిగి రూములో ప్రవేశించారు.



శైలజ వినోద్‌నీ పిల్లవాడినీ తరుచు బీచ్‌లో కలుస్తోనే ఉంది. పిల్లవాడు రామం ఆంటీ ఆంటీ అంటూ తన దగ్గరికి వచ్చి ఆడుకుంటున్నాడు. కాని శైలజ మనసు కవిత కథ విన్న దగ్గిరనుంచీ మనస్సు చాలా కలతపడిపోయి ఉంది.

నిజానికి తను కూడా ఇంకా జీవితంలో సెటిల్ కాలేదు. తమ స్నేహితులందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క కథ వుంది. అయినా నిత్యజీవితాన్ని పారాయణం చేస్తూనే వున్నారు. అందరూ కూడా కష్ట సుఖాలను చవిచూస్తూ రొటీను జీవితానికి అలవాటు పడిపోయేరు. తను మొండి ధైర్యంతో బతగ్గలుగుతోంది. తనకున్న పట్టుదల ఎవరికీ లేదు. మరి ఈ పట్టుదల తననెక్కిడికి తీసి కెళ్తుందో, ఏమో!

వినూత్న ఎలా వుందో. వినూత్న అత్తగారు చాలా మంచివారు. మాధురి వినూత్న సుఖానికి దూరం అయిందంటుందేమిటి? వినూత్నకి కూడా ఏదన్నా కథ వుందా? అయితే తను తప్పక తెలుసుకోవలసిందే. వినూత్నలాంటి తెలివైన వాళ్ళు ఫారిన్ కంట్రీలకి వస్తే బాగా రాణిస్తారు.

అనుకోకుండా ఒకనాడు వినూత్న అత్త శ్యామలగారే తను మాధురిదగ్గర వున్నట్లు తెలుసుకొని, తనను రమ్మనమని కబురు చేసేరు.

వెళ్దామనే అనుకుంటోన్న శైలజ బత్తాయిలూ, ఆపిలుపళ్ళు కొనుక్కుని మరీ బయలుదేరింది. వినూత్నకి పెళ్ళి ప్రెజంటు ఇవ్వలేదు కనుక ఇప్పుడు తన సంపాదనతో ఒక పట్టుచీరా, జాకెట్టూ ఒక డిన్నరు సెట్టూ కొని కూడా తీసుకొచ్చింది.

శైలజని చూస్తూనే శ్యామలగారు "రా అమ్మా రా లోపలికి" అంటూ ఎంతో సంతోషంతో సాదరంగా ఆహ్వానించేరు.

"వినూత్న ఇంకాస్సేపట్లో వస్తుందిలే అమ్మా. నువ్వు ముందు కూర్చో" అని చెప్పి లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చిచ్చింది ఆవిడ.

శైలజ మంచినీళ్ళు తాగి "థ్యాంక్సండీ"





అంటూ ఆ గ్లాసును లోపలపెట్టి వచ్చింది.

"అమ్మా శైలజా నీకు వీలైతే నా కొక్క ఉపకారంచేసి పెట్టమ్మా" అన్నారు శ్యామల గారు.

"ఏమిటో చెప్పండి పిన్నిగారూ. నాకు చేతనైతే ఒకటేమిటి పది చెయ్యమన్నా చేస్తాను" అంది శైలజ.

"ఏంలేదమ్మా మా వినూత్నా తెలివితేట లకి ఇక్కడ చాలీచాలని జీతాలతో బతికేబ దులు మీ దేశంలో ఏదైనా ఉద్యోగం దొరు కుతుందేమో చూడమ్మా. నాలుగు డబ్బులు తెచ్చుకొని కనీసం వినూత్నా అయినా సుఖ పడ్తుందనీ"

శ్యామలగారు ఎందుకో గబగబా చెప్పేసి వీధివైపు చూసేరు. బహుశా ఈ విషయం వినూత్న ఇంటికి రాకుండా చెప్పేయాలని చెప్పేసినట్లుంది.

"మరి వినూత్నా భర్త ఏం చేస్తాడు. అతనూ భార్యతో వస్తాడా? లేక ఇక్కడే ఇదే వుద్యోగంలో వుంటాడా? "

"వినూత్నా ముందు ఏదైనా మంచి ఉద్యో గంలో సెటిల్ అయితే మావాడు రాక ఏం చేస్తాడులే అమ్మా. వాడూ వస్తాడు. మేం అంతా వస్తాం. రాక ఎక్కడికి పోతాము అన్నారావిడ.

ఇంతలో వినూత్న రానే వచ్చింది. వినూ త్నతోపాటు ఆమె భర్త సాగర్‌కూడా వచ్చేడు.

సాగర్ మంచి కండపుష్టిగలవాడు. విశాల వక్షస్థలం. మూతిమీద పెద్దమీ సాలు. ఒక కుస్తీవస్తాదులా చూడగానే అని పిస్తాడు. వినూత్న అతని ఆఫీసుకి వెళ్ళి అతన్ని తీసుకొని లంచ్‌కి ఇంటికి వచ్చింది.

"హాయ్ శైలజా వచ్చి చాలాసేపయిందా? ఐయామ్ సారీయే. మీట్ మై హస్బండ్ సాగర్" అంటూ శైలజకి, సాగర్‌నీ "మీట్ మై ఫ్రెండ్ శైలజా" అంటూ శైలజని సాగర్‌కి పరిచయం చేసింది.

"హల్లో బావున్నారా? మీరు ఇండియాకి వచ్చి ఎన్నాళ్ళయ్యింది? మీకు న్యూజి లాండు బావుందా? మీరక్కడ, ఆ వాతావ రణం అంతా అలవాటుపడిపోయేరనుకుం టాను. మీ గురించి వినూత్నా ఎప్పుడూ చెపుతూనే వుంటుంది" అన్నాడు సాగర్.

"రా శైలజా భోంచేద్దాం. ఆవేళ రాత్రి నాకు బాగా నిద్రపట్టేసింది. నువ్వెప్పుడు తిన్నావో ఎప్పుడు వెళ్ళిపోయావో కూడా నాకు తెలియలేదు. నేనీమధ్య బాగా అలసి పోతున్నాన్లే! అందుకే అలా! సరే! అత్తా రా, అందరం భోంచేద్దాం" అంటూ వంటింట్లోకి దారితీసింది వినూత్నా.

వినూత్న ఎప్పుడూ ఇంతే! హడావుడి మనిషి.

సాగర్ వంటింటివైపు వినూత్న వెనకాలే వెళ్ళేడు. వినూత్న మెల్లిగా అంటోంది. "రా బావా బావుండదు. ఎంత ఆకలేస్తే అంతే ఎంగిలిపడు. నువ్వు తినకపోతే నా ఫ్రెండు ఏమనుకుంటుంది"

"నాకాకలిగాలేదు. మీరు భోంచెయ్యండి. నేను మళ్ళీ డ్యూటీకి వెళ్ళిపోవాలి" అంటు న్నాడు సాగర్.

"పోనీ బావా, అత్తయ్య కోసమైనా రెండు ముద్దలు ఎంగిలిపడు. నలుగురి దగ్గరా నా పరువు తియ్యకు. నా ఫ్రెండు నా గురించి మంచి అభిప్రాయంతో తన దేశం వెళ్ళాలి. ప్లీజ్! బావా... ప్లీజ్ పోనీ నేను కలిపి తిని పించనా" ప్రాధేయపడ్తోంది. వినూత్న.

సాగర్ ససేమీరా వినిపించుకోలేదు. బయటకి వచ్చి "శైలజగారూ మీకోసం వినూత్నా అన్నీ అరేంజి చేస్తోంది. లోపలికి వెళ్లండి. అమ్మా వెళ్ళొస్తానే, నాకు ఆఫీసులో అర్జంటు పని వుంది. శైలజగారూ! మిమ్మల్ని మళ్ళీ కలుస్తాను గుడ్‌బై" అనేసి



గబగబా వెళ్ళిపోయాడు.

శైలజకి ఎంచేతో వినూత్న జీవితంలో అపశ్రుతులు వినిపించాయి. శ్యామలగారు ఏం మాట్లాడలేదు. అలా చూస్తూండిపో యారు. కొంచెంసేపయ్యాక వినూత్న తేరు కొని ముఖంలో లేని నవ్వుని తెచ్చిపెట్టు అంది

"శైలజా, అత్తా మనం భోంచేసేద్దాం రండి". అందరూ భోజనానికి కూర్చున్నారు.

శైలజ వినూత్న ముఖంలోకి చూసింది. వినూత్నని కదిపి మాట్లాడిస్తే గట్టిగా ఏడ్చే టట్లు కన్పించింది. దుఃఖాన్ని దిగమింగుకు న్నట్లుగా కూడా అన్పించింది. వినూత్న వడ్డి స్తూంటే భుజంమీద చెయ్యేసి బుజ్జగిస్తున్న ట్లుగా "బావంటే మరీ అంత పిచ్చి ప్రేమ కూడదు. మగాళ్ళకి ఆఫీసు పనులుండవూ మరి" అంటూ తనకే అనుమానం లేనట్లుగా "కానివ్వండి ఆంటీ మొదలుపెట్టండి" అంది తను మొదలుపెడ్తూ.

అందరూ ముభావంగా భోంచేసేరు.

తర్వాత శైలజా వినూత్నా వక్కపొడి నములుతూ డ్రాయింగు రూంలోకి వచ్చి కూర్చున్నారు. శ్యామలగారు మిగిలిన వంట కాలమీద మూతలు పెట్టి కాస్సేపు నడుంవా లుస్తానని వెళ్ళేరు.

వినూత్న శైలజ తెచ్చిన గిఫ్టలను చూసి "ఇవన్నీ ఎందుకు తెచ్చేవు శైలజా. నాకు వీటి అవసరం అంతగా వుండదు. నాకా పట్టుచీర అవన్నీ ఎందుకు కొన్నావు శైలజా జీవితంలో ఇంకిలాంటి బట్టలు కట్టుకుందా మని అనుకోడంలేదు" అంది.

"వినూత్నా బాధపడకు నేను నిన్నర్థంచే సుకోగలను. నువ్వెలాగైనా బావనే చేసుకుం టాననేదానివి... పంతం నెరవేరింది కదా!"

"శైలజా నాపంతం సాధించాను. కాని నా పగ సాధించలేదింకా"

"పగ, పగ ఎవరిమీదనే. సాగర్‌మీదనా?" అడిగింది శైలజ.

"కాదులే ఆ పిశాచి, ఆ రాక్షసి. దానిమీదే నాకసి. నా బావని వల్లోవేసుకొని హాయిగా కులుకుతోంది. బావ నన్ను పెళ్ళి చేసుకు న్నాక వాళ్ళాఫీసులో క్లర్కుగా పనిచేస్తుందే అదే, దానిని చేసుకున్నాడు. దాని పేరు లిల్లీ. బక్కగా రోగిష్టిదానిలా వుంటుంది.

"బావ దాన్ని ఎలా ప్రేమించాడో తెలి యదు. అత్తయ్యకి కూడా ఆ అమ్మాయి అంటే ఇష్టంలేదు. నా అందాన్నీ, నా చదు వునీ, నా ఉద్యోగాన్నీ తనతో పోల్చి చూసు కుని తనకన్న అన్నివిధాలా మిన్నగా వున్న నన్ను ప్రేమించడానికి భయపడ్డాడు. తన కన్నా వయసులో బాగా చిన్నదాన్ని, తన కన్నా తక్కువ చదువుతున్న దాన్ని చేసు కుంటే ఆ అమ్మాయి తనకి లొంగి వుండి చెప్పినట్లు వింటుందనే స్వభావం బావది. అదీగాకుండా బావ తన ఆధిక్యతని నలుగు రిలో కోల్పోలేడు. అయితే నేను చిన్నప్ప ట్నుంచీ బావనే ప్రేమించాను కనుక నాకు చదువూ, అందం, ఆస్తి వగైరాలకన్నా బావ ప్రేమే కావాలని కోరుకున్నాను

"ఆ తర్వాత మా పెళ్ళైన కొన్నాళ్ళకి బావ సరిగ్గా ఇంటికి రాకపోవడం, దేనికో ఎందుకో బాధపడుతూండడం, నాతో ఏదో చెప్పాలనుకొని చెప్పలేకపోతూండటంలాం టివి చేసేవాడు. మా శ్యామలత్తయ్యకి కూడా కొడుకు ప్రవర్తన వింతగా తోచసా గింది"

చాలాసార్లు కొడుకుతో "నాయనా వినూత్నాకి అన్యాయంచేయకు. నిన్నే నమ్ముకుంది. నీమీద ఎనలేని ప్రేమతో తనకెంత చదువూ హోదావున్నా నీకు దాసీ లాగ సేవలు చేస్తోంది. ఈమధ్య నీ ప్రవ ర్తన నాకనుమానాన్ని కల్గిస్తోంది. వినూత్నా మనసు కష్టపెట్టకు. నీకేం కావాలో చెప్పు నేను మావయ్యతో చెప్పి చేయిస్తాను"





అనేది.

"అమ్మా వినూత్నాకి నేను తగను. ఇంత కన్నా నేనింకేమీ చెప్పలేను. నా బలహీనత అనుకో. ఏమన్నా అనుకో. వినూత్నాతో నా పెళ్ళి బలవంతాన జరిపించారు. వినూత్నాకి అన్యాయం చేయాలని నాకూ లేదు. కాని జరుగుతోంది నేనేం చేయను? " అన్నాడు సాగర్.

"అమ్మా నీ దగ్గిర ఇంక నేను నిజందాచలేను. ఇప్పుడు నేను చెప్పబోయే వార్తకి నీ అనుమతి, అంగీకారం, ఆనందం వుండవు. వుండకపోయినా నేనా పనిని చేయకుండా వుండలేను. నా నిశ్చయానికి తిరుగులేదు

"అమ్మా మా ఆఫీసులో ఇంటర్మీడియేటు పాసై క్లర్కుగా జాయిను అయిన 'లిల్లీ' అనే ఒకమ్మాయిని నేను ప్రేమించాను. ఆ అమ్మాయికి తండ్రిలేడు. తల్లీ తమ్ముడూ మాత్రమే వున్నారు. ఆ అమ్మాయి కష్టాలు విన్నాక నేనామెను పెళ్ళిచేసుకుంటానని మాటిచ్చాను. లిల్లీ తల్లి ఒక్క పైసా కూడా కట్నం కాదు కదా కనీసం పెళ్ళి ఖర్చులు ఐనా పెట్టి పెళ్ళి చేయలేని స్థితిలో వుంది. ఇంక ఆమె తమ్ముడు చిన్నవాడు. చదువుకోవాలి. ఆ అమ్మాయికి నేను సాయంచెయ్యదల్చుకున్నాను"

అత్తయ్య కోపం ఆకాశాన్నంటింది.

"సాయం చేయాలనుకుంటే ఆ అమ్మాయి పెళ్ళికి ఏదైనా ధనసహాయం చేయాలి. లేదా ఎవరైనా మంచి వరుణ్ణి చూసి పెళ్ళి చేయాలి. అంతేకాని నువ్వాపిల్లని పెళ్ళిచేసుకుందామనుకుంటే తప్పుకాదుట్రా. అయినా ఆ అమ్మాయి మాత్రం పెళ్ళయి కాపురం చేస్తున్న వాణ్ణి ఎలా చేసుకుంటుందిరా! ఎలా చేసినా వినూత్నా బ్రతుకు చీకటిచేయకు" అంది తీక్షణంగా.

"నాయనా సాగర్ నాకు నువ్వొక్కడివే కొడుకువి. వినూత్నా మామయ్యకు ఒక్కతే కూతురు. వినూత్నాకి చక్కటి సంబంధాలు తేలేకా కాదు, లక్షలు ఖర్చుపెట్టి మామయ్య పెళ్ళిచేయలేకా కాదు. అయిన వాడివీ మేనల్లుడివీ, తన కూతురు నిన్ను తప్ప అన్యులని ప్రేమించదు కనుక వినూత్నాని నీకిచ్చి చేసేరు. కాబట్టి త్యాగం అంటూ పిచ్చివేషాలు వేయకు. ఆ తర్వాత వినూత్నా కోర్టు కెక్కుతే నీ వుద్యోగంవూడి, నువ్వూ నేనూ కూడా జైల్లోకెళ్ళి కూర్చోవాలి. ఎందుకొచ్చిన గొడవలు రా నాయనా. ఎన్నాళ్ళనుంచో నాకు నీ ప్రవర్తన అనుమానంగానే వుంది. ఎప్పుడో ఒకప్పుడు నేను గుండెలు బద్దలుచేసుకోవాలేమోనని కూడా భయపడుతూనే వున్నాను. ఆ పరిస్థితిని తేనేతెచ్చావు.

"సాగర్! నా కళ్ళ ఎదుటే జరిగే అనాచారాలను చూడలేను. నిన్నే సర్వస్వం అని నమ్ముకొని, నిన్నే ప్రేమించి పెళ్ళిచేసుకొన్న వినూత్నా జీవితం నేను చూస్తూండగానే నా కళ్ళఎదుటే బలైపోవడం నేను సహించలేను. కావాలంటే ముందు నాకింత విషం పెట్టి చంపేయ్. తరువాత నువ్వెంత భ్రష్టుడవయ్యావో నేనింక చూడను. మామయ్య నిన్నాడిపోసుకుంటాడనీ కాదు, మన కుటుంబ గౌరవానికి భంగం కలుగుతుందనీ కాదు- వినూత్నా గుండె బద్దలవుతుందని నేను భయపడుతున్నాను. త్యాగానికయినా ఒక హద్దంటూ వుంటుంది. అది ఎవరు చేసినా సరే. మితిమీరి ప్రవర్తించకు"

"సరేలే అమ్మా నేను చెప్పవలసినవి వినూత్నాకే నచ్చచెప్పుకుంటాను" అన్నాడు సాగర్.

ఆరోజు రానేవచ్చింది.

ఆరోజు సాగర్ చాలా హుషారుగా ఈలవేసుకుంటూ ఆఫీసునించి త్వరగా ఇంటికి వచ్చేడు. అత్తయ్య , అంతకుముందే వచ్చివున్న నేనూ కూడా సాగర్ ఉత్సాహాన్ని చూసి ఆశ్చర్యపోయాం. అప్పుడే అత్తయ్య మనసు కీడును శంకించనారంభిం

చింది.

"వినూత్నా త్వరగా తెములు. ఇవ్వాళ మనం మంచి బ్రహ్మాండమైన సినిమాకి వెళ్తున్నాం. ఎక్కడ, ఏ సినిమాకి అని ఏం ప్రశ్నలు వెయ్యకు. అంతా 'సర్ప్రైజు' ఊ... త్వరగా కానీయ్. అటెక్కడికి? నాకిప్పుడు కాఫీలు గట్రా అక్కర్లేదు. రాత్రికి భోజన ప్రయత్నం కూడా ఏం చెయ్యొద్దు. అంతా హోటల్లో భోంచేసి వచ్చేద్దాం" అంటూ వంటింట్లోకి కాఫీ కాచడానికి వెళ్ళబోతున్న నన్ను త్వరగా తయారవమని తొందరచేయడం మొదలుపెట్టాడు.

నేను ఒక్కక్షణం నిర్ఘాంతపోయినా తర్వాత బావ మాటలకి లొంగి కరగిపోయాను. ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయి "ఇదుగో ఒక్క నిముషం" అంటూ త్వరగా తయారయి వచ్చి,

"అయ్యో శ్యామలత్తయ్య ఇంకా తయారు కాలేదు" అన్నాను. నా రూపాన్ని కన్నార్పకుండా చూసి సమ్మోహితుడైనట్లు సాగర్ "వినూత్నా నువ్వు చాలా అందంగా వున్నావు. ఈ చీర నీకు బాగా నప్పింది" అన్నాడు.

"నిజంగానా బావా? ఎన్నాళ్ళకి నీనోట మ్మట ఒక మంచి మాట విన్నాను. రోజూ ఇలాగే తయారయి కూర్చుంటాను. ఎక్కడికైనా తీసికెళ్తుంటావా బావా? బావా నీకోసం, నీ ప్రేమకోసం నన్నేం చేయమంటే అదే చేస్తాను. బావా శ్యామలత్తయ్యని కూడా త్వరగా తయారయిపోమని చెప్పిరానా? "

నేను సంతోషాన్ని పట్టలేకపోయాను. సాగర్‌కి మనస్పూర్తిగా తెలుసు నేను తనని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నానో, వినూత్నా దేనికైనా వప్పుకుంటుందనీ.

"ఒద్దు... ఒద్దు. మనిద్దరమే వెళ్దాం వినూత్నా. పోనీ సినిమా మానేసి అంటే అహ అది కాదు ఈ షో మానేసి రెండవ ఆట కెళ్ళొచ్చు. అంతవరకూ బీచ్ కెళ్ళి కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పుకుందామా? ఎన్నాళ్ళయిందో మనం మనసు విప్పుకొని మాట్లాడి. అమ్మతో నేను చెపుతాలే పద" అంటూనే సాగర్...

"అమ్మా, అమ్మా నేనూ వినూత్నా అలా బీచ్‌కి, ఆ తర్వాత సినిమాకి వెళ్ళి వస్తాం అమ్మా. నువ్వు భోంచేసి పడుకో అమ్మా, తలుపేసుకో" అన్నాడు.

"నువ్వూ వస్తే బావుంటుందత్తా మరి బావేమో..."

"అత్తయ్య గారికి కొడుకు హడావుడి ప్రవర్తన చూశాక పరిస్థితిని వెంటనే అవగాహన చేసుకుంది. సాగర్ నన్ను బీచ్‌కి తీసికెళ్ళి ఆ మాటా, ఈమాటా చెప్పి నాచేత తన రెండో పెళ్ళికి వప్పుకునేటట్లు చేసుకుంటాడు. వినూత్నా పిచ్చిది. వాడంటే పడిచస్తుంది. కాబట్టి బావ ఎలా చెబితే అలా వినేస్తుంది. ఈ విషయాలన్నీ తనకి వినూత్నాతో ముందు మాటాడే అవకాశమే లభించలేదు. అలా లభిస్తే చూచాయగానైనా సాగర్ విషయం వినూత్నా ముందు పెట్టివుండేది. ఇప్పుడెలా? సాగర్ బీచ్ దగ్గరకి మాట్లాడడానికే తీసికెళ్తున్నాడు. సందేహంలేదు. అక్కడ అన్నీ విన్నాక వినూత్నా ఏం అఘాయిత్యం చేస్తుందో ఏమిటో? కానీ తనెలా ఏమాటయినా వినూత్నాతో ముందు చెప్పగలదు. ఒకవేళ తనేదైనా చెప్పినా సాగర్ అక్కడ ఆ మాటకి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అత్తకెప్పుడూ అనుమానాలే అనుకుంటుంది సరేలే అంతా భగవంతుని ఇచ్ఛ. ఏది ఎలా జరగాలో అలాగే జరుగుతుంది... అని అనుకున్నట్లుంది. అత్తయ్య .

"నువ్వొక్కతెవే ఇంట్లో వుండాలత్తా. వచ్చేయరాదూ సరదాగా" అని అంటూన్న నన్ను ఆపి ఆవిడ-




"అమ్మా అక్కడ పిల్లలు సరదాగా ఇసుకలో ఇళ్ళు కట్టుకుంటారు. జాలి ఎరుగని సముద్రుడు కెరటాల్ని పంపి వాటిని నాశనం చేయిస్తాడు. నేనలాంటివి చూడలేను. మీరు వెళ్ళి రండమ్మా, నాకింట్లో పని వుంది" అంటూ తలుపులేసుకున్నారు అత్తగారు.

అప్పుడే ఆటో రిక్షాని తీసుకొచ్చిన సాగర్ నన్ను ఎక్కించుకుని బీచ్‌కి బయలుదేరాడు.

సముద్రపొడ్డున "ఇక్కడ కూర్చుందాం, కాదు అక్కడ బావుంటుంది" అంటూ చివరికి ఇసుకలో దూరంగా కొంచెం ఎవరూ లేని ప్రదేశం చూసి కూర్చున్నాము. చాలాసేపు ఇద్దరం ఎన్నో కబుర్లు చెప్పుకున్నాము. వేరుసెనగకాయలూ అవీ కొనుక్కుని తిన్నాము.

సాగర్ అన్నాడు. "వినూత్నా నాకిప్పుడు తెలుస్తోంది. ఇన్నాళ్ళూ ఎంత విలువైన కాలాన్ని పాడుచేసుకున్నానో, నీతో కబుర్లు చెబుతూ ఇలాగే వుండిపోవాలని వుంది"

నేను అతని మాటలకి కరిగిపోయాను. సాగర్ అన్నాడు మళ్ళీ "వినూత్నా నువ్వు చాలా అమాయకురాలివిసుమా! నీ ఓర్పు నీ సహనం నేనెక్కడా ఏ అమ్మాయిలోనూ చూడలేదు. అందుకే అమ్మ అస్తమానూ నిన్ను పొగడుతూంటుంది"

బాగా చీకటిపడింది. దూరంనించి స్ట్రీటు లైటు వెలుతురు మామీద మసకమసకగా పడ్తోంది. ప్రజలొక్కొక్కరే ఇంటిదారి పడ్తున్నారు. వేరుసెనగకాయలు, బటానీలు అమ్ముకునే వాళ్ళుకూడా ఎక్కడ జనం పల్చబడ్డారో అక్కణ్ణుంచి జనం ఎక్కువమంది వున్నచోటికి వెళ్ళిపోతున్నారు. ఎదురుగా సముద్రం పెద్దపెద్ద అలలతో విజృంభిస్తోంది. నేను పెద్ద అంటే నేను పెద్ద అనుకొంటున్నట్లుగా ఒకదానిని ఒకటి ఒరుసుకుంటూ, ఒకదానిమీద ఒకటిగా వువ్వెత్తుగా లేచిపడుతున్నాయి. అలల తాకిడికి ఇసుక ఇంకొంచెం ఇంకొంచెంగా తడుసుకుంటూ పోతోంది. వెనక్కిపోతూన్న అలలు తమతో చిన్నచిన్న గులకరాళ్ళు గవ్వలూ మొదలైన వాటిని తమతో కూడా తీసుకుపోతున్నాయి. సముద్రపు హోరు తప్ప ఇంకెలాంటి కోలాహలమూ లేదు.

నేను అరమోడ్పు కన్నులతో అతి తన్మయత్వంతో బావ వడిలో స్వర్గంలో విహరిస్తున్నంత ఆనందంగా వున్నాను. చిరుగాలికి నుదుటిమీద ముంగురులు ఎగిరిపడుతూంటే సాగర్ సవరిస్తూ నావైపే చూస్తున్నాడు.

సాగర్ హఠాత్తుగా నన్ను లేపి కూర్చోబెట్టి తను నాకాళ్ళమీద పడి రెండు కాళ్ళూ పట్టుకొని ఏడుపు నటిస్తూ "నన్ను క్షమించు వినూత్నా నన్ను క్షమించు" అన్నాడు.

సాగర్ యొక్క అర్ధాంతర చేష్టలకి దిగ్భ్రాంతురాలినైన నాకు నోట మాటరాలేదు. చేష్టలు దక్కి పిచ్చిదాన్నయానో లేక అతని పిచ్చిచేష్టలు చూస్తున్నానో తెలియడంలేదు నాకు.

"వినూత్నా నువ్వు నన్ను క్షమించాలి. నేను నీకు తీరని ద్రోహంచేసేను. నా పాపానికి నిష్కృతి లేదు. నన్నొక్కసారి నువ్వు క్షమించానంటే చాలు, నా జీవితం ధన్యమైందనుకొని నేనీ సాగరగర్భంలో తలదాచుకొంటాను" అన్నాడు సాగర్ ఏడుపు స్వరంలోనే.

"సాగరగర్భంలో తలదాచుకునేది నేను. నువ్వు కాదు బావా! లే... ఇంతకీ ఏంజరిగింది బావా? నువ్వు నన్ను మోసంచేయడమేమిటి? పోనీలే ఇవ్వాళనించీ అయినా మనిద్దరం కలసిమెలసి ప్రేమగా వుందాం. సరేనా లే.. బావా లే. గడచిన దినాలు మర్చిపోయి మధురాతిమధురమైన ఈ రాత్రి మనమెంత ఆనందాన్ని అనుభవించగలమో అంతా తనివితీరా అనుభవిద్దాం.

ఆనందిద్దాం. నాకయితే రెండవ ఆట సిని మాకి కూడా వెళ్ళాలని లేదు. ఇలాగే నీవ డిలో అలల సాక్షిగా ఆదమరిచి హాయిగా వుండాలని వుంది" అన్నాన్నేను.

"కాదు వినూత్నా. నీ ప్రేమనర్థం చేసుకో లేని మూర్ఖుడిని. నీతో ఆనందంగా గడప లేని అసమర్థుడిని. నేను నీకు తీరని అన్యాయం చేసేను వినూత్నా. నేను నీకు భర్తగా తగను. నాకా అర్హత లేదు. నన్ను పూర్తిగా మర్చిపో"

"ఇంతసేపూ ఇంత ప్రేమ ఒలకబోసి, బీచ్‌కి తీసుకువచ్చి స్వర్గలోకాన్ని చవిచూ పించింది అదేదో సినిమాలోని డైలాగులాగ నన్నుమర్చిపో' అని చెప్పి అధఃపాతాళానికి అణగద్రొక్కడానికేనా? "

సాగర్ ఏం మాట్లాడలేదు.

"బావా"

... ...

"ఏం బావా పలకవు? "

... ...

"సరే చెప్పు బావా నువ్వు నాకు తీరని ద్రోహం చేసేనన్నావు. ఏమిటది. నీనోట ఏమాట వినడానికైనా సిద్ధమే. నా హృదయం ఏనాడో బండరాయిలా మారిపో యింది"

"వినూత్నా నేనేమీ చెప్పలేను. నేను, నేను ఈ సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకుం టాను. నువ్వు నన్నీ జన్మలో క్షమించలే నంత నేరం చేశాను. ఆ విషయం నీకు చెప్పకుండా ఇన్నాళ్లూ దాచిపెట్టాను. నీ అమాయక ప్రేమ నన్ను బంధించివేసింది. నేనిప్పుడు నిజం చెప్పి నిన్ను ఆవేదనకి గురి చేయలేను. అలాగని నిజందాచి నిన్నింకా మోసం కాని, ద్రోహంకాని చేయలేను. నేనింక ఎవరికీ ఎలాంటి అన్యాయమూ చేయదల్చుకోలేదు. అందుకే వినూత్నా, నేను ఆత్మహత్య చేసుకుంటానన్నది. వినూత్నా నేను బతికున్నంత కాలం నీ యీ చెరిగిపోని అందం అలాగే వాడిపో తుంది. నేనసమర్థుణ్ణి. నన్నర్థంచేసుకొని నా అసమర్థతపై జాలి చూపించి నువ్వింక ఎవ రినైనా వివాహం చేసుకొని సుఖంగా వుండా లని నాకోరిక. అందుకే నేను నీకు అడ్డుతొ లగిపోవాలని కోరుకుంటున్నాను" అన్నాడు సాగర్.

"బావా నువ్వేదో చెప్పదలచే నన్నిక్కడికి ఇవ్వాళ ఇంత ప్రేమగా తీసుకువచ్చావని నేను ముందే ఊహించాను. నువ్విచ్చిన ఈ రెండు గంటల ఆనందానికే నేను నీకు దాసోహమని నువ్వు చెప్పినట్లు వింటాను. నువ్వేది చేయమంటే అదే చేస్తాను. కాని నిన్ను మర్చిపోయి మాత్రం నేను వేరే వివా హంచేసుకోలేను. చెప్పు బావా నువ్వసలు నాకు చేసిన ఆ తీరని అన్యాయం యేమిటో. నేను నీ భార్యని, సహధర్మచారి ణిని. నీ సుఖం పంచుకోడం నాకెంత హక్కో నీ కష్టాన్ని కూడా పంచుకోడం అంతే ధర్మం. నువ్వేది చెప్పినా వినడానికి నా హృదయాన్ని బండరాయిగా చేసి కూర్చున్నాను. క్షణంక్రితం నీతో గడిపిన మధురానుభూతుల్ని కలగా భావించుకుం టాను. చెప్పు బావా చెప్పు. నువ్వు బాధప డితే నేను చూడలేను"

"వినూత్నా నువ్వు నన్ను క్షమించగల్గినా, లేకపోయినా జరిగిన దానిని ఎప్పటికైనా నీకు చెప్పడం నా విధి. నిన్నింకా అన్యాయం చేయదల్చుకోలేదు"

నేను తదేకంగా బావవైపే చూస్తూ అతని మాటలను వింటున్నాను.

సాగర్ తలెత్తి నావైపు చూస్తూ మాట్లాడే ధైర్యం లేక తలదించుకునే అన్నాడు.

"వినూత్నా మన పెళ్ళికి ముందరే నేనొక అమ్మాయిని ప్రేమించాను"

నేను ఆ మాటల్ని లెక్కచేయక "ప్రేమిం




బావా బావా! అంతే కదా! ఇప్పుడు నాతో చెప్పిన మాటలన్నీ ఆమెతో చెప్పి నిన్ను మర్చిపోమను. నువ్వూ ఆమెని మర్చిపో. మనం పుట్టినప్పుడే భార్యాభర్తలుగా పుట్టాం. దానిని నువ్వు మర్చిపోలేవు కదా బావా" లేని నవ్వు తెచ్చుకొని అన్నాను.

"వినూత్నా ఇది ఒక్క ప్రేమించడమే కాదు. పెళ్ళి కూడా చేసికొన్నాను. నా మాట నమ్ము" చాలా దీనంగా ముఖంపెట్టి అన్నాడు సాగర్.

సాగర్ లిల్లీని పెళ్ళిచేసుకున్నాడు. కట్టుకున్న భార్య వుండగా సాగర్ మరో అమ్మాయిని ప్రేమించి పెళ్ళిచేసుకొన్నాడు. సాగర్ నేను చిన్నప్పటినుంచీ ఆరాధించిన బావ, నా ప్రేమైకమూర్తి, నా జీవన సర్వస్వం. నన్ను అగ్ని సాక్షిగా పెద్దల సమక్షంలో శాస్త్రోక్తంగా వివాహమాడగా అతనికి ధర్మపత్నిగా రూపొందాను. ఏ దురదృష్టవశం చేతనో నా గర్భం ఇంకా పండలేదు. నా హృదయంలో అగ్ని పర్వతం బద్దలయింది. క్షణంక్రితం పండించుకొన్న వేయి వసంతాలు పెనుతుఫాను గాలిలో కొట్టుకుపోయాయి. ఎదురుగుండా సముద్రపు అలలు పెద్దపెద్దచేతులు చాచి వికటాట్టహాసంతో రారమ్మంటున్నాయి.

నేను ఏమీ మాట్లాడకుండా లేచి నిల్చున్నాను. నా ముఖవైఖరిని గమనించిన సాగర్ కొంచెం భయపడ్డాడు. తను ఊరికే నా జాలినర్థించడానికి ఆత్మహత్యచేసుకుంటానన్నాడు కాని నిజంగా సముద్రంలో పడి చచ్చిపోదామనుకోలేదు. కాని నన్ను చూస్తుంటే నేను ఏదో ఒక సుదీర్ఘనిర్ణయానికి వచ్చినట్లు అర్థమయిందతనికి.

సాగర్ భయపడ్డాడు.

"వినూత్నా ఎక్కడికి? వినూత్నా ఆగు ఆత్మహత్య మహా పాపం" అన్నాడు.





నేను పేలవంగా నవ్వాను. "ఇందాక నువ్వు సాగరగర్భంలో కలసిపోతానన్నది అబద్ధమా బావా! అదేదో నేను చేసేస్తే నా పీడ వదలి మీ ఇద్దరూ కులాసాగా వుందామనా! బావా నేను నిన్ను అర్థంచేసికోగలను. నాకు నీ మీద ఇదివరకే అనుమానం వుంది. అయినా చేతులు కాలాక ఆకులు పట్టుకోడమంటే ఏమిటో నీకూ తెలుసు.

"నామీద మీ అమ్మ ఆధారపడివుంది. నెలలో పదిహేనురోజులు టూరు మీద వెళ్ళివస్తున్నానని నువ్వన్నప్పుడే ఎక్కడుంటున్నావో నేను గమనించాను. నీ ఆఫీసులో నువ్వు లిల్లీకి భర్తగా చలామణీ అవుతున్నట్లు కూడా నాకు తెలుసు. మా నాన్న తలుచుకుంటే నువ్వు చేసిన పనికి నిన్నూ అత్తయ్యనీ కూడా జైల్లో పెట్టిస్తారనీ తెలుసు. నేను నిన్ను చిన్నప్పటినుంచీ వెర్రిగా ప్రేమించబట్టి నీకెలాంటి కష్టం కలిగించడం ఇష్టంలేక నిన్ను నేను ఒక్కనాడూ ఆ విషయమై కదిపి నీ మనసు, నా మనసు పాడుచేసుకోలేదు. శ్యామలత్తయ్యకి కూడా నీమీద ఎప్పటినుంచో అనుమానంగానే వున్నది"

సాగర్ నేను చెపుతున్న విషయాలన్నీ విని వినూత్నా ఇంత తెలివైనదా అని ఆశ్చర్యపోయినట్లున్నాడు.

"వినూత్నా అప్పటి పరిస్థితులకి నేను లిల్లీకి వశమైపోయాను. అదీగాక నేనెందుకో నిన్ను ఇంత అందగత్తెను, విద్యా, సంస్కారం అన్నీ నాకన్నా ఎక్కువగా వున్న నిన్ను నేను నా భార్యగా వూహించుకోడానికి భయపడ్డాను. మన వివాహం బలవంతాన జరిగింది. నాదృష్టిలో నువ్వొక మహారాణివి. దేవతవి. నాకు నీ పాదాల దగ్గర తప్ప, నిన్నాక్రమించుకొని నా దానివి అనే అర్హతకి నోచుకోలేదేమోననిపిస్తుంది.

"లిల్లీని మొదట జాలిగా చూశాను. మా పరిచయం ప్రేమగా మారి పెళ్ళివరకూ వచ్చింది. అప్పుడామెకూ నాకూ కూడా

నీమీద అసూయగా వుండేది. దానికితోడు మా అమ్మ నీవద్దనే వుంటూ నువ్వే తనకో డలవి కనుక తన ప్రేమనంతా నీకే ధార పోసింది. నీ కడుపున ఒక నలుసు పుట్టా లని తహతహలాడుతోంది"

"బావా నీకు మాత్రం అనిపించలేదా! నాకొక్క పిల్లవాణ్ణి అయినా ఇచ్చి నాకు చేసిన అన్యాయాన్ని సరిదిద్దుకోవాలని. శ్యామలత్త నా దగ్గిరుంటే నాకు తోడుగా వుంటుంది. అక్కడ నీతో వుంటే నీకే కాకుండా నీ వాళ్లందరికీ చాకిరీలు చేస్తూ సూటీపోటీ మాటలు పడాల్సివస్తుంది. కనీసం ఇక్కడుంటే ఆమెకి మనశ్శాంతైనా లభిస్తుంది. తన కొడుకింట్లో కొడుకూ కోడలు దగ్గరే వున్నానన్న తృప్తైనా వుంటుంది. అదీగాక నువ్వు పూర్తిగా ఆమె వశమైపోతే నీకెప్పుడైనా తల్లిని చూడాలను కున్నప్పుడు వచ్చి నన్ను కూడా చూస్తావు" అని అంటూ స్త్రీ సహజమైన గాద్గదికాన్ని కంఠంలో నింపుకొని అన్నాను.

సాగర్ నన్ను కౌగిలించుకున్నాడు, "వినూత్నా! నువ్వు చచ్చిపోవద్దు. నాకు నువ్వు కావాలి... నాకు నువ్వు కావాలి... వినూత్న నాకు నువ్వు కావాలి"

"బావా! ఈ మాటకోసమైనా నేను బతి కుంటాను. కానీ ఒక్కటి బావా! నా ఇంటికి ఆ అమ్మాయిని ఎప్పుడూ తెచ్చి పెట్టకు. ఒక వరలో రెండు కత్తులు ఇమడవు. ఈ జన్మలో ఆ అమ్మాయిని నీ భార్యగా నాకె న్నడూ చూపించకు. నేను ఎప్పటిలాగానే నెలలో పదిహేను రోజులు నువ్వు టూర్ మీద వెళ్తున్నావనుకుంటాను. పద బావా ఇంక ఇంటికి వెళదాం. శ్యామలత్త మన కోసం ఎదురు చూస్తుంటుంది. నేను సినిమా అయిపోయిన టైముకి కన్పించక పోతే నాకేదైనా జరిగిందనో లేక నేనే ఏదైనా అఘాయిత్యానికి ఒడికట్టాననో ఊహించుకుంటూ బెంగగా కూర్చుంటుంది. రా బావా పోదాం!" అన్నాను.

సాగర్ ఆశ్చర్యపోయాడు... నాకు తన తల్లిమీద ఎంత ప్రేమ, శ్రద్ధ అని.

"వినూత్నా! మా అమ్మకి నేను సేవలు చేసి తీర్చాల్సిన ఋణం నువ్వు తీరుస్తు న్నావు. నీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో నాకు తెలియదు!"

"భార్యాభర్తల మధ్య కృతజ్ఞతలు కావు చెప్పుకోవలసినవి. అన్యోన్యత, ప్రేమ, ఒకరి నొకరు అర్థం చేసుకోడం లాంటివి. ఇంక డ్యూటీలంటావా! నీ డ్యూటీలన్నీ నావే. నేను కూడా నీతో సమానంగా ఆచరించ డమే నా ధర్మం. నీ భార్యగా అది నా విధి. ఇంక పద బావా! నీ నటనలో ఇంక నేను భాగం పంచుకోలేను"

సాగర్ తప్పుచేసినవాడిలా నన్ను అనుస రించాడు. మేము ఇల్లుచేరే వరకూ అత్తయ్య గారు నిజంగా కంగారు పడుతూనే వున్నారు. ఇద్దరం ఆనందంగా నవ్వుతూ రావాలని మనసులో వెయ్యి దేముళ్లకి మొక్కుకుందట.

మేం ఇంటికి వస్తూనే ఏమీ జరగనట్లు ఏమీ ఎరగనట్లు "అత్తా ఇదుగో నీకోసం వేరుశనగకాయలు తెచ్చేము. ఎంత బావు న్నాయనుకున్నావు" అంటూ నేను రుమా లులో కట్టిన కాయలు విప్పి ఇచ్చాను.

సాగర్ నా ఈ చర్యకి మళ్లీ ఆశ్చర్యపో యాడు. నిజానికి 'అమ్మకోసం!' అంటూ తను వేరే ఒక పేకెట్టు తన తల్లికి కొను క్కుని రావాల్సింది. ప్రేమవున్న చోట త్యాగం వుంటుందంటారు ఇదే కాబోలు" అనుకున్నాడు సాగర్.

అలా నేను సాగర్‌తోటీ జీవితం తోటీ రాజీపడ్డానన్నమాట"

వినూత్న మనసులోని ఇన్నాళ్ల ఆరాటం ప్రాణ స్నేహితురాలి ఆప్యాయతకి కరిగి



పోయి మనసులో దాచుకున్న దుఃఖా న్నంతా వెళ్లబోసుకొంది.

"నాకు తెలుసు శైలజా జీవితాంతం నేని లాగే సుఖం, శాంతీ లేకుండా వుండాలని. కాని ఏం చేయనే నేను. బావని వదులుకో లేను. అలాగని బావతో సుఖపడుతున్నట్లు నన్ను నేను మభ్యపెట్టుకోలేను" అంది.

శైలజకి వినూత్న పైకి నవ్వుతూ నవ్విస్తూ గుండె అగాథంలో ఎంత దావానలం దాచు కుందో బాగా అర్థమయిపోయింది. ఆమెకి ప్రపంచంలో వున్న మగాళ్లందరి మీదా ఒక్కసారిగా కోపం ముంచుకొచ్చింది. "ఎందుకీ మగాళ్లంతా ఆడవాళ్లని ఏదో విధంగా మోసం చెయ్యాలని చూస్తారు? "

ఆ మాటే తను శ్యామలాంటీతో అంటే ఆవిడ అంది...

"ప్రపంచం అంతా అలానే వుంటే ఇక జీవన గమనం స్త్రీపురుషులకు ఎలా వీలవు తుందమ్మా శైలజా. కొందరాడవాళ్లు తమ భర్తలని అధికంగా ప్రేమించినట్లే కొందరు మగవాళ్లు తమ భార్యలని అధికంగా ప్రేమించి తమ సర్వస్వాన్నీ అందించి ఆనందిస్తారు. ఇంకొందరాడవాళ్లు తమ భర్తలను ప్రేమిస్తున్నట్లు నటించి వాళ్ల సర్వస్వాన్నీ దోచుకొని వాళ్లని చేతకాని దద్ద మ్మలుగా భావించి జీవితాన్ని విషపూరితం చేసుకుంటారు. చేజేతులా సర్వనాశనం చేసుకుంటారు.

"కష్టసుఖాలనేవి జీవితంలో స్త్రీ పురుషులి ద్దరూ సమానంగా పంచుకోవలసినవి, అను భవించతగ్గవి. వివాహమైన తర్వాత స్త్రీ తన అహంకారాన్ని, ఆధిక్యతనీ ప్రకటించి పురుషుణ్ణి చిన్నబోయేటట్లు చేయకూడదు. పురుషుడు విముఖుడైతే స్త్రీకి సుఖముం డదు.

"అలాగే పురుషుడు కూడ తననే దైవంగా భావించి పుట్టింటినీ సుఖాన్నీ వదులుకొని భార్యగా తన ఇంటికి వచ్చిన ఇల్లాలిని పుట్టింటిని మరపించి, ఆమెకేలోటూ రానీ యని పద్ధతిలో మురిపించాలి. ఒకరి అభి ప్రాయాలను ఇంకొకరు గౌరవించుకొని పొరపొచ్చాలు లేని విధంగా జీవించాలి. పెళ్లి అనేది నూరేళ్ల పంట.

"మీ అంకుల్ బతికున్న రోజుల్లో ఆఫీసు కెళితే ఆయన కోసం ఎదురు చూస్తూ కూర్చుని ఆయన కోసం ఆయనకిష్టమైన పదార్థాలను చేసి ఆయన వచ్చేక వాటిని తిని, తాగి నన్నూ నా కృషినీ మెచ్చుకోవా లని ఎదురు చూసేదాన్ని. ఆయన వచ్చి తన కోసం నిరీక్షిస్తూ కూర్చున్నానని, తన కోసం ఆప్యాయంగా ఎదురు చూసే భార్య వుందని గర్వపడి, పొద్దుటినుండీ ఒక్కర్తినీ వున్నందుకు జాలిపడి నన్నెంతగానో ప్రేమతో చూసుకునేవారు. సాగర్ మాకు ఒక్కగానొక్క కొడుకు. వాడు పెద్ద ఇంజ నీరు కావాలని ఆయన కలలుకనేవారు. మా అదృష్టాలిలా తలకిందులవుతాయని మేమెన్నడూ అనుకోలేదమ్మా"

శైలజకి శ్యామలగారు చెప్పిన ప్రతీమాటా నచ్చింది. ఆవిడ జీవితాన్ని కాచివడబోసిన అనుభవజ్ఞురాలు.

అందుకే వినూత్నని తనతో తీసికెళ్లి ఆమె కేదైనా మంచి ఉద్యోగం వేయించమని కోరు కుంటోంది.

వినూత్న దైనందిన జీవితం విన్న శైలజ చాలా అసంతృప్తిగా నిట్టూర్చింది. చదువుకొనే రోజుల్లో తామంతా ఎంత హాయిగా గడిపారు. ఏ బాధ్యతా ఎప్పుడూ ఎరుగరు. భవిష్యత్తులో ఎలా వుందాము అనే కలలుకనడం తప్ప ఎన్నడూ ఎలాంటి ఇబ్బందులూ పడలేదు. ఎవరికెన్ని మార్కులు వస్తాయో అన్న తహతహతో ఒకరిమీద ఒకరు పోటీ పడుతూ చదువుకు న్నారు. ఎప్పుడైనా సినిమాలకెళితే హీరోకుం





డాల్సిన లక్షణాలు ఇవేనా? హీరో అంటే ఇలా వుండాలి, అలా వుండాలి అని ఎవరి మనసులలోని అభిప్రాయాలు వాళ్లు చెప్పి ఇతరుల అభిప్రాయాలను వినేవారు. ఏమైనా పార్టీలూ, ఫంక్షన్లూ అయితే తమ గ్రూపంతా థర్డియర్ గ్రూపు, ఫోర్తు ఇయర్ గ్రూపు, ఫిఫ్తు ఇయర్ గ్రూపు అని తెలిసేటట్లు చీరలు ఒకే రంగులో కొనుక్కుని కట్టుకునేవారు. తమని చూసి తమ జూనియర్లంతా అలానే అనుకరించేవారు. స్టెత్ మెళ్లో వేసుకొని వెళ్తూంటే అప్పుడే డాక్టర్లమయిపోయినట్లే గర్వపడేవాళ్లు. ఏదైనా పూర్తిగా అనుభవంలోకి వస్తే తప్ప అందులోని కష్టనిష్టూరాలు తెలియవు. నిండా మునుగుతే కదా లోతు తెలిసేది.

శైలజకి జీవితం మీద ఒకవిధమైన వైరాగ్యం కలగనారంభించింది. తను ఇండియాకి ఏం చేయాలనుకొని వచ్చిందో అదేమీ చెయ్యకుండానే వెనక్కి వెళ్లిపోదల్చుకుంది.

"వినూత్నా బాధపడకు. నీలాంటివాళ్లు న్యూజిలాండుకి వస్తే బోలెడు కీర్తి డబ్బూ కూడ గడించుకోవచ్చు. నువ్వు వస్తానంటే నేను ప్రయత్నాలు మొదలుపెడతాను. మనిద్దరం కొన్నాళ్లు కలిసివుండొచ్చుకూడా. ఏమంటావు చెప్పు" అంటూ వినూత్న ముఖంలోకి చూస్తూ అంది శైలజ.

వినూత్న నవ్వేసింది. "నాకూ నా శ్యామలత్తయ్యకీ బతకడానికి ఈ రెండు వుద్యోగాలూ చాలులేవే. నీతో అబద్ధం చెప్పడం నాకిష్టంలేదు. కనుక నిజమే చెపుతాను. మేముగనుక ఇక్కడే వుంటేనే మా బావ మమ్మల్ని చూడ్డానికి వస్తాడు. ఆ తల్లికాస్తా గుటుక్కుమంటే అంతిమ సంస్కారం చేసి కనీసం కొడుకుగా తన బాధ్యత నెరవేర్చుకుంటాడు. అతనిచేత ఆ పనైనా భార్యగా చేయించాల్సిన బాధ్యత నాకుందా లేదా! కాబట్టి శైలూ, నన్నిలా ఉండనీ. నువ్వు వచ్చి మమ్మల్ని చూడ్డమే నాకెంతో సంతోషాన్ని కలిగించింది

"అది సరేకాని శైలూ న్యూజిలాండు గురించీ, ఆ దేశంలో నీ ఉద్యోగం గురించీ ఏమైనా చెప్పవే. మా శ్యామలత్తయ్య కూడ వింటుంది. నేనివ్వాళ శలవుపెట్టుకున్నది నీకోసమే. మనం హాయిగా కబుర్లు చెప్పుకుందాము. భోజనానికి నీకేమి ఇష్టమో చెపితే మా అత్త మహా హుషారుగా చేసేస్తుంది. నేనూ సాయం చేస్తాననుకో" అంటూ వంటింట్లోకి దారితీసింది వినూత్న.

"అప్పుడే వంటింట్లోకి ఎప్పుడు వెళ్లావు అత్తా!? వంట ఎప్పుడు చేసేశావు? ఓహో! శైలజా చూశావా! వంకాయ, చిక్కుడుకాయ కలిపి అల్లం పచ్చిమిరపకాయ నూరి పోపులో వేసి ముద్దకూరచేసింది. బంగాళా దుంపలు వేయించి సాంబారు కూడా చేసింది. ఇంక నేను చేయడానికి పనేమీ మిగలలేదు. పోనీలే అత్తా అప్పడాలు వేయించనా" అంది వినూత్న.

"అవి కూడా వేయించేనమ్మా! టేబిలు మీద స్టీలు టిఫిను డబ్బాలో కరకరపోకుండా పెట్టాను. ఇంక మనం భోజనానికి లేవడమే తరువాయి"

శ్యామలత్తయ్య ఆప్యాయతకి శైలజ హృదయం వుప్పొంగిపోయింది. ఆవిడ కొసరికొసరి వడ్డించడం మరీ ఇష్టపడింది. పోనీలే వినూత్నకీపాటి ఆప్యాయతయేనా దక్కిందని సంతోషించింది.

"ఆంటీ, మీచేతి భోజనం, మీ ఆప్యాయత, మీ మనసు తీపి ఎన్ని జన్మలకైనా మర్చిపోను. ఈ కూరల రుచికన్నా మీరు వడ్డిస్తున్న తీరూ, ఆ ప్రేమా నేనెన్నటికీ మర్చిపోను" అంది శైలజ.

శైలజ మాట తీరు శ్యామలగారిని ఆనందపర్చింది.



రాత్రి చాలా పొద్దుపోయిందాకా శైలజా, వినూత్నా ఇద్దరూ తాము కాలేజీలో చదువుకునే రోజులు జ్ఞాపకం తెచ్చుకొని అన్ని విషయాలూ నవ్వుకుంటూ సంతోషంగా మాట్లాడుకున్నారు.

ఇంక అప్పుడు శైలజ వినూత్నతో తను హాస్టల్ కి వెళ్ళిపోతానంది. ఎందుకంటే మాధురితో ఎంత రాత్రయినా సరే వచ్చేస్తానని చెప్పింది శైలజ. మాధురి శైలజకోసం తిండి కూడా తినకుండా కూర్చుంటుంది. అందుకే శైలజ వెళ్లడానికి బయల్దేరింది.

సాగర్ అప్పుడే రిక్షా దిగి లోపలికి వస్తున్నాడు. రిక్షావాడు చిల్లరకోసం కాబోలు ఇంకా ఆగివున్నాడు.

"ఓ సాగర్ వచ్చేరే! ఆ రిక్షావాణ్ణి పంపేయకండి. నేనందులో వెళ్ళిపోతాను" అంది శైలజ.

"వినూత్నా! రేపో ఎల్లుండో నువ్వు హాస్టల్ కి రావే. నేను వెళ్లేలోపున మీ అందర్నీ మరొకసారి వచ్చి చూస్తాను" అంది శైలజ.

సాగర్ రాక ఆ సమయంలో వినూత్నని ఆశ్చర్యపరచింది. అలా తన వంతు పదిహేనురోజులు కాకపోతే మధ్యలో అతనెప్పుడూ ఈ ఇంటిముఖం చూడలేదు. చూడడు. ఇవ్వాళ శైలజ ఏమీ అనుకోకూడదని, ఒకవేళ శైలజ ఇంట్లో వుంటే తన విషయాలు ఏవీ బయటపడకూడదనీ ఇంటికొచ్చి వుంటాడు. ఎలా అయితేనేం వచ్చేడు. తనకదే పదివేలు.

సాగర్ శైలజతో "కొంచెం ఆఫీసులో పని వుండి లేటయ్యానండీ! మరేమనుకోకండి. ఇంతకీ మీరంతా భోంచేశారా? లేక నేను వస్తానని కూర్చున్నారా! నేను ఎంత వేగంగా ఇంటికి వెళ్లి వినూత్నకేదైనా అవసరం వుంటే చూడాలనీ, సాయం చెయ్యాలనీ అనుకుంటూనే వుంటానండీ కానీ రాలేకపోతాను. ఒకోసారి ఇంటికొచ్చేసరికి రాత్రి పన్నెండు కూడ అయిపోతుందండీ" అన్నాడు.

వినూత్న వింటోంది.

శైలజ అంది, "అవునండీ వినూత్న చెప్పింది. పోనీలెండి ఏం చేస్తాం. మేం అంతా మీకోసం చూసి చూసి భోంచేసేశాము. మీ అమ్మగారి చేతి వంట బ్రహ్మాండంగా వుంది. ఇవ్వాళ మాధురితో హాస్టలుకి వస్తానని చెప్పేను. మాధురికొక అర్జంటు కేసుంది. నేనామెకాకేసులో సాయం చేస్తానని చెప్పాను. నేను వెళ్లివస్తానండీ! శ్యామలా, ఆంటీ వెళ్లి వస్తాను. నేను మళ్లీ వెళ్లేలోపున వస్తాలెండి" అంటూ వినూత్న రిక్షా వరకూ సాగనంపడానికి వస్తోంటే శైలజ వెళ్లి రిక్షాలో కూర్చుంది.

సాగర్కానీ, శ్యామలగారుకానీ ఇంకేమీ మాట్లాడలేక చూస్తుండిపోయారు.

వినూత్న నవ్వుతూ వెనక్కి వచ్చింది. "రా బావా భోంచేద్దువుగానీ" అంటూ వంటింట్లోకి తీసికెళ్లింది. సాగర్ లిల్లీ దగ్గర తినేసి వచ్చినా అమ్మచేతి వంటని పెళ్లాం చేత్తో తినిపిస్తే హాయిగా తిన్నాడు.

దారంతా రిక్షాలో శైలజ ఆలోచిస్తూనే వుంది. తన ఫ్రెండ్సు దృష్టిలో తను న్యూజిలాండులో డాక్టరుగా వుంటూ ఎంతో హాయినీ సుఖాన్నీ అనుభవిస్తున్నది. సాయంకాలం మాటలలో వినూత్న కూడా అలాగే అనుకొని "శైలూ ఆడదానికికానీ మగవాడికికానీ ఒక వయసులో మేరేజి అవసరమే అనుకో! కాని పెళ్లి అంటూ ఒక బంధనంలో ఇరుక్కోకపోతే ఒంటరితనంలో వున్నంత హాయి ఆనందం ఇంకెక్కడా వుండదు. చిన్నప్పుడు తల్లిదండన, తండ్రి దండన, పెళ్లయితే అత్త దండన, మావ దండన, భర్త దండన ఆ తర్వాత పుత్రదండన నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి అని ఆ పురుష పుంగవుడెవరో స్త్రీకి స్వాతంత్ర్యము లేకుండా 'పితారక్షతికౌమారే భర్తా రక్షతి యౌవనే,




పుత్రారక్షతి వార్ధక్యే...' అంటూ ఎప్పుడూ ఎవరో ఒకరి రక్షణలో బతకాలి కనుక ఆవిడకింక స్వాతంత్ర్యమక్కరలేదనుకున్నాడు. మగవాళ్లందరి దృష్టి అంతేలే. నా మాట విని వెస్టర్న్ కంట్రీలలో లాగ స్నేహంగా వుండి ఆ స్నేహం అక్కరలేనప్పుడు ఏ బంధనాలూ లేకుండా విడిపోవడం మంచిది. మనిషికి ఆధ్యాత్మిక చింతన ఎంతైనా అవసరం. దానికి వైరాగ్యం లేకపోయినా రాకపోయినా భగవన్నామ స్మరణలో ప్రశాంతతని పొందవచ్చు"

వినూత్న ఎంత బాగా చెప్పింది. తన గురించి కానీ ఏమైనా చూచాయగా విందా? తెలుసుకుందా? తెలుసుకోడానికి తనెవ్వరితోనూ ఏమీ మాట్లాడలేదే! హమ్మయ్య ఇప్పటికి తను ఇద్దరి స్నేహితుల జీవితగాధల్ని తెలుసుకొంది. మాధురి ఏం చేయదల్చుకుందో కనుక్కోవాలి.

మనసులో మాధురి పేరు మెదలడమూ రిక్షా హాస్టలు ముందు ఆగడమూ ఒకేసారి జరిగాయి.

మాధురిగేటు దగ్గరికే వచ్చేసి "ఏమిటే శైలూ ఇంతాలశ్యం అయిందేమిటి. కొంప దీసి భోంచేసి వచ్చేసేవా ఏమిటి?" అనడిగింది.

"భోంచేసి వచ్చేనుకాని ఎవరికొంపా తీయలేదు" అంటూ నవ్వింది శైలజ.

"ఓహో నీకోసం నేను వెయిట్ చేస్తానన్న మాట మర్చిపోయేవా? ఎంచక్కా భోంచేసి వచ్చేవు. ఎవరైనా విందు భోజనాలు పెడితే నీకు హాస్టలు భోజనాలేం నచ్చుతాయిలే. అదేమిటీ చేతిలో ఏదో పాకెట్టున్నట్లుంది"

"ఇది శ్యామలా ఆంటీ కూరలూ అవీ నీకోసం ప్యాక్‌చేసిచ్చేరు. రావే మాధురీ నీకు నేను దగ్గరుండి భోజనం వడ్డిస్తాను" అంటూ శైలజ లోపలికి దారితీసింది.

వినూత్న గురించి మాధురికి కూడ పూర్తిగా తెలియదు. వినూత్న అందం, తెలివితేటలు, విద్య, ఉద్యోగం వీటన్నిటికీ న్యాయం జరుగుతున్నట్లులేదు. శైలజ చెప్పిన మాటలు విన్నాక మాధురి వినూత్న విషయంలో తీసుకున్న నిర్ణయమది.

హాస్పిటల్లో ఒక సీరియస్ కేస్ అటెండయి ఇద్దరూ రూముకి వచ్చేసరికి తెల్లవారుతోంది. సమయం అయిదు గంటలు కావస్తోంది. ఇద్దరూ వేణ్ణీళ్లు స్నానంచేసి మాధురి తెచ్చిన టాబ్‌లెట్స్ వేసుకొని పడుకున్నారు. మాధురికి మర్నాడు పగలు డ్యూటీలేదు.



శైలజ న్యూజిలాండులో వెల్లింగ్టన్ హాస్పిటల్లో డాక్టరు.

న్యూజిలాండు వెళ్లిన కొత్తలో తనకి ఏదోలా అనిపించినా తన ధైర్యానికీ సాహసానికీ తెలివితేటలకీ ఫారిన్ కంట్రీ అయినా న్యూజిలాండులో ఒక మంచి డాక్టరుగా అనతికాలంలోనే పేరు తెచ్చుకుంది.

సహజంగా శైలజ నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడుతుంది. ఎప్పుడూ జోక్సు వేస్తూ చాలా స్పోర్టివ్‌గా వుంటుంది. న్యూజిలాండులో చాలామంది భారతీయులున్నారు. తెలుగు వారు కూడా చాలా మంది వున్నారనే చెప్పచ్చును.



న్యూజిలాండులో అనేక తెగలవారు వున్న ప్పటికీ ముఖ్యంగా పేర్కొనదగిన రెండు తెగలలో ఒకటి మోహిరీలు. వీరు మొదటి నుండీ న్యూజిలాండు దేశ వాస్తవ్యులు. తర్వాతివారు ఇంగ్లీషు వాళ్లచే తరిమి వేయబడ్డ యూరోపియనులు. వీరు న్యూజి లాండులో కీవిలుగా చలామణీ అవుతు న్నారు. వారిని వైట్స్ అనీ, కీవిలనీ అంటారు. మోహిరీలందరూ బాగా నాగరిక తను పుణికిపుచ్చుకొని ఉన్నత విద్యాభ్యాసా లుచేసి ఉన్నతోన్నతమైన పదవులలో వున్నారు. అప్పుడప్పుడు కీవిలతో పోటీబడి రాజకీయంగా తమకన్యాయము జరుగుతోం దని నినదిస్తూంటారు. ఇలాంటి అభిప్రాయ భేదాలు ప్రపంచం మొత్తం మీద కన్పిస్తూనే వుంటాయి. అర్థం, అధికారం వున్న వాళ్లదే ఎప్పుడూ పైచేయి.

జాన్‌హంటర్ న్యూజిలాండులోని కీవి జాతికి చెందినవాడు. చక్కని స్ఫురద్రూపి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూంటాడు. పెద్ద కళ్లు. రాగిజుట్టు. శైలజ పనిచేస్తున్న హాస్పి టల్లోనే పనిచేస్తున్నాడు.



శైలజకెందుకో మొదటి పరిచయంలోనే హంటరంటే ఇష్టం ఏర్పడింది. తనకి సమయం చిక్కినప్పుడల్లా అతనితో మాట్లాడుతూ న్యూజిలాండును గురించిన వివరాలు అడిగి తెలుసుకుంటూండేది. ఆమె ఆసక్తిని గమనించిన హంటర్ అన్ని విషయాలూ ఆమెకి చెపుతుండేవాడు.

న్యూజిలాండులో ప్రజలు చాలా హుషారుగా వుంటారు. ఒకరితో ఒకరు సఖ్యత కలిగి చాలా అభిమానంగా వుంటారు. ఎప్పుడూ చిరునవ్వుతో ఎదుటివారి యోగక్షేమాలు కనుక్కుంటూంటారు.

శైలజకెందుకో అవ్వాళ తన న్యూజిలాండు జీవితం వైపుపోయింది. హంటర్‌తో తను గడిపిన దినాలన్నీ గుర్తుకు వస్తున్నాయి.

హంటరూ తనూ డాక్టర్లే. హాస్పిటల్లో వున్నంతసేపూ అలానే వుండేవారు. డ్యూటీలు కాగానే సాయంత్రం పూట ఎప్పుడైనా శలవు దొరికినప్పుడూ ఇద్దరూ కలిసి హాయిగా న్యూజిలాండులో చూడదగిన ప్రదేశాలన్నీ చూస్తుండేవారు.

ఒక రోజు హంటర్ అన్నాడు... "రేపు శనివారం. మనకి రేపు, ఎల్లుండి శలవులు. రేపు మనం బొటానికల్ గార్డెన్స్‌కి వెళదాము" అని.

శైలజకి చాలా సంతోషం వేసింది. "ఓ అలాగే వెళదాం. అక్కడ లంచ్‌కి నేను పూరీలూ అవీ చేసుకువస్తాను. నువ్వు కూడా తినడానికి వీలుగా బ్రెడ్ ఆమ్లెట్ చేసి తెస్తాలే" అంది నవ్వుతూ.

ఇద్దరూ కలిసి హంటర్ కారులో లామ్‌బటన్‌క్వే వరకూ వెళ్ళి అక్కడి జాగాలో కారుని పార్కింగు చేసుకొన్నారు. కేబుల్ కారులో కొండమీదికి వెళ్ళడానికి అయిదేసి న్యూజిలాండు డాలర్ను పెట్టి టిక్కెట్లు కొనుక్కున్నారు. ఈ కేబుల్‌కారు కొండల మీదికి అక్కడక్కడ కట్టివున్న ఇళ్లకి తీసుకొని వెళ్ళిపోతుంది.





ప్రపంచంలో ఎన్నో వింతలు మారాయి. కాని న్యూజిలాండులోని ఈ వింత ప్రయాణం మారలేదు. 'కేబుల్ కారు' ప్రయాణం పిల్లలకీ పెద్దలకీ కూడా ఉపయోగకరమైనది. ఉల్లాసకరమైనది. ఆనందదాయకమైనది. తమ తమ ఇళ్లకి చేరుకోడానికి ప్రజలకి కొండలమీదికి కార్లల్లో చుట్టూ తిరిగి వెళ్ళడానికి చాలా సేపు పడుతుంది. కార్లులేనివారికెలానూ ఈ ప్రయాణం తప్పదు. అందుకే అక్కడి ప్రజలు ఈ కేబుల్‌కారు ప్రయాణాన్ని ఆపుచేయకుండా ఉపయోగించుకుంటున్నారు.

కేబుల్ కారును కొండపైకి కెల్బర్న్ వెళ్లే దారిలో రెండుచోట్ల ఆపుతారు మొదటిది విక్టోరియా యూనివర్సిటీ కాంపస్! రెండవ స్టేజి కాంపసులోని వారి క్వార్టర్సు, ఇళ్లు మొదలైనవి వున్నచోట ఆగుతుంది. ఇంక మూడవసారి పైకల్లా పోయి ఆగుతుంది. ఇక్కడ చాలామంది ఇళ్లు కట్టుకొనీ, అద్దెలకుంటూనూ కూడా నివసిస్తున్నారు. ఒక కమ్యూనిటీ సెంటరు, హోటళ్లు వున్నాయి. బొటానికల్ గార్డెన్సు చూడ్డానికి వచ్చినవాళ్లు తప్పకుండా ఇక్కడ తిని, తాగి విశ్రాంతి తీసుకుంటారు. సిటీ కమ్యూనిటీ హాలులో అప్పుడప్పుడు శలవుదినాలలో నాటకాలను ప్రదర్శిస్తూ వుంటారు.

ఈ కెల్బర్న్‌లోనే బొటానికల్ గార్డెన్స్ వుంది. 1902 నాటినుంచీ వున్న బొటానికల్ గార్డెన్స్ కేవలం ప్రజలకి వినోదయాత్రలకేకాక, అందలి వివిధజాతి మొక్కలు వృక్షాలు విజ్ఞానానికి కూడా ఉపయోగిస్తూవచ్చారు. మొత్తం ఇరవైఆరు హెక్టార్ల భూమిలో వుంది.

టూరిస్టులకెక్కువ వినోదాన్ని, ఆహ్లాదాన్నీ కల్గించేది "లేడి నార్‌వుడ్ రోజ్‌గార్డెన్స్". ఇక్కడ మూడువందలకుపైగా అందమైన

గులాబీలు వున్నాయంటే నమ్మక తప్పని విషయం. తప్పక చూసితీరాల్సిన ప్రదేశం. సన్నటి పిల్లగాలులు వీస్తున్నప్పుడు గులాబీల పరిమళాలు రకరకాల సువాసనలు గుబాళిస్తూంటే ఏదో స్వర్గానుభూతిని పొందుతున్నట్లే వుంటుంది.

"బెగోనియాహౌస్" కేవలం టీ, స్నాక్స్ కోసం మాత్రమే కాకుండా పిల్లల విజ్ఞానానికీ, వినోదానికి కూడా పనికివచ్చే ఆట స్థలాలతో ఏర్పాటుచేశారు. అక్కడికి కొద్ది దూరంలో ప్లానిటోరియమ్ శాస్త్రవిభాగమూ ఉన్నాయి.

బొటానికల్ గార్డెన్స్ని ఆనుకొని బోల్టనీ స్ట్రీటు మెమోరియల్ పార్కు ఉంది. ఇది ఒకప్పటి తొలి వెల్లింగ్టన్ యోధులు మరణిస్తే పాతిపెట్టిన స్థలమే అయినా ఇప్పుడు దీనిని అందమైన పార్కుగా మలుచుకొని ఆనందిస్తున్నారు. ఈ ప్రదేశం అంతా రకరకాల పూలమొక్కలు, తీగెలు అల్లుకొని ఆనాటి వీరగాధల్ని గుబాళిస్తూంటాయి.

మరికొన్ని గార్డెన్స్ దట్టంగా అలుముకొని వివిధరకాల పక్షుల కాలవాలమై వినోదానికో, విశ్రాంతికో వచ్చిన ప్రజలకి ఆహ్లాదాన్ని కల్గిస్తూంటాయి. మేఘాలు వుండి వుండీ దట్టంగా ఏర్పడి చీకటిని చేసేసి చల్లగాలులకి వర్షపు జల్లులు కురిపించి మళ్ళీ తెరిపినిస్తాయి. ఇక్కడ జల్లులు మనమీద పడకుండా తడియకుండా వెళ్ళడానికి గొడుగుల్ని కూడా సప్లై చేస్తారు. గొడుగు అవసరం ఎప్పుడెలా కల్గుతుందో మనం చెప్పలేము.

నిజానికి వెల్లింగ్టన్ అందాలు చూడాలంటే వీలైనంత నడిచైనా వెళ్లగలగాలి. లేదా సిటీలో వుండే రైళ్లల్లోనైనా ప్రయాణం చేయాలి. ముఖ్యంగా రాత్రులందు కొండల మీదనుంచి కిందికి చూస్తూంటే కింద తీర్చిదిద్దివున్న లైట్లు ఏదో ముగ్గులేసినట్లు కన్పిస్తాయి. చాలామంది అలా ప్రత్యేకంగా చూసి ఆనందిస్తారు. చూడముచ్చటగా వుంటుంది. శైలజ, హంటర్లు అలాంటి ఎన్నెన్ని అందాలో చూశారు. ఎన్నెన్ని విశేషాలనో తిలకించారు. ఎవరైనా తెలిసిన వాళ్లు ఆసక్తిగా వింటూంటే ఉత్సాహంగా వాళ్ళకన్ని విషయాలూ చెప్తుంటారు.

శైలజ అవన్నీ ఎంత మనోహరంగా, రమణీయంగా వున్నా హంటర్ చూపిస్తూ, చెప్తూంటే ఆ రమణీయత ద్విగుణీకృతమై స్వర్గలోకంలో విహరిస్తున్నట్లు తన్మయత్వాన్ని పొందేది.

హంటర్ శైలజ ఆనందాన్నీ తన్మయత్వాన్నీ చూసి ఆశ్చర్యపోయేవాడు. శైలజ తనకు తెలియకుండానే హంటర్కు చేరువ కాసాగింది.

శైలజకెందుకో ఇండియాలో వున్నంతసేపూ తన పూర్వపు న్యూజిలాండు జీవితం జ్ఞాపకం రాసాగింది. అయితే తన గురించి కాని, హంటర్ గురించి కాని ఎవరికీ ఏమీ చెప్పాలనుకోవటంలేదు. బాగా పొద్దెక్కాక లేచిన మాధురి, శైలజ ముఖాలు కడుక్కుని కాఫీలు తాగకుండానే భోజనాలకి కూర్చున్నారు. బ్రేక్ఫాస్టు ప్లస్ లంచ్ టైములమధ్యచేసే దానినే బ్రంచ్ అంటారు. ఇద్దరూ అదే చేసేరు. మధ్యాహ్నం మూడు గంటలకి మాధురి గబగబా తయారై "ఇప్పుడే వస్తాను శైలూ" అంటూ బైటికెక్కడికో వెళ్లింది. శైలజకి మళ్ళీ ఏం తోచలేదు. పాత మాగజైన్లు కొన్ని తిరగేసి ఏమీ చదవబుద్ధిగాక మళ్ళీ వెళ్లి మంచంమీద పడుకుని ఆలోచించసాగింది.

"హంటర్లో ఎంత ఆకర్షణ వుంది. ఆ సుందరమోహన రూపాన్ని చూస్తేనే తనకి తన్మయత్వం వస్తుంది. తనుకాని ఆ న్యూజిలాండు దేశానికి ఉద్యోగానికి వెళ్ళకపోతే ఈ నవమన్మధుణ్ణి ఇంక ప్రపంచంలో మరెక్కడా చూడలేనేమోననుకుంది.



"వెల్లింగ్టన్ చూస్తే రాత్రులే చూడాలి శైలూ" అనేవాడు హంటర్. కారు ఎక్కడో పార్కు చేసి నడిచివెళ్దాం అనేవాడు. శైలజ కన్నా శైలూ అని పిలవడం తనకి చాలా సులభంగానూ, ఒకరకంగా ఆత్మీయంగానూ వుందన్నాడు. శైలజకి అతని మాటలు శ్రవణానందకరంగా అనిపించేయి.

హంటరూ తనూ బయటికి సిటీ చూడ్డానికి వెళ్ళినప్పుడల్లా హోటల్సులోనే భోంచేసేవారు.

"నీకు తెలుసా శైలూ, ఇక్కడ న్యూయార్కులో సగటున మనిషికున్న హోటల్సు కన్నా ఎక్కువ వున్నాయని. అదీగాక నీవు రోజుకొక హోటల్లో ఒకోరకం చొప్పున తినవచ్చు ప్రపంచంలోని ఎవరెవరి పదార్థాలు వంటకాలెలా వుంటాయో రుచి చూడవచ్చు. మెక్సికన్‌నించి మంగోలియన్ వరకు, థాయి నుంచి లెబనీస్ వరకు, జపనీస్‌నించి గ్రీకులవరకూ ఇంకా ఎన్నెన్నో దేశవిదేశాల ఆహారమే కాకుండా ఈ దేశపు ట్రెడిషనల్ ఫుడ్స్ 'అమెరికన్ మెక్‌డొనాల్డ్స్' అన్నీ వున్నాయి. మనకేది కావలిస్తే ఆ భోజనమే చేయొచ్చు' ' అనేవాడు.

శైలజ మొదట అతని మాటలు అతిశయోక్తులనుకుంది. కానీ అతను తీసికెళ్ళే చోట్లూ, పెట్టించే భోజనమూ చూసేక నమ్మక తప్పిందికాదు.

న్యూజిలాండర్స్ నాటకాలు వేయడంలో బాగా తర్ఫీదు పొంది వున్నారు. ప్రత్యేకంగా మౌరీ, పాలినీషియన్ థియేటర్‌ర్లలోనే కాక అతి ప్రసిద్ధమైన నాటక థియేటర్‌లలో ఇప్పటికీ ప్రఖ్యాత ఇతిహాసాలను కూడా ప్రదర్శిస్తూనే వుంటారు. మౌరీలు వారి వేషభాషలలో ప్రదర్శించే నాటకాలతీరు చాలా ఉల్లాసంగానూ, ఆహ్లాదకరంగానూ కూడా వుంటుంది. వారు రంగురంగుల వస్త్రాలలో తలకి ఈకల, కుచ్చుటోపీలు ధరిస్తారు. ముఖభంగిమలు, కనురెప్పల కదలికలు మొదలగు హావభావ విన్యాసాలతో కథాపరంగా ఆకట్టుకుంటారు.

న్యూజిలాండులో ఇప్పటికీ కొన్నికొన్ని వీధులలో చాలా పురాతనమైన ఇళ్ళు కనిపిస్తాయి. వీటిని పూర్తిగా కర్రతో నిర్మించేరు. ఆనాడు కర్రపనికి ఎక్కువ విలువ ఇచ్చేవారు. ఇళ్ళన్నీ చాలా గట్టిగా ఇప్పటికీ నివాసయోగ్యంగా వున్నాయి. వీటన్నిటినీ కూడా 1870 సంవత్సరపు తాలూకు ఇళ్లగా గుర్తిస్తారు. తరతరాలుగా నివసిస్తున్న కొందరు 'థారొండన్' స్ట్రీటులో ఇటువంటి చరిత్రాత్మక కట్టడాలని ఉదాహరణగా మిగిల్చారు. ఆ ఇళ్ళకు ఎటువంటి మార్పులనూ చేర్పులనూ చేయలేదు.

"సెంట్‌పాల్స్ చర్చి"కి వాడిన కర్రని చూస్తే అది ఎంత ప్రశస్తమైనదో, విశిష్టమైనదో తెలుస్తుంది. లోపలి భాగం అంతా ఎంతో అందమైన ఆర్టుతో నిండి చూపరులకు ఆ విలువ కట్టలేని కట్టడాలను మళ్ళీ చూడాలనిపిస్తుంది. కిటికీలకు, వెంటిలేటర్లకు వాడిన గాజు అద్దాలు అందాన్ని మరీ ఎక్కువ చేస్తూ ఆ 'మాల్గ్రేవ్' స్ట్రీటుకొక ప్రత్యేకాకర్షణగా కూడా మిగిలిపోయింది. అలానే 'నయామ్' స్ట్రీటులోని 1858 నాటి బిల్డింగును, అందులో వారు ప్రయోగించిన ఫర్నిచర్‌ను చరిత్రాత్మక కట్టడంకింద రక్షించుకుంటూ వస్తున్నారు.

హంటర్ శైలజకి న్యూజిలాండులోని ప్రతి చిన్నవిషయాన్ని ఎంతో గొప్పగా ఆసక్తికరంగా చెప్పుకుపోతున్నాడు, చూపిస్తున్నాడు.

ఆరోజు శెలవుదినం. ఇద్దరూ కూడా హోటల్లో మెక్సికన్‌ఫుడ్ తిన్నారు. మెక్సికన్ భోజనం కూడా ఇంచుమించు ఇండియన్‌ల భోజనంలాగానే వుంటుంది. ముఖ్యంగా 'రోలర్సు' అంటే గోధుమ రొట్టెలలో మసాలా కూరలు పెట్టి గొట్టాలులాగ చుట్టి అమ్ముతారు. గోధుమ రొట్టెలు కొంచెం





ఎర్రగా కాలి కరకరలాడుతూంటాయి. దీనిని ఒక్కటితింటే చాలు కడుపునిండిపో తుంది. అలా వాళ్ళిద్దరూ భోంచేసి పార్ల మెంటు హౌస్‌ని చూడ్డానికి బయల్దేరారు.

1865 సంవత్సరంనుంచీ వెల్లింగ్టన్ న్యూజిలాండు దేశానికి రాజధానీ నగరంగా వుంటున్నది. అప్పట్లో కట్టిన పార్లమెంట్ బిల్డింగ్సు అగ్నికి దగ్ధమైపోయాయి. 1907లో మళ్ళీ పార్లమెంట్‌రీ బిల్డింగు, అప్పర్, లోయర్ ఛేంబర్సు రెండూ కట్టుకు న్నారు. అయితే 1912 నుండి మాత్రమే పార్లమెంటు పనిచేయడం ప్రారంభించింది.

ఈ భవనం పైనించి చూడ్డానికి చాలా అందంగా వుండి ఒక ప్రత్యేకతని సంతరిం చుకున్నది. బిల్డింగు అంతా తేనెపట్టులాగ వుంటుందని దీనికి 'బీహైవ్' అనే పేరు పెట్టారు. ఈనాటికీ ఆ పేరుతోనే చలామణీ అవుతున్నది.

'అప్పర్‌హట్'నించి కిందికి లోయర్ హట్, 'పిటోన్' అవీ వున్నాయి. అయితే హంటరు, శైలజలు అప్పర్ హట్‌నించి పిటోన్ చేరేలోపున వెల్లింగ్టన్ హార్బరూ అవీ చూసుకుంటూ కొండచుట్టూ వున్న అడవి మార్గాల గుండా నీటిమీద కట్టిన అందమైన బ్రిడ్జిమార్గం మీదనుంచి ప్రయా ణంచేయాలి. ఆ మార్గం 'సెవెన్‌టన్నల్స్' లోంచి ధడక్‌ధడక్‌మని శబ్దం చేసుకుంటూ వెళ్ళడం ఎంతో బావుంటుంది. రైలు టన్న ల్సులోంచి వెళ్తున్నప్పుడల్లా రైలులో వెల్తురు తప్ప టన్నల్స్‌లో చీకటిగా వుంటుంది. ఆ ప్రయాణం ఏదో గొప్ప సాహసం చేస్తున్న ట్లుగా వుంటుంది. టన్నల్ రాగానే శైలజ భయపడుతూండడం గమనించిన హంటర్ నేనున్నానుగా భయంలేదు అన్నట్లు పొదివి పట్టుకుంటున్నాడు. ఆ క్షణాలు శైలజకి మధురస్మృతులే. తన జీవితమంతా ఇలాగే అతని కౌగిలిలోనే ఇమిడిపోతే బాగుండున నుకొంది. ఈ రైలు మార్గం 'వైరరపా'కి 'పామర్స్టన్ నార్త్'కి కూడ వుంది. హంటరు అన్నాడు గదా...

"మనం 'వైరరపా'కి రైలులోకన్నా కారులో వెళితేనే బావుంటుంది. ఒక్కొక్క కొండా ఎక్కి మళ్ళీ దిగుతూంటాము. ఆ విధంగా డ్రైవ్ చేసుకుంటూపోతే ఎంతో థ్రిల్‌గా కూడ వుంటుంది. అదీకాకుండా దారి పొడవునా ఎన్నో బీచ్‌లు, రమణీయ మైన సముద్రతీరాలు కన్పిస్తాయి. కావా లంటే బీచ్‌లో కాస్సేపు కూర్చుని ఎన్‌జాయ్ చెయ్యొచ్చు లేదా స్విమ్మింగ్ డ్రెస్‌లు తీసి కెళ్ళి తనివితీరా ఈత కొట్టవచ్చు" శైలజ న్యూజిలాండు వచ్చేకే స్విమ్మింగ్ డ్రెస్ కొను క్కుని ఈత నేర్చుకోడం మొదలుపెట్టింది. మొదట్లో డ్రెస్ వేసుకుంటే అందరూ తననే చూస్తున్నారేమోనని మొహమాటపడింది. పోనుపోను తనూ అందరిలాగానే ప్రవర్తిం చడం, ఆనందించడం నేర్చుకుంది.

శైలజ చదువుకునే రోజుల్లో కూడా వీలు చిక్కినప్పుడల్లా విశాఖపట్నం బీచ్‌కెళ్ళి ఇసు కలో కూర్చునేది. అలా తరుచు సాయంత్రం వేళల్లో తన్మయత్వంలోపడి లేచే కెరటాలను చూస్తూండేది. సముద్రపు హోరులో ఏదో గొణుక్కుంటున్నట్లు మాట్లా డుకుంటూండేది. లేదా సన్నని కూనిరాగాలు తీస్తూండేది. అందుకే ఇప్పుడు హంటరు కారులో వెళ్ళి 'ఎన్జాయ్ చేద్దాం శైలూ' అంటే కాదనలేదు. వెంటనే ఒప్పేసుకొంది.

శైలజ అందమైన ప్రకృతిని తిలకించడాన్ని చిన్నప్పటినుంచీ ఇష్టపడుతూండేది. హౌస్ సర్జన్‌షిప్పు అయిపోయి ఎక్కడ ఉద్యోగం దొరుకుతుందో తెలియని సమయం అది.

అనుకోకుండా తనకు దూరపు బంధువొకా యన న్యూజిలాండులో వెల్లింగ్టన్ హాస్పి టల్లో ఉద్యోగానికి ఖాళీ వుందనీ కావాలంటే అప్లై చేసుకోమనీ రాశాడు. తను చేసింది. అదృష్టంకొద్దీ తనకా ఉద్యోగం దొరికింది. తన బాచ్ అంతటికీ తనకే ముందు

ఉద్యోగం వచ్చింది. అదీ విదేశాలలో. అంతే ధైర్యంచేసి వెళ్ళి జాయిన్ అయిపోయింది.

ఒక ప్రిమేచూర్ డెలివరీ కేసులో తనూ హంటరూ మొట్టమొదటిసారిగా కలుసుకున్నారు. ఈ కేసు కొంచెం క్లిష్టమైంది. పేషెంటుకి నీరసం వచ్చేసి స్పృహ తప్పిపోయింది. ఎక్స్‌రేని బట్టి పిల్లవాడు కడుపులో తలమీదికి కాళ్ళు కిందికి ముడుచుకుని వచ్చి వున్నాడు. చుట్టూ ఫ్లూయిడ్ లేదు. వెంటనే ఆపరేషను చెయ్యాలి. లేకపోతే పిల్లవాడికీ తల్లికీ కూడా ప్రమాదమనేస్థితికి వచ్చేసింది. శైలజా, హంటరు ఇద్దరూ వెనీసా, జాయ్ అనే ఇద్దరు నర్సుల సహాయంతో ఆపరేషను పూర్తిచేశారు. అయితే స్పృహవచ్చి ఆపరేషను చేయొచ్చు అనే స్థితివరకూ వేచి వుండి అప్పుడు తల్లికి మత్తుమందు ఇచ్చారు. ఇంకా తెలివిరాలేదు. పిల్లవానిని తీసి శుభ్రం చేసి బట్టలు చుట్టి ఇంక్యుబేటరులో వుంచేరు. ఆక్సిజను కూడా ఎక్కించాల్సివచ్చింది. శైలజ ఉద్యోగంలో మొట్టమొదటి ఆపరేషను కేసు ఇదే. హంటర్ శైలజ కన్నా రెండు సంవత్సరాలముందే జాయిను అయ్యాడు. ఇలాంటి కేసులు కొన్ని తనొక్కడే నిర్వహించేడు. కాబట్టి శైలజ మొదట కొంచెం భయపడినా తర్వాత ధైర్యంతో అతను చెప్పినట్లు సహకారం అందించింది. అసలు డాక్టర్లకన్నా ఎక్కువ అనుభవం నర్సులకున్నది. వాళ్ళ అన్ని పనులూ అతి త్వరగా పరుగులు తీస్తూ చేస్తూంటారు. వాళ్ళది సర్కసు కార్యక్రమంవలెనే వుంటుంది.

"మీరు కొంచెం భయపడ్డారుకదూ!" హంటర్ చేతులు కడుక్కుని తుడుచుకుంటూ శైలజని అడిగాడు.

శైలజ కళ్లెత్తి అతనివైపు చూసింది. ఆ చూపులు అప్పుడే కలుసుకున్నాయి. హంటర్ ఎంత అందగాడు. ఇంత అందగాడితో కలిసి పనిచేసే భాగ్యం తనకి కల్గిందని ఎంతగానో సంతోషించింది. ఎందుకో అతను వేసిన ప్రశ్న ఏమిటో తనకి వినిపించలేదో, లేక అర్థం కాలేదో. ఏదో అలాంటి స్థితిలో వుండిపోయింది.

"ఏమిటీ శైలజా, మీరింకా ఆపరేషను థియేటరులోనే వున్నారా! ఆ భయం ఇంకా తగ్గినట్లు లేదు. ఏం మాట్లాడలేకపోతున్నారు" అన్నాడు హంటర్.

మగవాళ్ళు ఆడవాళ్ళని వాళ్ళ అందాలు తాగేటట్లు చూస్తుంటారని వింది శైలజ. కాని ఇప్పుడిక్కడ అందుకు విరుద్ధంగా తాను హంటర్‌ను అలా చూస్తున్నది. అతను ఏదో అడుగుతున్నాడు. తను జవాబు చెప్పాలి. అవును చెప్పాలి. కాని ఏం చెప్పాలో తెలియక "అవునండీ" అంది శైలజ మెల్లిగా తేరుకుంటూ.

"మరేం ఫరవాలేదులెండి. ఒకటీ రెండూ కేసులు ఇలా కలిసిచేస్తే తర్వాత మీకే అనుభవం వచ్చేస్తుంది" పేషెంటు టెంపరేచరూ, బి.పి. పల్సూ వగైరా చూడ్డానికి వెళ్ళబోతూ అన్నాడు హంటర్.

"ఒకటి రెండేం ఖర్మ. జీవితం అంతా ఇలానే కలిసిచేద్దాం" అని గొణుక్కుంటున్నట్లుగా అని చిరునవ్వుతో తనూ చేతులు కడుక్కుని తుడుచుకొని పేషెంటుని చూడ్డానికి తయారైంది.

పేషెంటుకింకా స్పృహ రాలేదు. "స్పృహ వచ్చేవరకూ నేనిక్కడే వుండి, స్పృహ వచ్చాక బి.పి. అదీ చెక్‌చేసి నోటుచేసి మందిచ్చేసి వస్తాను. మీరు కావలిస్తే డ్రెస్ ఛేంజ్ చేసుకొని రెస్ట్ తీసుకోండి. శైలజా మీ ముఖంమీద చమట బిందువుల్ని చూస్తే మీరు బాగా అలిసినట్లనిపిస్తున్నారు' అన్నాడు.

"శైలజా" అన్న హంటర్ సంబోధనకి చకితయై ఒక్కసారి తలెత్తి అతన్ని చూసింది. అతను చిరునవ్వు నవ్వుతూ "అవును శైలజా





"వన్ మినిట్" అన్నాడు.

"ఫరవాలేదు హంటర్ పేషెంటుకి మందు ఇచ్చాక ఇద్దరం వెడదాం" అంది శైలజ.

ఇంటికొచ్చిన శైలజ ఆ రాత్రంతా హంటర్ రూపాన్నే మనసునిండా పొదివి పెట్టు కొంది. "హంటర్ నవ్వుతూ మాట్లాడు తుంటే, అతని కళ్లు కూడా మాట్లాడుతు న్నట్లే వుండేవి. ఆ చూపులు తూపులై సూటిగా గుండెలో గుచ్చుకున్నట్లు ఏదో మధురమైన బాధగా మూలగాలనిపిస్తుంది. "హంటర్ హంటర్" అనుకుంటూ నిద్రలోకి జారుకుంది.

★ ★ ★

"శైలూ శైలూ ఏమిటా మొద్దు నిద్ర. లే... మనం ఇవాళ ఒక విచిత్రమైన కేసు చూడాలి. లేచి త్వరగా తెములు. శైలూ, శైలూ లేస్తున్నావా లేదా! ఓ. కే. నువ్వలా పడుకో నేను వెళ్ళివస్తాను" అంది మాధురి.

"ప్లీజ్ హంటర్ వెళ్ళిపోకు. నువ్వలాగే వుండు. ప్లీజ్ హంటర్" అంటూ శైలజ కల వరిస్తోంది.

మాధురి మొట్టమొదటిసారిగా ఆ కలవ రింతని విని ఆశ్చర్యపోయింది.

"అయితే శైలజకి కూడా ఒక కథ వుందా? " అని అనుకొని మాధురి శైలజని గట్టిగా తట్టి "లేస్తున్నావా లేదా శైలూ ఇవ్వాళ మనం ఇంకో కేసు అటెండ్ కావాలి' ' అంది.

శైలజ కళ్లు నులుముకొని లేచి చూసింది. అప్పుడే మాధురి తయారై హాస్పిటల్‌కి వెళ్ళడానికి రెడీగా వుంది.

శైలజ కాళ్లూ, చేతులూ ఒక్కసారి విదిల్చి ఆవులించి బెడ్‌మీంచి లేచి ఒక్క ఉదుటున బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది. పది నిముషా లలో తయారై రాగానే ఇద్దరూ కలిసి హాస్పి టల్‌కి వెళ్ళిపోయారు.

మాధురి చాలా తెలివైనది. చురుకైనది. కేసు ఎంత కష్టంగా వున్నా సహనంతో, ఎంతో ఓర్పుతో దాన్ని సక్సెస్‌ఫుల్‌గా చెయ్య గలదు. చేతులకు గ్లోవ్స్ తీసేసి చెత్తబు ట్టలో వేస్తూ, "శైలూ రావే కొంచెం కాంటీ నుకు వెళ్ళి ఏమైనా తినో తాగో వద్దాం" అంది.

"శైలజకి కూడా ఆకలిగానే వుంది. "అలాగే పద" అని మాధురిని వెంబడిం చింది.

★ ★ ★

శైలజ బీచ్‌కి వచ్చి అక్కణ్ణుంచి డాక్టర్ వినోద్ ఇచ్చిన ఇంటి అడ్రసును మరొకసారి పరిశీలించి అటువైపుకే నడక సాగించింది. "బీచ్‌కెదురుగా కట్టిన అపార్ట్‌మెంట్సులో రెండవ వరుసలో నాల్గవ అంతస్థులో కుడి వైపు అపార్టుమెంటు నంబరు 103 మొట్ట మొదటిది.

శైలజ సరాసరి అక్కడికే వెళ్ళి తలుపు మీద వినోద్ నేమ్‌బోర్డు చూసి కాలింగ్‌బెల్ నొక్కింది.

లోపల్నుంచి 'ఎవరూ' అంటూ ఒక అంద మైన యువతి వచ్చి తలుపు తీసింది.

శైలజ తను కాని తప్పుగా వేరొక ఇంటికి వచ్చానేమోనని మళ్ళీ బయట తలుపుమీద, నేమ్‌బోర్డుమీద పేరుని చూసింది. డాక్టర్ వినోద్ అనే వుంది. సందేహం లేదు. ఇది వినోద్ ఇల్లేకాని ఈ అమ్మాయి ఎవరు? వినోద్ తన భార్య చనిపోయిందని చెప్పాడే-

నేను డాక్టర్ శైలజనండీ. డాక్టర్ వినోద్ కాని, వారి తల్లిగారు కాని వున్నారాండీ" అంది శైలజ ఆ అమ్మాయితో.

"ఉన్నారండీ, రండి లోపలికి" అంటూ "అత్తా మీకోసం ఎవరో డాక్టర్ శైలజగారుట వచ్చేరు" అని చెప్పింది.



వినోద్ తల్లి సుభద్రగారు వచ్చేరు. "రండి డాక్టరుగారూ లోపలికి రండి. మా అబ్బాయి మీ గురించి తెగ చెప్తూంటాడు" అంటూ లోపలి హాలులో సోఫాలో కూర్చో మని శైలజకి చెప్పి తను కూడా ఓ సోఫాలో కూర్చుంది.

ఆ యువతి "ఇప్పుడే వస్తానండీ" అంటూ లోపలికి వంటింట్లోకి దారితీసింది.

"మంచినీళ్ళు పుచ్చుకుంటారాండీ" అని సుభద్రగారడిగేరు.

"ఆఆ కొంచెం ఇమ్మనమనండి తాగు తాను" అంది శైలజ.

ఆ అమ్మాయి లోపలినుంచి రెండు గ్లాసు లతో నీళ్ళు ట్రేలో పెట్టి తెచ్చి టేబిలుమీద పెట్టి వెళ్ళింది.

శైలజ నీళ్ళు తాగి గ్లాసు మళ్ళీ టేబిలుమీద పెడుతూ, "మీ మనవడెక్కడా కన్పించడేం? ఇంట్లో వున్నాడా? " అని అడి గింది.

"ఆ పక్కవాటా వాళ్ళ పిల్లలొచ్చి ఆడు కుందాం రమ్మనమని తీసికెళ్ళేరు. వచ్చేస్తా డులెండి. మావాడు చెప్పేడు. మీకు పిల్ల లంటే చాలా ఇష్టంట కదా! అందులోనూ వినోద్ కొడుకుని మరీ ప్రేమగా చూస్తూం టారుట కదా" అని గ్లాసుల్ని తీసికెళ్ళడానికి వచ్చిన అమ్మాయి వైపు చురచురాచూస్తూ-

"తర్వాత తీసికెళ్ళొచ్చులే ఆ గ్లాసుల్ని, మమ్మల్ని కాస్సేపు మాట్లాడుకోనియ్యి. ఊరికే ఇటూ అటూ తిరుగుతూండక్కర లేదు" అంది.

ఆ అమ్మాయి ఏం మాట్లాడలేదు. తీసుకు న్నగ్లాసుల్ని చేత్తో పట్టుకొని తలవంచుకొని మళ్ళీ వంటింటివైపు వెళ్ళిపోయింది.

శైలజ "ఎవరండీ ఆవిడ? " అని అడి గింది.

"దీని పేరు పద్మ అమ్మా. చనిపోయిన మాకోడలి చెల్లెలు, మా అబ్బాయి వాళ్ళ మామగారికి ఉత్తరం రాసేడుట. 'మా అమ్మ ఇంట్లో పనిచేసుకుంటూ పిల్లాడిని చూసుకోలేకపోతోంది. అంచేత వాణ్ణి కొన్నా ళ్ళపాటు మీవద్దనే పెరగనీయండి' అంటూ. ఈ అమ్మాయి పద్మ, వాణ్ణి తీసికె ళ్ళడానికి నిన్ననే వచ్చింది. ఇవాళే వెళ్ళిపో తానంటే నేనే రెండు రోజులుండి వెళ్ళమ న్నాను. మీరివాళ మా ఇంటికి వస్తున్నారని తెలిస్తే మా అబ్బాయి వినోద్ ఇంట్లోనే వుండేవాడు" అన్నారు సుభద్రమ్మగారు.

"ఫరవాలేదులెండి. నేను న్యూజిలాండుకి వెళ్ళిపోయేలోపున మీ ఇంటికి ఒకసారి వచ్చి వెళతానని చెప్పేను. అందుకని అను కోకుండా ఇవ్వాళ మీ ఇంటికి వచ్చేను. నేని వాళ వచ్చేను కనుక మీకోడలి చెల్లెలుగారిని కూడా చూడగల్గాను. ఇంక నేను వెళ్ళివస్తా నండీ. నాకు వేరే పని వుంది" అంది టైము చూసుకొంటూ శైలజ.

"కాస్త కాఫీ తాగి వెళ్ళండి" అంటూ కాఫీ చేసి ట్రేలో పెట్టి తెచ్చి టేబిలుమీద పెట్టింది పద్మ. శైలజవద్దనకుండా కాఫీ తాగి కప్పుని టేబిలుమీద పెట్టి లేచింది వెళ్ళడానికి.

సుభద్రమ్మగారు శైలజతో ఏవేవో మాట్లా డాలని ఏవేవో అడగాలని అనుకున్నారు. కాని మాట్లాడలేకపోయారు. అయినా సాహసించి శైలజని కాస్సేపు కూర్చోమ న్నారు మరికాస్సేపట్లో అబ్బాయి 'వినోద్ రా వచ్చు' అని.

"మా అబ్బాయి వినోద్ కూడా మీతో ఏవో మాట్లాడాలని అనుకున్నాడు. మీరేమో వెళ్ళిపోడానికి తొందరపడ్తున్నారు. పోనీ మా మనవణ్నైనా చూసి వెళ్ళండి. వాడింక ఆటలు కట్టిపెట్టి వచ్చేవేళయింది"

"వద్దులెండి పిన్నిగారూ. నేను ఇప్పుడు కొంచెం బిజీగా వున్నాను. మరొకసారి వస్తాలెండి." అంటూ వీధివైపు వెళ్తూ వెనక్కి తిరిగి "థాంక్స్ ఫర్ ది కాఫీ. యిటీజ్




# ఏరిన ముత్యాలు

★ సిగ్గుపడే జంతువు మానవుడు ఒక్కడే

-యస్.యల్.క్లిమెన్స్

★ విజ్ఞాన సముపార్జనకు సమయం మించిపోయిందని వృద్ధులయినా భావించరాదు

-అస్కెలన్

★ అసంఖ్యాక జీవితగాధల సారాంశమే చరిత్ర

-థామస్‌కార్లైల్

★ విద్యావంతులైన ప్రజలను నడిపించడం తేలిక, తోలడం కష్టం, పరిపాలించడం తేలిక, అణగత్రొక్కడం అసాధ్యం

-లార్డ్‌బ్రూగమ్

★ కడుపు కాలుతున్న నిరుద్యోగికి వ్యక్తి స్వాతంత్ర్యం గురించి చెప్పడం వ్యర్థము, అర్ధరహితం కూడా

-స్టాలిన్

★ సమాజంలో అట్టడుగు పౌరులకు స్వేచ్ఛ ఏ మేరకు లభిస్తుందో ప్రజాస్వామ్యానికి అదే కొలబద్ద

-జాన్‌గార్స్‌వర్థ

★ విజ్ఞానానికై జీవితాన్ని అర్పించేవాడికి అమరత్వం సిద్ధిస్తుంది

-మహమ్మద్

★ రాజకీయాలలోకి భక్తి ప్రవేశిస్తే అది విధిగా నియంతృత్వానికి దారితీస్తుంది

-అంబేద్కర్

★ సహనం వహించడం చేదైన అనుభవంకాని దాని ఫలితం మాత్రం తియ్యగా వుంటుంది

-రూసో

★ మానవులంతా దైవదృష్టిలో సమానులే, ఎవరిదీ తుచ్ఛమైన పుట్టుకకాదు. పుట్టుక రీత్యా ఎవరూ ఉత్తములూకారు, పాపులూకారు

-మహమ్మద్

★ మోకరిల్లి బతకటంకంటే కాళ్ళమీద నిలబడి మరణించడం మేలు

-నార్మన్‌బెతూన్

★ సర్వదేవతలకన్ననూ మానవుడు అధికుడు. మానవులకన్న అధికులెవ్వరూ లేరు

-వివేకానంద

★ ప్రార్థించే పెదవులకంటే సాయం చేసే చేతులు పవిత్రమైనవి

-మదర్‌థెరిస్సా

సేకరణ: షేక్ సాదిఖ్‌షా

సూపర్బ్. వెళ్ళొస్తా పద్మగారూ" అంటూ చిన్న నవ్వుతో చూసి కదిలిపోయింది శైలజ.

శైలజకి సుభద్రగారి మాట తీరూ పలకరింపూ అంతా చాదస్తంగా కన్పించింది. వినూత్నా వాళ్ళత్తగారి పలుకులో తీయదనం చేష్టలో ఆప్యాయతని చవిచూసిన తర్వాత సుభద్రగారి తీరు ఆమెకంత నచ్చలేదు. డాక్టర్ వినోద్ ఇంటికి ఇంక మళ్ళీ వెళ్ళాలనిపించలేదు.

రెండు రోజులనంతరం అనుకోకుండా బీచ్‌వైపు ఏదో ఆలోచిస్తూ నడుస్తున్న శైలజకి డాక్టర్ వినోద్ తటస్థపడ్డాడు.

"హల్లో శైలజా ఎలా వున్నావు? మొన్న నువ్వు మా ఇంటికి వచ్చావటగా అమ్మ చెప్పింది. సారీ సమయానికి నేను లేననుకో. నిజానికి ఆవేళ అమ్మ నిన్ను ఫోంచేసి మరీ వెళ్ళమందామని అనుకుంది. రామాన్ని చూడనేలేదుట కదా! అంటూ ఏకవచన సంబోధనతో చెప్పుకుపోతూన్న వినోద్ మాటలు కడ్డుపడి,

"నేను బావున్నానండీ. మీరూ మీ అమ్మగారూ బావున్నారా? మీ మరదలుగారున్నారా! వెళ్ళిపోయారా? " అంది శైలజ.

మరదలి ప్రసక్తి రాగానే డాక్టర్ వినోద్ కొంత మొహంమాడ్చుకొని మళ్ళీ లేనినవ్వుని తెచ్చుకొని "ఆ ఇవ్వాళేలాగో కదిలింది రథం. నేనసలు ఆ అమ్మాయిని వచ్చిననాడే పిల్లవాడిని తీసుకొని వెళ్ళిపొమ్మన్నాను. అమ్మే మరీ ఒక్క పూటయినా వుండకుండా ఎలా వెళ్తావని రెండురోజులుంచి మరీ పంపింది. ఆ కారణంచేత మా అమ్మ నీతో కొన్ని విషయాలు మాట్లాడుదామనుకున్నవి ఆ అమ్మాయి ముందు మాట్లాడలేకపోయింది"

"ఆవిడ నాతో ఏం మాట్లాడుతారు? మా ఇద్దరికీ ఏమంత రహస్యాలుంటాయి" అంది శైలజ ఆశ్చర్యపోతూ.

"శైలజా మనం ఇసుకలో కెరటాల్ని చూస్తూ కొంచెంసేపు కూర్చుందామా? మా అమ్మ నీతో మాట్లాడలేకపోయినా నేను నీతో ఇవ్వాళ కొన్ని విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను. దయచేసి రా"

శైలజ అతని భావాన్ని చూచాయగా ఊహించినా అతనేం చెప్పబోతాడో అది వినడానికే తయారయి "సరే రండి కూర్చుందాము" అంటూ దూరంగా జనం ఎక్కువమంది లేనిస్థలంలోకెళ్ళి కూర్చుని ఎదురుగా సముద్రపు అలల్ని తిలకిస్తూ మధ్యమధ్య వచ్చీపోయే జనాన్ని కూడా చూస్తోంది.

వినోద్ ఇసుకలో వేళ్ళు పెట్టి గీస్తూ, మధ్యమధ్య ఎటోచూస్తూ శైలజతో పెదవి విప్పి మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు కాని మాట్లాడలేకపోతున్నాడు. శైలజ అతన్నీ గమనిస్తోంది. చివరికి వినోద్ సాహసం చేసి నోరువిప్పేడు.

"మా రామం అంటే మీకిష్టమే కదూ!" అన్నాడు సూటిగా శైలజ కళ్ళల్లోకి చూడలేక ఎటో చూస్తూ.

"ఇష్టమే. నిజానికి మీరామమే కాదు ఆ వయసులోని పసిపిల్ల లెవరన్నా నాకిష్టమే" అంది శైలజ.

"అంతేనా రామం అంటే మీకు ప్రత్యేకమైన అభిమానమేమోనని మా అమ్మ అనుకుంటోంది ఇన్నాళ్ళూనూ" అన్నాడు వినోద్.

"రామం అంటే ప్రత్యేకమైన అభిమానమా? నాకా? ఇన్నాళ్ళూ ఆవిడ అనుకోడానికి, నేనావిడని మొన్ననేగా కలిసింది. చూసింది కూడాను. అంత మాత్రానికే ఆవిడకి నామీద ఒక అభిప్రాయం ఏర్పడిపోయిందా? " అంది శైలజ నవ్వుతూ.

"అహ అదేం కాదులే. అప్పుడప్పుడు అంటే మనం కలిసినప్పుడు వాడితో నీ ఆటలు, చనువుగా వుండడం అన్నీ అమ్మతో





నేనే చెప్పేనులే! అందుకే అమ్మ నీ గురించి ఒక అభిప్రాయం ఏర్పరుచుకొని వుంటుంది' ' అన్నాడు వినోద్.

"ఓ అదా సంగతి. నాకు స్వతహాగా పిల్లలంటే ఇష్టం. అలా అని నేను వాళ్ళకి చాకిరీలు అవీ చేయలేను సుమండీ. వాళ్ళు చీటికీ మాటికీ పేచీలు పెడ్తూ ఏడుస్తూంటే కూడా నేను వాళ్ళకి దూరంగా వుంటాను. వాళ్ళు ఆరోగ్యంగావుండి నవ్వుతూంటేనే చూడ్డానికి ఇష్టపడతాను. ఇంతకీ మీరు మీ అబ్బాయి రామం ప్రసక్తి ఎందుకు ఎత్తేరు?' అంది శైలజ నవ్వుతూ.

శైలజ పిల్లల గురించి తన అభిప్రాయం అలా చెప్పేయగానే వినోద్ అడగదల్చుకున్న విషయాన్ని అడగాలా వద్దా? అని ఆలోచించసాగాడు. శైలజకి అంతగా పిల్లలు ఇష్టం లేకపోతే తను రామాన్ని వాళ్ళ అమ్మమ్మగారింట్లో పెంపకానికి వదిలేద్దామనుకొన్నాడు. శైలజలాంటి అందగత్తె, న్యూజిలాండు దేశంలో డాక్టరు, తనని పెళ్ళిచేసుకుంటానంటే తను తప్పకుండా ఆ త్యాగం చేయడానికి తయారే!

ఇంతలో ఒక పెద్ద కెరటం శైలజా వినోద్‌లు కూర్చున్నంత వరకూ వచ్చేసింది. ఇద్దరూ గబుక్కున లేచారు. అయినా శైలజ చీర అంచులూ అతని పాంటు చివరి భాగాలు తడిసిపోయాయి. కెరటం ఎంత వేగంగా వీళ్ళవైపు తోసుకొని వచ్చిందో అంత వేగంగానూ మళ్ళీ సముద్రంలోకి వెళ్ళిపోయింది.

"అరెరె శైలజా. నీ చీర తడిసిపోయిందే. నువ్వూ తడిసిపోయావా! ఇంద కర్చీఫ్ తుడుచుకో" అంటూ పాంటుజేబులోంచి కర్చీఫ్‌ని తీసివ్వబోయాడు వినోద్.

"వద్దండీ థాంక్స్. నా హేండుబాగ్‌లో వుంది" అంటూ శైలజ తన కర్చీఫ్‌ని తీసి కొద్దిగా పైపైన తుడుచుకుంది.

ఈసారి ఇద్దరూ వెళ్ళి ఇంకొంచెం దూరంగా ఇసుకలో కూర్చున్నారు. శైలజ వాచీ చూసుకొంది. వాచీ కూడా కొద్దిగా తడిసినట్లుంది.

వినోద్ శైలజ వాచీ చూడడాన్ని గమనించేడు. తనే విషయం చెప్పకుండానే శైలజ ఇంక వెళ్ళిపోతానని అంటుందేమోనని భయపడి ఆమెకి దగ్గిరగా కొద్దిగా జరిగి,

"శైలూ నీతో ఒక ముఖ్యవిషయం చెప్పాలి" అన్నాడు వినోద్.

"త్వరగా చెప్పండి వినోద్ నేను హాస్టలుకి వేగం వెళ్ళాలి"

వినోద్ గొంతు సవరించుకొని సముద్రం వైపుచూస్తూ ఇలా అన్నాడు.

"అమ్మ నిన్ను పెళ్ళి గురించి కనుక్కోమంది. నీకు రామం అంటే ఇష్టమనీ..." ఆగాడు వినోద్.

"ఎవరి పెళ్ళి గురించి, నా పెళ్ళా? నేనప్పుడే చేసుకుందామనుకోడం లేదు వినోద్ గారూ. ఇంతకీ రామంని నేను ఇష్టపడితే అతణ్ణి నేను పెంచుకుంటానని అడుగుతాను. కాని దానికోసం పెళ్ళే చేసుకోవాలని లేదుకదా!"

"లేదనుకో. నేనూ ప్రస్తుతం వంటరిగాణ్ణి. అమ్మ కూడా సంసార బాధ్యతలు మోయలేనని అంటోంది. పైగా రామానికి తల్లి ప్రేమ కావాలి కదా! అదీ నువ్వయితే బావుంటుందని అమ్మ అభిప్రాయపడుతోంది. పైగా మనిద్దరం డాక్టర్లమే కదా! మనలో మనకి అభిప్రాయ భేదాలుండవు. ఒకరినొకరు అర్థంచేసుకోగల్గుతాను. వృత్తి విద్యలు ఒక్కటే కనుక పరస్పరం గౌరవించు కోగల్గుతాము. ఏమంటావ్ శైలజా" అన్నాడు వినోద్.

"నీకు కావాలంటే నువ్విండియాకి వచ్చి కాపురం పెట్టాలనుకోకపోతే నేనే న్యూజిలాండుకు వచ్చి ఏదైనా హాస్పిటల్లో పని

చూసుకుంటాను. నేనలా వెళ్ళడానికి అమ్మ కేమీ అభ్యంతరంవుండదు. పైగా సంతోషి స్తుంది కూడాను" అన్నాడు వినోద్ మళ్ళీ.

శైలజ ఏమీ మాట్లాడలేదు. అతనే మళ్ళీ అన్నాడు.

"నువ్విప్పుడే తొందరపడి ఏమాటా చెప్పే యక్కరలేదు. న్యూజిలాండు చేరేక తాపీగా వుత్తరం రాయొచ్చు. నీ అభిప్రాయాన్ని అనుసరించి పిల్లవాణ్ణి మనతో వుంచాలా వద్దా అన్నది ఆలోచించి చేస్తాను. అమ్మ కూడా..." అంటూ చెప్పబోయి వినోద్ ఆమెవైపు చూసి మాటల్ని మధ్యలో ఆపే సేడు.

శైలజ మనస్సు ఎప్పుడో న్యూజిలాండు చేరుకుంది. అక్కడ హంటర్ ఎలా వున్నాడో?

శైలజ ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా చటుక్కున లేచి నిలబడి "ఇంక వెళదాం రండి. వినోద్‌గారూ నేనిప్పుడే నా పెళ్ళి గురించి ఆలోచించడం లేదు. ఇంకా కొన్నాళ్ళు ఆగుతాను. న్యూజిలాండులో ఏదైనా రిసెర్చి కూడా చేద్దామనుకుంటు న్నాను. మీరన్నట్లు నేనక్కడికి వెళ్ళి నా నిర్ణ యాన్ని ఉత్తరం ద్వారా రాసే బదులు ఇప్పుడే ఇక్కడే చెప్పేయదల్చుకున్నాను. చెప్పేస్తున్నాను. అయితే నేనిలా అన్నానని మన స్నేహానికి ఏవిధమైన ఆటంకమూ వుండదనుకుంటాను. ఎంత పెద్ద చదువులు చదివినా, విదేశాలలో ఉద్యోగాలు చేస్తున్నా మన భారతదేశంలో ఆడపిల్లలకి వివాహాలు కావడం కష్టమే. మీరుగా మీరు ముందు కొచ్చి నాకీ సహాయాన్ని చేయాలనుకోడం నిజంగా అదృష్టమే. కాని నా విషయంలో మాత్రం నేనిప్పుడే ఏం చెప్పను. పెళ్ళి చేసు కుందామని అనుకోడంలేదు. థాంక్స్ మిస్టర్ వినోద్"

వినోద్ కూడా లేచినుంచున్నాడు. తన ప్రపోజల్‌ని శైలజ మెచ్చుకుంటుందనుకు న్నాడు. శైలజతో తనకు పెళ్ళయితే భవి ష్యత్తు బావుంటుందని కలలు కన్నాడు. అమ్మ కూడా శైలజ విద్యావంతురాలు, ధన వంతురాలు అనే ఈ సంబంధానికి వెంటనే ఒప్పేసుకుంది. తన కొడుకు రామం ఎదు రుగా లేకపోతే తను రెండవ పెళ్ళి వాడు అనే భావన ఎవరికీ కలగదు. తను కూడా ఓ మోస్తరుగా అందగాడే. తనకి తల్లి, ఆ పసిపిల్లాడు తప్పితే ఇంక వేరే కుటుంబ బాధ్యతలు లేనేలేవు. ఇంతకీ తన అభి ప్రాయం ప్రకారం శైలజని వివాహమాడ్తా నని చెప్పాడే కాని తానెప్పుడూ శైలజ అభి ప్రాయాన్ని చూచాయగానైనా తెలుసుకోడా నికి ప్రయత్నించలేదు. తన కొడుకుని ఆమె ప్రేమగా చేరదీయడ మొక్కటే శైలజని వివా హమాడమని అడగడానికి ఆసరాగా దొరి కిన ఆధారం. తను కొంచెం తొందరపడ్డా డేమో! పోనీలే శైలజ మనసు కష్టపెట్టుకో కుండా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది. పైగా తమ ఇద్దరి మధ్యా స్నేహాన్ని కాంక్షిం చింది. పోనీలే అంతే చాలు" అని మనసుకి నచ్చచెప్పుకొని పైకి లేని నవ్వు తెచ్చుకో న్నాడు.

"ఇంక వెళ్దామా శైలజా! నా గురించి కూడా మా అమ్మ ఎదురుచూస్తూంటుంది" అని వినోద్ అన్నాడు.

శైలజకి తెలుసు తను వినోద్‌కిచ్చిన జవాబు అతనికి ఎలాంటి అసం తృప్తినిస్తుందో. అందుకే లేచి సూటిగా అతని ముఖంలోకి చూడకుండానే బయలు దేరింది.

"వినోద్‌గారూ బహుశః నేను మళ్ళీ మీ ఇంటికి రాలేకపోవచ్చును. మీ అమ్మగారినీ, పద్మగారినీ కూడా అడిగేనని చెప్పండి" అంటూ శైలజ రోడ్డువరకూ నడిచి రిక్షాని పిలిచి ఎక్కి హాస్టలుకి పొమ్మంది.

ఇంటికొచ్చిన వినోద్‌ని సుభద్రమ్మగారు





ఎంతో ఆశతో "ఏమంది రా ఆ అమ్మాయి? పెళ్ళి కొప్పుకుందా? అలా వున్నా వేంటిరా? ఏ మాటా చెప్పకుండా! మన పిల్లవాడు రామం గురించి అడిగిందా ఏమిటి? ఒరే వినోద్ అసలింతకీ..." అంటూ హడావిడి చేసింది.

"వుండమ్మా ఏమిటా ప్రశ్నలు. నన్నసలు ఇంట్లోకి రానిస్తావా లేదా? ఏదో నాకింత ముద్దపడేయ్. ఆకలేస్తోంది. పొద్దున్నెప్పుడో తిన్న తిండి..." వినోద్ విసుక్కుంటూ లోప లికెళ్ళాడు, బట్టలు మార్చుకొని వస్తా నంటూ.

సుభద్రమ్మ ఆలోచనలో పడిపోయింది. శైలజ ఎందుకని వద్దని వుంటుంది. అదే ప్రశ్న వేసింది వినోద్‌కి అన్నం వడ్డిస్తూ.

"అమ్మా నేను రెండో పెళ్ళివాణ్ణి. నాకసలు పెళ్ళే అక్కరలేదు. ఇంకెప్పుడూ నా పెళ్ళి గురించి మాట్లాడకు" అన్నాడు వినోద్.

"అదేమిట్రా నాయనా. పేరుకి రెండో పెళ్ళి కాని నీ ఈడు వాళ్ళంతా ఇప్పుడిప్పుడే ఉద్యోగాల్లోకి చేరి పెళ్ళిళ్ళు చేసుకుంటు న్నారు కదా! ఏమిటో మన ఖర్మకాలి ఆ అమ్మాయి అలా అయిపోయింది కాని..." సుభద్రమ్మగారు కళ్ళు తుడుచుకున్నారు. మళ్ళీ ఆవిడే అన్నారు. "ఒరేయ్ వినోద్ శైలజ మనింటికొచ్చినప్పుడు మీ ఆవిడ చెల్లెలు పద్మ ఇక్కడే వుంది కదురా! బహుశా దాన్ని చూసేక ఇంక నిన్ను చేసు కోకూడదనుకున్నదో ఏమో!"

సుభద్రమ్మగారన్న మాట వినోద్ బుర్రలో ఎలా పనిచేసిందో ఏమో అతను గబగబా భోంచేసి చేయి కడుక్కుని తన గదిలోకి వెళ్ళిపోయి తలుపులు మూసుకు న్నాడు.

కొడుకువైఖరి అర్థంకాక సుభద్రమ్మగారు అతనిని తలుపుకొట్టి పిలిస్తే చిరాకుపడ్తాడే మోనని ఇంక అతనిని పిలవకుండా తను భోంచేసి ఇంటిపనులు చక్కబెట్టుకొని దేవుడి పాటలు పాడుకుంటూ తన గదిలోకెళ్ళి పడుకున్నారు.

ఇంట్లో మనవడుంటే సందడిగా వుండేది. నాన్నమ్మా అంటూ ఏదో ఒకటి పిలిచి మాట్లాడుతూనే వుండేవాడు. వాడి చిన్నబు ర్రకి అన్నీ ధర్మ సందేహాలే. ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూనే వుండేవాడు. సుభద్రమ్మ గారికి వాడు ఒకటే గుర్తుకి వస్తున్నాడు.

శైలజ హాస్టలుకి వెళ్ళిపోయింది. రిక్షా వాడికి డబ్బులిచ్చేసి తన రూముకి వెళ్ళింది. మాధురి లేదు. తనకి హాస్పిటల్‌నించి అర్జంటు పిలుపు వచ్చిందనీ, శైలజని భోంచేసి పడుకోమనీ, తను వచ్చేసరికి తెల్లా రిపోవచ్చుననీ, తను భోంచేసే వెళుతున్నా ననీ, రాసి భోజనం క్యారియరు దగ్గర తనకు కన్పించేటట్లుగా పెట్టి వుంచి మరీ వెళ్ళింది మాధురి.

"పాపం మాధురి తనకోసం అన్ని జాగ్ర త్తలు తీసుకుంటుంది" అనుకుంటూ కారి యరు విప్పి చూస్తే మాధురి ఏదో ఎంగిలి పడ్డట్లుంది కాని కడుపునిండా తిని వెళ్ళి నట్లు లేదు. నిజానికివ్వాళ తనకీ ఏమంత ఆకలిగా లేదు. అందుకే ఒక ప్లేటులో కొంచెం మజ్జిగా అన్నం మాత్రం పెట్టుకొని తిని హంటర్‌ను తల్చుకుంటూ పడుకుంది.

హంటరుకూ వినోద్‌కీ చాలా భేదం వుంది.

హంటరు ఎప్పుడూ చిరునవ్వుతోనే వుంటాడు. హంటరు పెర్సనాలిటీ, ఆ ఠీవి, ఆ వర్చస్సు, ఆ తెలివితేటలు, ఆ ఆప్యాయత ఇంకా ఇంకా ఎన్నైనా చెప్పవచ్చును.

అవేమీ మచ్చుకైనా వినోద్‌లో కన్పిం చవు. అసలు వినోద్‌తో మాట్లాడుతుంటే ఏ దగ్గిర బంధువో లేక బాగా కావాల్సిన స్నేహితుడోలాగ అనిపిస్తుందికాని ప్రేమికు

డుగా మాత్రంకాదు.

వినోద్‌తో సముద్రపు ఒడ్డున కూర్చున్నం తసేపూ హంటర్ శైలజ మనసులో మెదు ల్తూనే వున్నాడు.

తను హంటరుకి రానురాను ఎలా దగ్గిరై పోయిందో తనకే తెలియదు.

తన స్నేహితులతో ఒక్కొక్కరితో పోల్చి చూసుకుంటే అందరికన్నా ఎన్నో రెట్లు తన జీవితమే బావుందనిపిస్తుంది. తన ఆశ యాల ప్రకారం తనకి నచ్చినవాడు, తనని మెచ్చినవాడు హంటర్. ఇంక ఆ విష యంలో సందేహం అక్కరలేదు. తను తన గురించి తన బతుకు గురించి ఏ స్నేహితు లతోనూ సంప్రదించనక్కరలేదు.

ఎవరి జీవితాలు చూసినా పడిలేచే కెర టాల్లావున్నాయి. ఎవరూ కూడా తను గడు పుతున్నట్లు హాయిగా ఆనందంగా వాళ్ల జీవితాలను గడుపుకోటంలేదు. ప్రేమా, అన్యోన్యత, ఒకరినొకరు అర్థం చేసుకోడం, జీవితం అంటే ఇంతే కాదు, ఇంకా చాలా వుందని ఆ ఆనందాన్ని పంచుకోడం లాంటివి ఏమీలేవు. ఎవరికి వారే యాంత్రి కంగా జీవితాన్ని గడుపుతున్నారు.

తన అదృష్టం బావుండి తనకి విదేశంలో ఈ ఉద్యోగం వచ్చింది. పైగా దానికి హంటర్ తోడు, జోడు. శైలజ హంటర్‌ని పదేపదే తల్చుకొని ఆ మధుర క్షణాలవైపు మళ్లీ మనసుని పోనిచ్చింది.

★ ★ ★

ఆ రోజు గవర్నమెంటు హాలీడే. దానికి తోడు శని, ఆదివారాలు కూడ కలిసివ చ్చాయి. హంటర్ రెండు మూడు రోజుల ముందు నుంచే టెలిఫోన్లు ఎక్కడెక్కడికో చేస్తున్నాడు. హోటల్సులో రూములకోసం వాకబుచేస్తున్నాడు. శైలజ అంతా గమని స్తూనే వుంది.

హంటర్ తన నడగకుండానే తన ప్రమే యమేమీ లేకుండానే తన మీద హక్కును తీసేసుకొని అతను ఏం చేస్తే తను ఆనం దంగా వుండగలదో అన్నీ ముందే తెలుసు కొని తన ఆనందంకోసం, తన సుఖంకోసం అన్ని ఏర్పాట్లూ చేస్తున్నాడు.

తనకు కావలసిందీ అదే.

"హంటర్ ఏమిటీ హడావుడి అంతా? ఆ ఫోన్లు ఏమిటి? రిజర్వేషన్లు ఏమిటి? ఎవ రికి? ఎక్కడికి? ఏదో పెద్ద ప్లాను వేస్తున్న ట్లున్నావు. నాతో చెప్పకూడదా? " అంది.

హంటర్ శైలజని చూసి చిన్నగా నవ్వాడు. అది ఎంత సమ్మోహనకరంగా వుందంటే శైలజ సూటిగా అతని కళ్లల్లోకి చూడలేక సిగ్గుతో తలదించేసుకొంది. అయినా చిరునవ్వులు నవ్వుతూ అతడు తన వైపు చూసిన చూపులు తూపులై తన హృదయానికి నాటుకొని మధురమైన బాధని కల్గించసాగాయి.

హంటర్ శైలజ మనోభావాలను కనిపెట్టి ఇంకా కొంటెగా నవ్వుతూ "ఈ ప్రయత్నా లన్నీ నిన్ను ఆనందింపచేయడానికే హనీ!" అంటూ లేచి ఆమెకు దగ్గరగా వచ్చేడు. ఎన్నడూ లేనిది శైలజ గుండె వేగంగా కొట్టు కోడం ప్రారంభించింది. ముఖమంతా చమట బిందువులతో నిండిపోయింది.

హంటర్ తన పాంటు జేబులోంచి కర్చీ ఫ్‌ని తీసి శైలజని దగ్గరగా పొదివి పట్టుకొని ముఖమంతా తుడిచాడు. "శైలూ నువ్వెంత అందంగా వుంటావు? " అన్నాడు చెవిలో రహస్యం చెపుతున్నట్లుగా. వున్నట్లుండి శైల జని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

శైలజ మైకం కమ్మినట్లు అలానే అతని కౌగిట్లో ఇమిడిపోయింది. కొంచెం సేపటికి తేరుకుని దూరంగా జరిగి కూర్చుంది.

హంటర్ చెప్తున్నాడు... "మనం వెల్లిం గ్టన్ నుండి ఆక్లాండ్ వరకూ ప్రయాణం చేస్తే దారిలో చూడదగిన ప్రదేశాలన్నిటినీ చూసుకుంటూ ఆనందంగా వెళ్లిపోవచ్చు కానయితే మనకున్న ఈ మూడు రోజుల




శలవు చాలదు. కనీసం పదిరోజులన్నా వుండాలి. అంటే వీక్‌డేస్ అయిదు రోజులూ శలవుపెట్టేమంటే ఈ శని, ఆదివారాలు, అయిదు వీక్‌డేస్, అటు శని ఆదివారాలు, సోమవారం కలిపి పది రోజులయిపో తాయి. నేను శలవు పెట్టుకోగలను. కాని నీకు ఈ సంవత్సరం శలవుండకపోవచ్చును శైలూ. అందుకే అందమైన ప్రదేశాలు, తక్కువ వ్యవధిలో చూడగల్గేవి ఎంచుకొని మనం చూసి వస్తే బాగుంటుంది. ఏమం టావు శైలూ!" అన్నాడు హంటర్.

శైలజ ఎందుకో అతని చూపుల్ని తట్టుకో లేకపోతోంది. హంటర్ ఇవ్వాళ రోజూలాగ లేడేమోననిపించింది. కొంచెంసేపు మౌనం వహించి ఆ తర్వాత "నీ ఇష్టం" అంది.

"అయితే వైవోతాపూ థెర్మల్ రిజర్వాయ ర్‌కి వెళదాము. అక్కణ్ణుంచి లోపలికంతా నడుచుకుంటూ వెళితే భూమిలోపలినుంచి ఉబికొస్తున్న గీసర్లూ, భూమి పగిలి రంధ్రాలు ఏర్పడి అందులోంచి పైకెగసివ స్తున్న పొగలూ మనం నడుస్తూంటే మన పక్కనే నేలలోంచి వస్తుంటాయి. ప్రకృతి సిద్ధమైన అగ్నిపర్వత ప్రదేశాలూ, రంగురం గులతో కుతకుత ఉడుకుతున్న నీళ్లతో నిండివున్న జలాశయాలూ, సలసల కాగి బుడుగు బుడుగుమని శబ్దాలు వస్తోన్న బురదనీటి గుంటలూ, ఒకటేమిటి కన్నుల పండువుగా ఇంకా ఎన్నో ఎన్నో వింతలు, ఈ సృష్టిలోని రహస్యాలూ, న్యూజిలాండు ప్రత్యేకతలూ అన్నీ చూడవచ్చు ఏం ఏమం టావు డార్లింగ్? " ప్రశ్నార్థకంగా శైలజవైపు చూశాడు హంటర్.

హనీ, డార్లింగ్ అంటూ తనని పిలుస్తూ మధ్యమధ్య కొంటె చూపులు విసురుతూ తనవేపే చూస్తూ మాట్లాడుతున్న హంట ర్‌తో ఏమనగలదు. అయినా కొంత సిగ్గును సడలించి చిరునవ్వుతో "ఓకే డార్లింగ్" అంది. ఆమె బుగ్గలు బాగా ఎరుపెక్కాయి. ఓకే అనడమయితే అనేసింది కానీ స్త్రీ సహ జమయిన సిగ్గు అంత వేగం విడిచి వెళు తుందా? హంటర్ కూడా అదే మాట న్నాడు.

"మీ ఇండియన్ విమెన్స్ బాగా సిగ్గుపడి మాలాంటి మగవాళ్లను కవ్విస్తారు. మాదే శాల్లో స్త్రీలు చాలా ఫ్రీగా వుంటారు. వాళ్లకేం కావాలో వాళ్లు చెపుతారు, చేయిం చుకుంటారు. నచ్చితే మాతో కలిసి వుంటారు లేకపోతే విడిపోయి హాయిగా వుంటారు"

హంటర్ ఆమెవైపే చూస్తూ అన్నాడు, "మనం 'టాపో సరస్సు' చూద్దామా. అక్క డినుంచి హెలికాప్టర్‌మీద వైమాన్గా లోయ లలోని అగ్నిపర్వత లోయల్ని తిలకించ వచ్చు వెళ్దామా? " అన్నాడు.

"1886 సం.లో తారావేరా అగ్నిపర్వతం బద్దలై 17 కిలోమీటర్ల దూరం వరకూ వ్యాపించింది. అప్పట్నుంచీ వైమాన్గా లోయంతా మంచి సువాసనలతో కూడిన వృక్షరాజాలతోనూ భూమి బద్ధలయి రంధ్రా లేర్పడిన చోట్ల రకరకాల ఆకారాలలో ప్రకృతి సహజమైన సిలికాన్ రజనుతో, స్ఫటికములతో తయారయినట్లుగా వుండే కొన్ని అందమైన దృశ్యాలనూ తిలకించ వచ్చు

"ప్రపంచంలోకెల్లా పెద్ద హాట్‌స్ట్రీమ్ ఫ్రయింగ్ పాన్‌లేక్ (న్యూజిలాండులో చెబు తారు)ని చూడవచ్చు ఈనాటికీ అక్కడి లోయలలో అగ్ని పర్వత ఛాయలని చూడొచ్చు మందుగుండు సామాను పేలితే వచ్చే వాసనలు ఇంకా సన్నగా వస్తూనే వుంటాయి. 'తారావేరా' అగ్నిపర్వతం వలన కలిగిన కల్లోలంచేత 'రోటమహానా' అనే నది రెండుగా చీలిపోయి 'రోటోమహనా', 'రోటోమకరీరి' అనే పేర్లతో ప్రవహిస్తు న్నాయి. ఆనాటి ఆ అల్లకల్లోలం వలన చుట్టుపక్కల ప్రదేశం అంతా ధ్వంసమైపో యింది. ఎన్నో మేడలు కూలిపోయి 108

మంది ప్రజలు మరణించారు. "రోటోమ హనా' నది ఎత్తైన 'కెథడ్రెల్ రాక్స్' అనే పర్వత శ్రేణులను చుట్టుకొని వయ్యారంగా ప్రవహిస్తూంటుంది. క్రూయిస్ షిప్ ఎక్కి ప్రయాణించి ఆ అగ్నిపర్వతపు అవశేషా లను తిలకించవచ్చు అయితే మనం షిప్పు దిగిలోపలికి నడిచి వెళితేతప్ప చూడలేము"

హంటరు చెప్పుకుపోతూంటే శైలజకి అన్నీ కళ్లకి కట్టినట్లేవుంది. ఆ ప్రదేశాలన్నీ అప్పుడే అతనితో కలిసి చూస్తున్నట్లుగా ఊహించుకోసాగింది.

హంటర్ శైలజని డైరెక్టుగా 'రోటోరువా'కి తీసికెళ్లాడు. అక్కడ 'క్వాలిటీ' హోటల్లో రూము తీసుకున్నాడు.

హోటలు చుట్టూ చక్కని ఉద్యానవనం వుంది. పిల్లలు ఆడుకొనేందుకు చక్కటి పార్క్కూ, ఆటస్థలమూ అన్నీ వున్నాయి. హోటలు మధ్యలో స్విమ్మింగ్‌పూల్ వుంది. వింటరులోకన్నా ఇక్కడికి సమ్మరులో ఎక్కు వమంది టూరిస్టులు వస్తూంటారు. ఈ హోటలుకి దగ్గరలోనే 'ఒహినేమూటూ' అనే పేరుతో ఒక గ్రామం వుంది. ఇది 'రోటా రువా' ప్రాంతంలో చరిత్రాత్మకమైంది. ఈ గ్రామంలో 'మౌరి పార్లమెంటు హౌస్' ఒక టుంది. దీనినే మౌరీలు 'టామాటే కాపువా మీటింగు హౌస్' అంటారు. ఇక్కడే 'ఒహినే మూటూ' కల్చరల్ గ్రూపువాళ్లు టూరిస్టుల ముందు మ్యూజిక్, డాన్స్ ప్రోగ్రాంలు ఇస్తారు. రంగురంగుల ఈకెలతో కట్టిన రిబ్బనులలాంటి వస్త్రాలను తలకు చుట్టుకుం టారు. నడుము చుట్టూ ప్లాస్టిక్ పుల్లలతో కాని ఊలుతో కాని అల్లిన డిజైనులున్న చాపలు లాంటివి లేదా చీపురు పుల్లలతో చేసిన చాపలు కాని అందంగా నేసినవి స్కర్టులాగా వేసుకొంటారు. పైన దారాలతో కాని ఊలుతోకాని, అల్లిన కంచుకాల్ని ధరి స్తారు. నీరి జానపద గేయాలు, రకరకాల కథలను మిళితంచేసి చక్కగా గానం చేస్తారు. యువతీయువకులు ప్రేమగాథల్ని చక్కగా అభినయిస్తూ హావభావాలను ప్రద ర్శిస్తూ గానం చేస్తారు.

అడుగడుగునా మౌరి సాంప్రదాయాన్నీ సంస్కృతినీ ప్రతిబింబిస్తున్నట్లుగా అలంక రించబడ్డ ఆ స్టేజిమీద అందాల్ని పుణికి పుచ్చుకొన్న యువతీ యువకులు, వారికి తగిన వేషభాషలు, అలంకరణలు, వారు చూపే హావభావాలూ, పాడేతీరు, కథకి అనుగుణమైన నటన ఇవన్నీ చూసి తీరా ల్సిందే. ముఖ్యంగా బంతులకి దారాలు కట్టి ఆ దారాలను పట్టుకొని, బంతుల్ని గాలిలో ఊగించి, తేలించి, ఆడించి చూపించడం గొప్ప అనుభూతి.

ఇలా ప్రేమ గీతాలను ఆలపిస్తూ బంతుల్ని గాలిలో వివిధ విన్యాసాలతో తిప్పుతూ యువతీ యువకులు పరస్పరం ముక్కులతో రాసుకుంటూ అభినయించ డాన్నే పాయ్ నృత్యం అంటారు.

'హాకా' నృత్యానికి మగవాళ్ల ముఖంమీద కనురెప్పల కిందా, మీదా, నుదుటిమీదా, బుగ్గలమీదా, గడ్డం మీదా నల్లటి చారికల్లా రంగులు పూసుకుంటారు. కనుగుడ్లు భయంకరంగా తిప్పుతూ ముక్కుపుటాలను పెద్దవిచేసి నాలుకను బాగా వెళ్లబెట్టి, చేతిలో ఒక దుడ్డుకర్రను పట్టుకొని చూపిస్తూ భయంకరమైన అరుపులు అరుస్తూ తొడలపై చప్పట్లు చరుస్తారు. మౌరీయోధులు ఆవిధంగా శత్రువుల్ని పార ద్రోలుతారన్న మాట. దీనికి తోడు వాళ్ల వాయించే వాయిద్యాలు కూడా ఆ పాటలకి, నటనకి, ఆ కేకలకి దోహదం చేస్తాయి. ఇలాంటి నృత్యాలు స్వయంగా చూసి ఆనం దించాలేకాని నేనెంత చెప్పినా నీకా అను భూతిరాదు శైలజా" అని హంటర్ ఈ ప్రయాణానికి ముందు చెప్పిన మాటలు మళ్లీ మళ్లీ గుర్తు చేసుకొని వాటిని చూస్తూ ఆనందించసాగింది శైలజ.

తర్వాత మౌరీల స్పెషల్ ఫుడ్ "హేంగీ"





తిని, క్వాలిటీ హోటలు రూముకి చేరుకు న్నారు శైలజా హంటరూను.

అందంగా అలంకరించబడిన ఆ గదీ, పరుపూ మంచమూ, తెల్లటి దుప్పట్లూ, సన్నగా ఏర్‌కండిషను గాలిలో మిళితమైపో యివచ్చే సెంటు వాసనా, వంటరిగా వాళ్లి ద్దరూ... ఇద్దర్నీ కూడా అనుకోకుండా మైకంలో పడవేశాయి.

హంటర్ స్పర్శతో ఈ లోకంలోకి వచ్చి పడ్డ శైలజ వులిక్కిపడి మంచంమీద అతనికి కొంచెం ఎడంగా జరిగి కూర్చుంది.

"ఏమైంది శైలూ! అలా వులిక్కిపడ్డావే మిటి? "

శైలజ మాట్లాడలేదు.

"అదేమిటి అలా వణికిపోతున్నావు. వళ్లు వెచ్చగావుందా? " అంటూ ముట్టుకు చూసి దగ్గరగా జరిగాడు. శైలజ అభ్యంతరం చెప్ప కపోయినా మనసులో ఏదో తెలియని భయం, సంకోచంతో బిక్కుబిక్కుమంటూ అతని కళ్లల్లోకి చూసింది.

అతని ముఖంలో ఆవేశంకన్నా ప్రసన్నత, పెదవులమీద చిరునవ్వు కన్పించాయి.

"శైలూ నీకు మగవాడితో గడిపే మొదటి రాత్రి ఇదేననుకుంటాను" అన్నాడు.

శైలజ అంది, "మనకి పెళ్లికాలేదు. మా ఇండియన్సుకి పెళ్లికాకుండా పరాయి మగ వాడితో ఇలా ఒంటరిగా గడపడం భావ్యం కాదు" ఎంతో నెమ్మదిగా భయం భయంగా బతిమాలుతున్న ధోరణిలో చెప్పింది.

హంటర్ ఆమెను గట్టిగాపొదివి పట్టుకొని "చెప్పు శైలజా నేనంటే నీకిష్టమేనా? " చెవి దగ్గరగా నోరుపెట్టి రహస్యం అడిగినట్లు అడిగాడు.

శైలజ ఇష్టమేనన్నట్లు తల వూపింది. "కాని పెళ్లికాకుండా...? "

హంటర్ ఆమె నోరు మూసి "న్యూజిలాం డర్సు అయితే ఒకరినొకరు అర్థం చేసుకుం దుకు ముందు ఇలా పరిచయాలు చేసుకొని చూసుకుంటారు. నచ్చితే వివాహానికి నాంది పలుకుతారు. లేకపోతే ఎవరిదారి వారిదే. అదీగాక" ఏదో చెప్పబోయి చప్పున ఆగి పోయి శైలజ కళ్లల్లోకి సూటిగా చూసి "నువ్వెవరినైనా ప్రేమించి పెళ్లి చేసుకోవాల నుకున్నావా? " అని అడిగాడు హంటరు.

శైలజ అలాంటిదేమీ లేదన్నది. హంటర్ ఇంక ఎక్కువ సమయాన్ని పాడుచేయడమి ష్టంలేక "శైలూ నీకిష్టమైతేనే" అంటూ ఆమెని గాఢంగా హత్తుకొని నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు. శైలజ కదలలేదు. ఆతని కౌగిలిని విడిపించుకోనూలేదు. ఆమె అప్పుడే ఏదో లోకానికి వెళ్లిపోయి అక్కడ తనూ హంటరూ ఎంతో కాలంనుంచి దంప తులైనట్లూ, హంటర్ పరిచయం తనకి ఎన్ని జన్మలదో అయినట్లు ఊహించి విహ రించసాగింది.

హంటరు ఆమె తన్మయత్వానికి, ఆ అమాయకత్వానికి మురిసిపోయి శైలజని ముద్దులతో ముంచెత్తి ఆమెను క్రమేపీ ఆక్ర మించుకున్నాడు.

శైలజ కాదనలేకపోయింది.



శైలజకి పదేపదే గతాన్ని ఆలోచించి ఆలో చించి బుర్ర వేడెక్కిపోయింది. తను తన ప్రేమగాథ ఎవరి దగ్గర చెప్పుకోవాలి? ఎవరు తనకు అండగా నిలిచి ఈ పెళ్లికి ఒప్పుకొని తనకు సాయం చేస్తారు? తన స్నేహితుల్లో ఎవరిని చూసినా వాళ్లేవాళ్ల సమస్యలతో సతమతమవుతున్నారు. ఇంక వీళ్లు తనకేం సలహాలివ్వగలరు?

మాధురికింకా పెళ్లికాలేదు.

వినూత్న తెలివి తేటలుండీ, అంద ముండీ, చదువుండీ, ఉద్యోగముండీ సుఖ శాంతులు లేకుండా వుంది.

వినోద్ భార్య పోయి దీనుడిలా అయిపో యేడు. తల్లిదండ్రుల అతిగారాబం వల్ల

కవిత తనలో పట్టుదల, మొండితనం ఎక్కువ కాగా చంద్రశేఖరాన్ని సుఖపెట్టలేక తాను సుఖపడక అసూయతో సావిత్రిని చంపి తాను చచ్చిపోయింది.

ఇంక తన స్నేహితురాలు గాయత్రిని చూడదల్చుకోలేదు. ఆమెనుండి ఎలాంటి కథ వినాల్సి వస్తుందోనని భయంగా ఉంది. ఇంతకీ గాయత్రి ఎడ్రసు ఇప్పుడెవరికీ తెలియదుట. లలిత ఎడ్రసు కూడా ఎవరికీ తెలియదు. కానీ పెళ్లి చేసుకొని ఇద్దరు పిల్లలతో భర్తతో హాయిగా వుంటోందని మాత్రం తెలుసును. ఉద్యోగం మాత్రం చేయడం లేదుట.

శైలజ గత జీవితంలోని మధుర ఘట్టాలను తలుచుకుంటోంది. ఇంక తనకిక్కడ వుండాలని లేదు. తను పెట్టుకొన్న శలవు రోజులింకా వున్నప్పటికీ తనకి ఇండియా వదలి న్యూజిలాండుకి వెళ్లిపోవాలని వుంది.

"మాధురి ఇంకా రాలేదేం చెప్మా" అనుకుంటూ శైలజ టేబులు మీదనున్న గడియారంలో టైము చూసింది. సమయం 2 గంటలు కావస్తోంది. "పాపం మాధురి ఒక్కర్తే అర్జంటు కేసులో పనిచేస్తోందేమో! తనుకూడా ఆమెతో వెళ్లి వుండాల్సింది" అనుకుంది.

శైలజకి ఎందుకో ఎంతకీ నిద్రపట్టడం లేదు. ఎంత వద్దనుకున్నా హంటర్ పదే పదే జ్ఞాపకం రాసాగాడు. తనుకూడా ఇక్కడే ఇండియాలోనే వుండిపోయి వుంటే వినోద్‌లాంటి వాళ్లు వెంటపడక మానరు. తనకీ ఎవరినో ఒకరిని చేసుకొని అలా కట్టుబడి వుండడం ఇష్టంలేదు.

శైలజ ఆలోచన మళ్లీ న్యూజిలాండు వైపు మళ్లింది. న్యూజిలాండులో అంతా కష్టపడి పనిచేస్తారు. ఎప్పుడూ విసుగనేది ముఖంలో కన్పించనీయకుండా చిరునవ్వుతో పనులు చేసుకుపోతారు.

హాస్పిటల్సులో నర్సులు కూడా పేషెంట్లని ఎంతో ఆదరంగా, అభిమానంగా చూసుకుంటారు. చిన్న చిరునవ్వుతో పేషెంట్లకి ఎప్పుడేది చేయాలో, కావాలో చూసుకొని చేసేస్తూంటే వాళ్లకి ఇళ్లకి వెళ్లి పోవాలని కానీ, తల్లిదండ్రులు దగ్గరలేరే అని కాని అనిపించనే అనిపించదు.

వెల్లింగ్టన్ హాస్పిటల్లో నర్సులందరిలోనూ ఎక్కువగా ఆకర్షింపబడేది అందరిచేత మెప్పులూ, మన్ననలూ పొందిన నర్సు వెనీసా.

వెనీసా రూపవతే కాకుండా మంచి మనసున్న మనిషి. శైలజ న్యూజిలాండుకి వచ్చిందగ్గర్నుంచీ అనేక విధాలుగా చేదోడు వాదోడుగా వుంటూ వచ్చింది. వెనీసా అంటే శైలజకిష్టం. శైలజ అంటే వెనీసా కిష్టం. డెలివరీలయ్యాక పేషెంట్లు వాళ్లవాళ్ల ఇళ్లకెళ్లిపోయాక కూడా వెనీసాకి అప్పుడప్పుడు ఫోన్లు చేస్తూంటారు. వాళ్ల పిల్లల పుట్టినరోజు పండగలు చేస్తే వెనీసాకి పూల బొకేలు స్వీట్సూ పంపిస్తారు. వెనీసాని ఎవ్వరూ మర్చిపోలేరు.

వెనీసా ఎలావుందో? శైలజ ఆలోచన ఒక్కసారి వెనీసా వేపుకి మళ్లింది. అలాగే వెల్లింగ్టన్ హాస్పిటల్ మీదికీ ఆ తర్వాత మళ్లీ హంటర్‌వైపుకీ చకచకా పరుగులు తీసింది.

హంటర్ గుర్తుకివచ్చినప్పుడల్లా తనకి న్యూజిలాండు దేశం, తను చూసిన అందమైన ప్రదేశాలూ గుర్తుకు వస్తూనేవుంటాయి. తను నిద్రపోకపోయినా తన ఆలోచనలు రూపకల్పన చేసుకుని రంగుల చిత్రం చూస్తున్నట్లుగా కళ్లముందు కట్టినట్లే వుంటుంది.

రోటోరువాసిటీ నుంచికాని రోటోరువా లేక్ (సరస్సు) నుంచి కాని దక్షిణంవైపుగా స్టేట్ హైవేమీదుగా ఇరవై నిముషాలు ప్రయాణం చేస్తూ పోతే గ్రీన్‌లేక్ పిక్నిక్



ప్రదేశం వస్తుంది.

మరి కొంచెం ముందుకు ప్రయాణిస్తే 'వైమాంగూ' లోయలు, అగ్ని పర్వతపు భూభాగాలూ కన్పిస్తాయి. అవన్నీ చూసేసి మళ్ళీ వెనక్కి వచ్చి 'హైవే' మీదుగా ప్రయాణంచేస్తూ కుడివేపుగా వస్తే 'వైకీటి' లోయ రోడ్డుకివస్తాం.

వైకీటి లోయలో 'థెర్మల్ మినరల్ బాత్స్' ఒక ప్రత్యేకాకర్షణ. ఇక్కడ ప్రత్యేకంగా గోరు వెచ్చని, లేక వెచ్చని నీటిలో స్నానాలు చేసి ఈతలు కొట్టి ఆనందిస్తారు. ఇక్కడ స్విమ్మింగ్‌పూల్స్‌లోని నీటిని ప్రతీ రోజూ తీసేసి పూల్ ఆరిన వెనుక మళ్లీ హాట్ స్ప్రింగ్ నీటిని నింపుతారు. నీరు స్వచ్ఛంగా వుంటుంది. ఇక్కడ కూడా పిక్నిక్ ప్రదేశం వుంది. హోటళ్ళ సదుపాయాలూ వున్నాయి.

వైకీటిలోయ రోడ్డుమీదుగా మరలా వెనక్కి వచ్చి హైవేమీదుగా ప్రయాణం చేయాలి. ఇక్కడ ప్రపంచంలో ఎక్కడా కనీవినీ ఎరుగని అందమైన ప్రదేశం 'వైవోటాపూ థెర్మల్' వండర్‌లాండ్ ఉంది.

న్యూజిలాండులో ఏ ప్రదేశాలు చూడగల్గినా చూడలేకపోయినా వైవోటాపూలోని ఈ థర్మల్ వండర్‌లాండుని మాత్రం తప్పక చూచి తీరవలసిందే. ఇది మానవ నిర్మితంకాదు. సృష్టిలోని రహస్యాలు తెలుసుకోమని, అందాలను అనుభవించమని భగవంతుడు మనకనుగ్రహించిన వరప్రసాదమే ఈ ప్రకృతి. ఇక్కడి అగ్నిపర్వత ప్రదేశపు అందాలు చూచి తీరవలసిందే కాని ఆ ఆదిశేషుడికైనా వర్ణించతరం కాదు. ఈ భావన శైలజ అనుభవం మీద కలిగినదే కాని యాధాలాపంగా అన్నవి మాత్రం కావు. అక్కడి ప్రజలు వీటిని పవిత్రజలాలుగా భావిస్తారు.





"రోటోరువా'నించి టాపో వైపుగా అర గంట ప్రయాణం చేస్తే వైవోటాపో హోటలు వస్తుంది. అక్కడ మనం రాత్రికి విశ్రమించి పొద్దున్న పదిగంటలకల్లా థెర్మల్ వండర్‌లాండ్‌లో వుండాలి" అన్నాడు హంటర్.

"అంత ఖచ్చితంగా పది గంటలకే వుండాలంటే ఎలా! లేచి తయారై బ్రేక్‌ఫాస్టు తీసుకొని..." శైలజ ఏదో చెప్పబోయింది.

"ఊ, మనం ప్రకృతి సిద్ధమైన అందమైన ప్రదేశాలను చూడడానికి వచ్చేము కాని హోటలులోనే వుండి హోటలు అందాలను చూడ్డానికి కాదుకదా! కాకపోతే..." చిలిపిగా చూసేడు హంటరు శైలజని.

శైలజ ఆ చూపుల్ని తట్టుకోలేక పోయింది.

హంటరే అన్నాడు మళ్ళీ.

"రోజూ ఉదయం పది గంటల పదిహేనునిమిషాలకి భగవంతుడే దిగివచ్చి ఫౌంటెన్ కుళాయిలు విప్పినట్లుగా ఈ ప్రదేశంలోని భూమిలోంచి నీళ్లు పైకుబికి వస్తాయి. ఇది ప్రకృతి సిద్ధమైన గీసర్. ఈ నీరు 21 అడుగుల ఎత్తువరకూ ఉబికి వెళ్తుంది. దీనిని లేడీనాక్స్‌గీసర్ అంటారు. ఆశ్చర్యంగా వుంది కదూ. మనం ఇళ్ళలోనూ, పబ్లిక్ పార్కులలోనూ ఫౌంటెన్లను పైపు గొట్టాలద్వారా అమర్చి పెట్టుకుంటాము. కాని ఇక్కడ ఏ పైపులూ లేకుండానే భూమిపై భాగంలో ఏర్పడిన రంధ్రం గుండా నీరు ఫౌంటెన్‌లోంచి వచ్చినట్లుగా 21 అడుగుల ఎత్తులో వస్తోందీ అంటే భగవంతుడి సృష్టిలోని వైచిత్ర్యం కాకపోతే మరేమిటి? దానికి సరిగ్గా సమయం కూడా నిర్ణయించినట్లు ప్రతిరోజూ ఉదయం పది గంటల పదిహేను నిముషాలకే ప్రారంభం కావటం. ఆశ్చర్యంగా లేదూ? "

ఎందుకులేదు? అంతకన్నా ఆశ్చర్యకరమైన విషయం తనకి నచ్చిన ప్రియునితో స్వర్గసౌఖ్యాలనుభవిస్తూ ఈ ఆనందాలను అనుభవించగల్గడమే. ఇది ఏ పూర్వపుణ్యఫ

లమో!

'వైవోటాపూ థెర్మల్' ఏరియా సుమారు 18 స్క్వేర్ కిలోమీటర్లు వుంటుంది. అయితే టూరిస్టులకి చాలా కొద్దిభాగం మాత్రమే చూచి ఆనందించడానికి అందుబాటులో వుంటుంది. మిగతా భాగంలో పర్వతశ్రేణులు కూలిపోయి, అగ్నిపర్వత భాగాలతో నిండి చెల్లాచెదరుగా వున్నాయి. భూమంతా పెద్దా చిన్న గుంతలు గుంతలుగా అయిపోయింది. కొన్ని గుంతలు చల్లటి నీటితోను, కొన్ని ఉడుకుతున్న నీటితోను, ఆవిర్లు వస్తూ పొగలు కక్కుతున్న నీటితోను, కొన్ని చోట్ల బుడబుడ శబ్దంతో కుతకుత వుడుకుతున్న నీటితోను, బురద నీటితోను నిండివున్నాయి. అక్కడక్కడ నేల బొరియలలోంచి పొగలు పైకి ఎగజిమ్ముతూనే వుంటాయి. అలా పొగలు వస్తున్నా వాటి పక్కనుంచే ప్రజలంతా ఒరుసుకుంటూ నడిచి వెళ్ళిపోతూంటారు.

'వైవోటాపో థెర్మల్' ప్రదేశాన్ని చూపించి వాటిని వర్ణిస్తూ చెప్పడానికి అక్కడ గైడ్లు వుంటారు. వాళ్ళ సహకారంతో ముచ్చటైన పరిసరాలనన్నిటినీ ఎంచక్కా ఎంజాయ్ చేయొచ్చు

అగ్నిపర్వత భాగాలు చాలావరకు ఇరవై మీటర్ల పొడవూ అంత వెడల్పూ, 12 మీటర్ల లోతూ కలిగి వున్నాయి. ఎక్కడ చూసినా ఎక్కువగా గంధకపు రజను కన్పిస్తోంది. నీటి పైభాగం అంతా ఆసిడ్‌తో నిండివున్నట్లుంటుంది. ఈ నీటిని ఒరుసుకొని ఒడ్లన్నీ కొంచెంకొంచెంగా కరిగి పడుతూంటాయి. మొత్తం ప్రదేశం అంతా వైవోటాపో నదీ ప్రవాహంతో నిండి ప్రవహిస్తూ వైకాటో నదిలో కలిసిపోతుంది.

హంటర్ ఒక గైడుని కుదిర్చాడు.

గైడు అవన్నీ చూపించి చెప్పే విధానం గొప్పగా వుంది. అక్కడ 16 చూడవలసిన ప్రదేశాలున్నాయి. ఒకటీ, రెండూ అంటూ 16 స్థలాలూ ఇటుదారి, ఇటువెళ్ళవలెను, తర్వాత ఇటు తిరిగి ఇలా వెళ్ళవలెను అంటూ బాణపు గుర్తులు పెట్టారు. ఒక్కొక్క స్థలానికి ఒక్కొక్క పేరు చెప్పి గైడు బోధపరుస్తున్నాడు. ఆయా పేర్లు ఇంగ్లీషులో కూడా బోర్డులమీద వున్నాయి.

"ఇదుగో చూడండి దీనిని 'డెవిల్స్‌హోమ్' అంటారు. ఇది ఏనాడో కూలిపోయిన అగ్ని పర్వత భాగమే అయినా ఇంకా పొగలు కక్కుతూనే వుంది.

'అది రైన్‌బో క్రేటర్'. కుతకుత వుడుకుతున్న నీటిలో నూనె తెట్టులా పైన కట్టినట్లుంటుంది. గంధకపుపొడి, రెడయిరనా క్సైడ్ గోడలమీద పడి వింతవింత కాంతిని ప్రసరిస్తూంది గదూ!

మూడవది థండర్ క్రేటర్. అగ్నిపర్వతం దొన్నెలా అయి అందులో నీరు అడుగునించి బుడబుడమంటూ శబ్దంచేస్తూ పెల్లుబికి పైకి వస్తుంది. ఒక్కొక్కసారి థన్‌థన్ శబ్దంతో కూడావస్తుంది. అందుకే దీనికి థండర్‌క్రేటర్ అని పేరు వచ్చింది. 1958 సంవత్సరంలో ఏర్పడింది.

వీటిని డెవిల్సు ఇంక్ పాట్సు, మడ్ పూల్సు అని కూడా అంటారు. వర్షాపాతంతో ఈ పూల్స్‌లోని నీటిమట్టం మారుతూంటుంది. బురద నీరు బుడబుడ ధ్వనులతో గ్రాఫైటు, క్రూడ్ ఆయిల్‌తో కలిసిపోయి మరుగుతూంటుంది.

"దీన్ని 'ఆర్టిస్ట్సు పాలేటు' అంటారు. షాంపైను పూల్‌కి దగ్గరగా వుంది, వేడి నీరూ, చల్లనీళ్ళూ వుండుండి వుబికి వస్తూంటాయి. అలా పైకి వుబికి వచ్చే నీరు అనేకాకారాల్లో వుంటుంది. మనం ఏ రూపం వూహించి చూస్తే అలాగే కన్పిస్తున్నట్లుంది. ఆ నీటిరాక కళాత్మకంగా కన్పిస్తుంది. కాబట్టే దీనికి ఆ పేరు వచ్చింది.

'ఓపల్‌పూల్' అనేది మొత్తం గంధపురజ

నుతో నిండివుంటుంది. ఇది మిసిమి పచ్చని పసుపురంగులో చూడముచ్చటగా కోడిగుడ్డు ఆకారంలో వుంటుంది.

'ది సేక్రేట్ ట్రాక్' అనే ఈ పవిత్రమైన రహదారి లోగడ ఒకప్పటి శ్మశానవాటికకు దారి.

'పనోరమిక్ వ్యూ' పేరుకు తగినట్లే ఉంది గదూ! ఇక్కడ ఈ ఎత్తైన ప్రదేశంమీద నుంచొని లోయలన్నీ చూస్తుంటే ఎంతో ఆహ్లాదకరంగా వుంది. పెంచబడిన ఆ దట్టమైన ఆడవుల్ని 'కంగారో ప్లైన్సు' అంటారు. దక్షిణంవైపు క్రిందికి చూడు ఆ నేలంతా వేడిగా ఆవిర్లొస్తూ కన్పిస్తుంది. దీనినే 'ఫ్రైయింగ్ పేన్ ఫ్లాట్' అంటారు. దాని వెనుక భాగంలో ఒక చెరువు వుంది. దానిని 'లేక్ న్గకారో' అంటారు. ఎడమ వైపుగా మరొక సరస్సు వుంది. దానిని 'ఎఖోలేక్' అనీ ప్రతిధ్వని సరస్సు అనీ 'వాంజియోటెరంగి' (ఆకాశపురంగు) అనీ అంటారు. నిజానికి ఆ నీరు ఆకాశపురంగులోనే వుంది.

'బ్రైడల్ వైల్ ఫాల్సు' ఎత్తైన కొండల అగ్ర భాగంనుంచి తెల్లటి పల్చటి సిల్కు వస్త్రం వెడల్పుగా పరచి కిందికి దింపుతున్నట్లు జలపాతం పడుతూంటుంది. కాని కిందపడ్డాక ఆ నీరు లేత గులాబీ రంగు సరస్సులా వుంటుంది.

'బ్రైడల్ వైల్ ఫాల్సు'నించి పది, పదిహేను నిముషాలపాటు నడిస్తే దారిలో అయిస్టర్ సరస్సు, గంధకపు గుహ, గంధకపు పర్వత శ్రేణులు- వాటిని ఒరుసుకుంటూ కుతకుతమని బుడగలతో ఉడికి పారుతున్న నీరు, అదే 'న్గకారోలూప్‌వాక్'

'ది టెర్రసెస్' అనేది న్యూజిలాండు దేశానికంతకీ ఎత్తైన పెద్ద పర్వతం. తారావేరా 1886లో కూలిపోయినప్పుడు ఏర్పడింది. ఇక్కడి నీరు, సున్నపునీటితో కలిసి ఆరిపోతూ ఒక గోడలాగ తయారైంది. ఇప్పుడున్న ఆ ఎత్తైన గోడ 900 సంవత్సరాల నుండీ తయారవుతోంది.

'షాంపైన్‌పూల్' సరస్సు అన్ని సరస్సుల కన్నా పెద్దది. 60 మీటర్ల వర్తులాకారంలో 60 మీటర్ల లోతు కలిగి వుంటుంది. దీని ఉష్ణోగ్రత 74 సెంటీగ్రేడు. ఇందలి కార్బన్ డైఆక్సైడు వలన నీటి బుడగలు ఏర్పడుతాయి. హైడ్రొథెర్మల్ ఇరష్టను వలన 900 సంవత్సరాలక్రితమే ఈ సరస్సు ఏర్పడినది. ఈ నీటిలో గోల్డు, సిల్వరు, మెర్క్యురీ, గంధకం, ఆర్సెనిక్, థాయిలమ్, ఆంటీమొనీ మొదలైన ఖనిజాలు వున్నాయి.

'ఇంటర్నో క్రేటర్' అడుగుభాగం అమితమైన వేడి గలిగి ఉడుకుతూన్న బురదనీటితో నిండివున్న అగ్నిపర్వతం.

అగ్ని పర్వతపు రంధ్రాలను కొన్ని పక్షులు తమ కావాసాలుగా ఏర్పాటుచేసుకుంటాయి. ఆ రంధ్రాలన్నీ పక్షి గూళ్ళే. ముఖ్యంగా మైనాలాంటి పక్షులు ఆ రంధ్రాలలో గుడ్లు పెడతాయి. ఆ తల్లి పక్షులు వాటిని పొదగనక్కరలేదుట. అగ్ని పర్వతపు వేడి గాలులకి అవి చక్కగా పొదగబడి పిల్లలై ఎగిరిపోతాయట. అందుకే దీనిని 'బర్డ్సు నెస్టక్రేటర్' అంటున్నారు.

గంధకపు పొడితో గుహలాగ ఏర్పడి గంధకం క్రిస్టల్సుతో ఏర్పడిన గోడలకి ఎండ, పొగ తగలగానే మెరుస్తోంది. ఇలా గంధకపు పొడితో ఏర్పడ్డ గుహలలోంచి పొగలు వస్తూవుంటాయి. అందుకని 'డెవిల్స్ బాత్' అన్నారు దీన్ని.

ఈ న్యూజిలాండు దేశం అందాలన్నీ ఒక ఎత్తు హంటర్ వాటిని చూపిస్తూ చెప్తూ పోవటం ఒక ఎత్తు. నడుస్తున్నంతసేపూ తనో నడకరాని చిన్నిపిల్లలా నడుస్తూంటే అతను తన నడుంచుట్టూ చేయివేసి అతి




జాగ్రత్తగా అడుగులు వేయించడం నేర్పుతు న్నట్లు నడుస్తున్నాడు. ఇది ఎన్ని జన్మల బంధమో! ఇద్దరినీ విధి ఈ విధంగా ఒకద గ్గరికి చేర్చింది. తను అలా తీగెలా హంట రుని పెనవేసుకొని నడుస్తూంటే హంటరు చూపిస్తున్న అందాలు వింతవింత చక్కంద నాలు కురిపిస్తున్నాయి.

తనేదో స్వర్గంలో విహరిస్తున్నట్టే ఊహిం చుకోసాగింది శైలజ. తామిద్దరూ ఎప్పటి నుండో భార్యాభర్తలులాగ వున్నారు. అన్నీ చూస్తూ దారంతా ఇద్దరూ తమ ప్రేమమై కంలో పడి ఎన్నో అర్థంకానివి, అర్థంలేనివి విషయాలు నవ్వుతూ కేర్లుతూ మాట్లాడు కుంటున్నా ఏం మాట్లాడుకుంటున్నారో తమకే తెలియడంలేదు.

అక్కడి వింతలు, విశేషాలు చూపించే గైడ్సుకి ఇలాంటి సంఘటనలెన్నో తెలుసు. వాళ్ళు మనుషుల్ని ఇట్టే పసిగట్టేయగలరు. ప్రేమికుల ధోరణినిబట్టి కూడా తమ చమ త్కారపు సంభాషణలతో ఇట్టే ఆకట్టుకొని ఆ అందాలను విడమర్చి చెప్పడంతోపాటు ఊహాతీతమైన భావాలను కూడా కల్పించి జోడించి చెప్పి ఆ ప్రేమికుల మెప్పు పొంది బహుమతులను సంపాదిస్తూంటారు.

గైడు అన్నీ చెప్పి అంతా ముగించి గుడ్ బై చెప్పి వెళ్ళిపోతూంటే హంటర్ పిలిచి తమ సంతోషానికి సూచనగా కొన్ని డాలర్స్ అదనంగా ఇచ్చేడు. ఆ గైడు థాంక్సు చెప్పి మరొకసారి విష్‌చేసి మరో ప్రేమికుల జంటకై వెనక్కు వెళ్ళాడు.

రాత్రి మళ్ళీ హంటర్, తనూ, హోటలు రూమ్, మత్తెక్కించే వాతావరణం! మైమర పించే హంటర్ చేష్టలు.

తీపిగా గడిపేసింది శైలజ.

ఆ మర్నాడు తాము మళ్ళీ వెల్లింగ్టన్ తిరిగి వెళ్ళిపోవాలి.

జరిగిన అనుభవం అంతా నెమరువేసు కొన్న తను అమితంగా భయపడిపో యింది. ఆ క్షణాల్లో మైమరచి తాను ఎంతటి తెగింపుకి ఒడిగట్టిందో ఇప్పుడర్థమ యింది.

హంటర్ ఎవరు?

తనెవరు?

అతనికీ తనకీ గల సంబంధమేమిటి?

ఇద్దరూ కులం సంగతి ఎలాగూ లేకున్నా కనీసం ఒక దేశం వాళ్ళు కూడాకాదు.

ఒకవేళ అతను తనని వివాహం చేసుకో డానికి అంగీకరిస్తే తాను, కులాంతర, మతాంతర, భాషాంతర, దేశాంతర వివా హాన్ని చేసుకున్నట్లే.

ఏమైతేనేం తను ముందే నిర్ణయించుకు న్నది. తనకి నచ్చినవాడూ తనని మెచ్చిన వాడూ స్ఫురద్రూపీ, విద్యావంతుడు, తన లాగే డాక్టరు.

తమ ప్రేమకి ఎల్లలులేవు.

అయితే హంటర్ పెళ్ళికి ఒప్పుకోకపోతే తన గతి ఏంకాను? తన ఆశలన్నీ నిరాశ లవుతాయా?

కావు ఎన్నటికీ కావు. హంటర్ అందరి లాంటి వాడూ కాదు. మనసిచ్చి మనసు పుచ్చుకొన్నవాడు.

హంటర్ సామానంతా గబగబా సర్దేసి హోటలు వారికి బిల్లు చెల్లించేసి వస్తానని వెళ్ళేడు.

శైలజ జరిగినదంతా తన ఆత్మీయురాలు శ్రేయోభిలాషి, తనకన్నా వయసులో కొంచెం పెద్ద అయిన వెనీసాకి చెప్పి ఆమె చేత హంటర్‌కి చెప్పించాలనుకుంది. ఇప్పుడున్న హడావుడి తొందరలో తను హంటరుతో పెళ్ళి ప్రసక్తి తేవడం కష్టం అనుకుంది శైలజ.

★ ★ ★



హాస్పిటల్లో అడుగుపెడుతూనే హంటర్ శైలజా మళ్ళీ ఓ సీరియస్ కేసులో మునిగి పోయేరు. ఈ కేసు చాలా క్లిష్టమైంది. హంటర్, శైలజ ఇద్దరే కాక ఇంకో ఇద్దరు సీనియరు డాక్టర్లు కూడా ఈ కేసు చూడ్డం కోసం వచ్చేరు.

ఎలాగయితేనేం రాత్రి ఒంటిగంటకల్లా ఆపరేషను సక్సెస్‌ఫుల్ గా చేసేసేరు. బేబీని ఇన్‌క్యూబేటరులో పెట్టారు. బిడ్డ ఎదగ లేదు. డెలివరీ కూడా ప్రిమేచ్యూర్ కావడంతో బేబి తల్లి కడుపులో ఇంకా ఎదగడానికి వీలులేకపోయింది. ఈ ఆపరేషను వెంటనే చెయ్యకపోతే తల్లికీ బిడ్డకీ ప్రమాదమయి ఉండేది.

హంటర్ థియేటరులో ఉన్నంతసేపూ ఎంతో శ్రద్ధగా వృత్తిరీత్యా డాక్టరుగానే వుంటాడు. తనని కూడా డాక్టరుగానే సంబోధిస్తూ ఆయా పనుల్లో నిమగ్నుడవుతాడు.

హాస్పిటల్లో ఎవరి ముందూ, ఎప్పుడూ కూడా తనని శైలూ అని పిలవలేదు, ఏకాంతం దొరికినప్పుడు తప్ప.

వెనీసాకి చేతినిండా పని. ఎంతో శ్రద్ధతో పేషెంటునీ, బేబీని చూసుకుంటోంది. తన డ్యూటీ సమయంలో ఎన్నడూ ఏమరదు. వెనీసాయే కాదు, అసలు న్యూజిలాండులో ఏ నర్సూ కూడా ఎన్నడూ విసుక్కోడం, అతిగా మాట్లాడ్డం, పని మానేసి కబుర్లు చెప్పుకుంటూ కూర్చోడంలాంటివి ఎన్నడూ చెయ్యరు. టైంటేబిల్ ప్రకారం ఎవరి పనులు వాళ్ళే చేసుకుంటూ పోతారు. వాళ్ళ ముఖాలలో ఎప్పుడూ చిరునవ్వే కాని చిరు కోపాన్ని చూడం.

శైలజ ఈ కేసు తాలూకు టెన్షన్‌తో అలిసిపోయింది. తనిప్పుడిప్పుడే ఆ హాస్పిటల్ వాతావరణానికి బాగా అలవాటుపడుతోంది. డాక్టరుగా తను చేయవలసినవన్నీ యథాప్రకారం చేసుకుపోతోంది. హంటర్ సహకారంతో ఎన్నో విషయాలు నేర్చుకుంది. ఇప్పుడామె సంపూర్ణ అనుభవజ్ఞురాలు. హాస్పిటల్లో అందరిదగ్గరా మంచిని సంపాదించింది. శైలజకి ఈ కేసు అయిన తర్వాత వెనీసాతో మాట్లాడడానికే సమయం చిక్కలేదు.

తర్వాత హంటర్ ఎందుకో వారం రోజులు సెలవుపెట్టి ఎక్కడికో వెళ్ళాడు.

శైలజ ఆ మర్నాడు మామూలుగా హాస్పిటల్‌కి వెళ్ళినపుడు హంటర్ కన్పించకపోతే, ఎందుకు రాలేదు చెప్మా హాస్పిటల్‌కి అని ఆలోచిస్తూ కూర్చుంటే వెనీసాయే చిన్న చిరునవ్వుతో వచ్చి మూసివున్న ఓ కవరు ఇచ్చింది. "హంటర్ అర్జంటుగా అమెరికా వెళ్ళేడు. ఎందుకో తెలియదు. నీకీ లెటరు ఇమ్మన్నాడు. నిన్న రాత్రి కేసు అయిపోయాక అతనూ, నువ్వూ కూడా వెళ్ళిపోయాక మేం క్లీనింగు అదీ చేస్తూ హాస్పిటల్లోనే వున్నాం. హంటర్ మళ్ళీ వెనక్కి వచ్చి నా చేతికి ఈ ఉత్తరం ఇచ్చి రేపు నీకిమ్మని చెప్పి వెళ్ళిపోయేడు" అంది.

శైలజ ఉత్తరం పుచ్చుకుంటూనే నీరసంగా కుర్చీలో కూలబడింది. ఆమెకంతా అయోమయంగా వుంది. ఎక్కడో కొత్త స్థలంలో వున్నట్లు అన్పించసాగింది. హంటర్ లేకపోతే తనకు హాస్పిటల్లో ఆక్టివ్‌గా ఉన్నట్లు లేదు.

డాక్టర్ పాల్ వచ్చి "రాత్రి పేషెంటు, బేబి ఎలా వున్నారు? అంతా కేసు షీటులో నోటు చేశారా డాక్టర్ శైలజా? మందులు మారుద్దామా, 'వాటినే కంటిన్యూ చేద్దామా?' ' అంటూనే జవాబుల్ని ఆశించకుండానే పేషెంట్ల వద్దకు నడకసాగించేడు. శైలజ కాళ్ళు కూడా యాంత్రికంగా అతని వెనుకే నడిచాయి.

డాక్టర్ పాల్ వయసులో పెద్దవాడు. చాలా అనుభవజ్ఞుడు. ఆయన మనమరాలు కూడా మెడిసన్ చేస్తోంది. అతనికి శైలజంటే చాలా ఇష్టం. ఏమైనా సీరియస్ కేసులుంటే చూడ్డానికి అతను తప్పకుండా వస్తాడు. అతనికి ప్రైవేటు ప్రాక్టీసు కూడా వుంది. శైలజని భుజంమీద తడుతూ "బాధపడకు హంటర్ త్వరలోనే వచ్చేస్తాడు. నాకు తెలుసు మీ ఇద్దరూ మంచి స్నేహితులని" అన్నాడు.

శైలజ తలెత్తి అతనివైపు ఒకసారి చూసి మళ్ళీ తలదించేసుకుంది. డాక్టర్ పాల్ తండ్రిలాంటివాడు. కనుకనే ఈసారి అతను కేసులు విప్పి చెపుతూ బోధపరుస్తున్నప్పుడు తను ఎంతో కృతజ్ఞతాభావంతో నిండిన మనసుతో ఆయనకి నమస్కరించింది.

శైలజ తను కూడా సెలవుపెట్టి ఎక్కడికైనా వెళ్ళిపోతే బావుండుననుకుంది. అయినా హంటర్‌కి అంత హడావుడి రాచకార్యాలేమున్నాయో! మెల్లిగా అతి కష్టం మీద లంచ్ అవర్‌వరకూ పనిచేసి ఆ టైములో ఏకాంతంగా ఎదురుగా గార్డెను





లోపల ఎప్పుడూ తామిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ శ్నాక్స్ తింటూ కూర్చునే స్థలానికి వెళ్ళి కూర్చుని ఆతృతగా కవరు విప్పింది. మడత వున్న కాగితం విప్పి చదవడానికి భయంతో గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ఏం రాసాడో ఏం చదవాల్సి వస్తుందోనని బెంగపడుతోంది. ఎట్టకేలకు ధైర్యాన్ని కూడ గట్టుకొని కాగితం మడత విప్పింది. కన్నులకు దగ్గరగా పెట్టుకుని మరీ చూసింది.

"శైలూ మై స్వీట్ హార్ట్. నేను అమెరికాకి వెళ్తున్నాను. మళ్ళీ ఎప్పుడు వస్తానో తెలియదు. ఎప్పుడు న్యూజిలాండుకు తిరిగివచ్చేదీ నేను వచ్చేముందు వీలయితే తెలియజేస్తాను. నీకు నా ముద్దులు... ప్చ్ ఇట్లు ఎప్పటికీ నీ హంటర్"

ఈ ఉత్తరాన్ని శైలజ ఓ వందసార్లైనా చదువుకుంది. ఆద్యంతాలు అత్యంత ప్రియతమంగా వున్నా మధ్యలో రాసిన "మళ్ళీ ఎప్పుడు వస్తానో తెలియదు" అన్న వాక్యాలు ఎందుకో మనసులో ఏదో తెలియని కీడుని శంకిస్తున్నాయి.

వెనీసా శైలజతో రెండు మూడుసార్లు ఏదో, ఏమో చెప్పాలని ప్రయత్నించినట్లు అనిపించింది. కాని ఏమీ చెప్పలేదు. శైలజ హాస్పిటల్‌కు వెళ్తోంది, వస్తోంది. అంతా యాంత్రికంగా జరిగిపోతోంది. ఒకళ్ళిద్దరు తన కొలీగ్సు మాత్రం "ఏం శైలజా డల్‌గా వున్నావు? ఆర్ యూ ఓ.కే?" అని అడిగారు.

తను ఓ.కే. అన్నట్లు తలూపింది.

శైలజ ఆఫీసులో తనకి లీవెంత వుందో ఎప్పుడు పెట్టుకోవచ్చునో అన్నీ అడిగి కనుక్కుంది. తనకి ఆరు వారాల శలవు వుందిట. శలవు పెట్టుకోవచ్చుట. వెంటనే అతిసంతోషంతో ఇండియాకి టికెట్టు బుక్ చేసుకుంది. శైలజ ఇండియాకి వెళ్ళి చాలా రోజులైంది కూడాను.

ఇండియాకి వెళ్ళి తన స్నేహితులందర్నీ కలిసి వాళ్ళ జీవితాలలో చోటు చేసుకొన్న మార్పుల్ని చూసి వాళ్ళందరికీ సర్ప్రైజు న్యూస్‌లాగా హంటర్ గురించి చెప్పాలి అని నిశ్చయించుకుంది. అసలు తన రాకే వాళ్ళందరికీ సర్ప్రైజు కావాలని ముందుగా వాళ్ళెవరికీ తను ఇండియాకి వస్తున్నట్లు తెలియబరచలేదు.

వెల్లింగ్టన్ నుంచి ఆస్ట్రేలియా వరకు వచ్చి ఆస్ట్రేలియానించి సింగపూర్‌మీదుగా మద్రాసుకి బుక్ చేసుకుంది. మద్రాసునిండి విశాఖపట్నం వచ్చింది. ఏర్‌పోర్టునుండి టాక్సీ చేసుకొని సరాసరి మెడికల్ కాలేజీ హాస్టలుకి వచ్చేసింది. శైలజకి కావాల్సిన అతిదగ్గర మిత్రురాండ్రలో మాధురి ఒకర్తె. తను మాధురి దగ్గరుంటూ మిగతా స్నేహితుల్ని కలుసుకుంది శైలజ.

శైలజకి ఇక్కడివాళ్ళంతా ఏదో యాంత్రికంగా తమ దైనందిన కార్యక్రమాల్ని నెరవేరుస్తున్నట్లున్నారు కాని, ఎవ్వరిలోనూ చైతన్యం కన్పించడంలేదు. హుషారు కాని, ఆనందం కాని, తృప్తికాని ఎవ్వాళ్ళలోనూ వున్నట్లనిపించలేదు. ఎవరికివాళ్ళే వాళ్ళ జీవితాలను మిగతావాళ్ళ జీవితాలతో పోల్చి చూసుకొని వాళ్ళకన్నా తామే మిన్నగా వున్నామని భావించి బతికేస్తున్నారు. మాధురి తన జీవితం ఎలా తిప్పుకుంటుందో చూడాలి. మాధురి చంద్రశేఖరాన్ని చేసుకుంటుందా? చేసుకోదు. అతనంటే అయిష్టత, విముఖత్వం ఏనాడో చూపించింది. కవిత అలా అయిపోడానికి కారణం చంద్రశేఖరం యొక్క పరస్త్రీ వ్యామోహమేనని మాధురి గట్టి నమ్మకం. మరి అలాంటప్పుడు అటువంటి వాడిని తనెలా చేసుకుంటుంది. చేసుకోదు. ససేమిరా చేసుకోదు.

వినోద్ తనమీద ఆశలు పెట్టుకున్నాడు. ఆనాడే వినోద్‌కి తను హంటరుని ప్రేమిస్తున్నానని చెప్పేయాల్సింది. ఎందుకని చెప్పలే

కపోయిందో తనకే ఆశ్చర్యంగా వుంది. ఇప్పటికీ ఇంకా తనేదో ఆలోచించి చెపుతుం దనే నమ్మకంతోనే వున్నట్లున్నాడు పాపం వినోద్. తనకి ఎందుచేతనో మళ్ళీ వినోద్‌ని కలవాలని కాని, అతనితో మాట్లాడాలని కాని అనిపించడంలేదు.

ఆలోచించి ఆలోచించి శైలజ ఎప్పుడు నిద్రలోకి జారుకుందో తెలియదుకాని తను లేచి కళ్ళు తెరచి చూసేటప్పటికి తెల్లవారు తోంది. మాధురి మళ్ళీ ముఖం కడుక్కుని హాస్పిటల్‌కి ప్రయాణమవుతోంది.

"మాధురీ రాత్రి ఎన్ని గంటలకి వచ్చేవు? " శైలజ అడిగింది.

"అర్ధరాత్రి దాటాక పావుతక్కువ మూడు అయింది. నువ్వు మంచి గాఢనిద్రలో వున్నావు. నీ ముఖంమీద చిన్న చిరునవ్వు చూసి నువ్వేదో కలలు కంటున్నావులే అని డిస్టర్బ్ చెయ్యకుండా పడుకున్నాను" అంది మాధురి.

"కలలా? నాకా? " నవ్వింది శైలజ. "కలత నిదురలో కలలేం వస్తాయిలే" అంది మళ్ళీ. అవును కానీ మళ్ళీ పొద్దున్నే లేచావు ఎందుకు? "

"నిన్నటి కేసు కొంచెం క్లిష్టమైంది. అది సీరియస్ కేసు. డాక్టర్ మహేశ్‌ని వచ్చి హెల్ప్ చెయ్యమంటే వచ్చారు. ఇప్పుడా పేషెంటు ఎలా వుందో చూసి వచ్చి పడు కుంటాను మళ్ళీ" అంది మాధురి.

శైలజ వెంటనే లేచి గబగబా తయారయి ఆమెననుసరించింది.

"డాక్టర్ మహేశ్ మనకి రెండేళ్ళ సీనియ రుకదూ? అతనేనా" అడిగింది శైలజ.

"అవును అతనే" అంది మాధురి.

"అతనికి పెళ్ళయిందా? " శైలజ యధాలా పంగా అడిగింది. మాధురి శైలజవైపు అదో రకంగా చూసి-

"ఏం ఎందుకు? పెళ్ళి కాకపోతే అతనిని నువ్వేమన్నా పెళ్లాడుతావా? లేక అతనికి ఏదైనా పెళ్లి సంబంధం చూపిస్తావా? " వెట కారంగా అడిగింది.

"ఛ... ఛ నాకేం అక్కరలేదులే. నేనతనికి ఎవరినయినా చూపిద్దామని" అంటూ కొంటెగా నవ్వుతూ మాధురి ముఖంలోకి చూసింది శైలజ.

"నువ్వేం నాకు పెళ్లి సంబంధాలు చూడ క్కరలేదు. మీకెవ్వరికీ శ్రమ ఇవ్వకూడదనే నేను మా నాన్నగారికి ఉత్తరం రాస్తూ ఆయన ఏ సంబంధం తెచ్చి చేసుకోమంటే ఆ అబ్బాయినే చేసుకుంటానని చెప్పాను. అదీకాక నా కోసం ఎవడో, ఎక్కడో పుట్టేవు న్నాడులే" అంది మాధురి.

"నీకు చూడమంటే వివరాలు కనుక్కుం టాను" అంది మాధురే మళ్ళీ. "అవును శైలజా ఎలాను ఇండియాకి వచ్చేవు. పెళ్ళి చేసుకొని వెళితే బావుంటుంది కదుటే ఏమంటావ్? " అంటూ ఆశగా చూసింది శైలజవైపు మాధురి.

"నాకూ ఎవరో పుట్టే వుంటారు" అంది చటుక్కున శైలజ. అనేసి నాలిక కొరు క్కుంది.

మాధురి శైలజవంక తదేకంగా నమ్మ శక్యం కానట్లు చూసింది.

హాస్పిటల్లో డాక్టర్ మహేశ్ అప్పుడే క్రితం రాత్రి ఆపరేషన్ అయిన పేషెంటుకి ఏదో ఇంజక్షను ఇచ్చి 'కేసు షీటు' కాగితా లలో నోటుచేసి తిరిగి ఆ కేసుషీటుని పేషెంటు మంచానికి తగిల్చి మాధురిని చూసి-

"హమ్మయ్య, వుయ్ ఆర్ సక్సీడెడ్" అన్నాడు. డాక్టర్ మాధురి కూడా సంతోషిం చింది.

తర్వాత మాధురి మహేశ్‌తో "ఇదుగో మన ఫ్రెండు డాక్టర్ శైలజ. ప్రస్తుతం న్యూజిలాండులో పనిచేస్తోంది. మొన్నే సడ న్‌గా మా హాస్టల్లో ప్రత్యక్షమై గొప్ప సర్ప్రైజు ఇచ్చిందిలెండి"





"హల్లో శైలజా! నాకు మీరు తెలియకపో వడమేమిటి? మీరూ వినూత్నా, కవితా, మాధురీ అంతా ఒక గ్రూప్‌కదూ. మేం రెండేళ్ళ సీనియర్స్‌మే అయినా అనుకుం టూండేవాళ్ళం. మీ స్నేహం విడదీయరాని బంధం... అని అవునా" అన్నాడు క్రీగంట చూసి నవ్వుతూ.

శైలజ ఏం మాట్లాడలేదు. నవ్వుతూ విష్ చేసిందంతే.

మాధురి మళ్ళీ కేసు షీటంతా చదివి పేషెంటుని ఆమూలాగ్రంగా పరీక్షించింది. చుట్టూ పేషెంటు తల్లీ, తండ్రీ తదితర బంధువులంతా పోగయ్యారు. వాళ్ళందర్నీ ఎవరి ఇళ్లకు వాళ్ళను వెళ్లిపొమ్మన్నది. ఎవరో బాగా కావల్సిన ఒక్కళ్లు మాత్రమే పేషెంటు దగ్గర వుండవచ్చు వాళ్ళకి మాత్రమే పాసు రాసిస్తానని చెప్పి మిగతా వాళ్ళందర్నీ పంపేసింది. వాళ్లు మళ్ళీ సాయంకాలం రావచ్చునని చెప్పింది. పేషెంటుకింక ప్రమాద సూచనలేమీ లేక పోవడంచేత ఒక దీర్ఘనిశ్వాస విడిచి తర్వాత ఆమెకేమేం మందులివ్వాలో, ఏం చెయ్యాలో డ్యూటీలో వున్న నర్సుకి చెపుతోంది.

డాక్టర్ మహేశ్ "శైలజా మీ న్యూజి లాండ్ లైఫ్ ఎట్లా వుంది. ఐ థింక్ యూ ఆర్ హేపీ దేర్" అంటూ నవ్వాడు.

"నాకక్కడ అన్నివిధాలా బాగానే వుంది. నేను హేపీగానే వున్నాను" అంది శైలజ.

"ఇంక తర్వాత ఏం చెయ్యదల్చుకు న్నారు? " అడిగాడు.

శైలజ గడుసుగా "మీరేం చెయ్యదల్చుకు న్నారో ముందు చెప్పండి" అంది.

"ఆ ఏముందీ ఎటూ ఉద్యోగంలో సెటిల్ అయ్యాంకదా. ఇంక లైఫ్‌లో సెటిల్ అవు దామనుకుంటున్నాను. ఆ తర్వాత పిల్లల్ని కనడం, వాళ్ళని పెంచి పెద్ద చెయ్యడం షరా మామూలే" అన్నాడు నవ్వుతూనే మహేశ్.

"పిల్లల్ని మీరే కంటారా? " కొంటెగా అడి గింది శైలజ. అప్పుడే వచ్చిన మాధురి కూడా వీళ్ళ నవ్వుల్లో శ్రుతి కలిపింది.

మహేశ్ అన్నాడు "త్వరలోనే మీకు ఇన్వి టేషను కార్డు పంపిస్తాను. తప్పక మీరూ మీ స్నేహితులూ అంతా నా పెళ్లికి రావాలి ముందుగానే చెబుతున్నాను. బైదిబై శైలజ గారూ మీరింకా ఎన్నాళ్లు ఇండియాలో వుంటారు? " అని అన్నాడు.

మాధురి శైలజవైపు చూసింది.

"బహుశః వారం పదిరోజుల్లో వెళ్ళిపోతా నండీ. నా టిక్కెట్టు కన్ఫర్మ్ చేయించుకోవా లంతే. ఇక్కణ్నుంచి వెళ్లేటప్పటి తారీకు ఏద యినా నేను ప్రీపోను చేయించుకొని ముందుగా కావలిస్తే వెళ్ళిపోవచ్చు నాది కావటానికి మూడు నెలల టిక్కెట్టే. అయినా నా శలవు ఆరువారాలు మాత్రమే వుండడంవలన వచ్చేవారం బయల్దేరుదామ నుకుంటున్నానండీ" అంది శైలజ.

మాధురి ఈ సంభాషణనీ, పరిస్థితినీ ఊహించలేదేమో. మొహం అదోలా పెట్టే సింది.

"మరి మీ సంగతి చెప్పారుకాదు" అన్నాడు మహేశ్.

"ఆ ఏముందీ చెప్పడానికి నేను న్యూజి లాండు చేరాక మీకు వ్రాస్తాను. నేనింకా ఏమీ డిసైడు చేసుకోలేదనుకోండి. అక్కడికి వెళ్లేక ఎవరైనా తటస్థపడితే తప్పక మీకంద రికీ ఇన్విటేషన్లు పంపుతాను. మాధురీ వస్తావుకదూ" అంది శైలజ ప్రాధేయపడ్తు న్నట్లుగా.

"ఇది మరీ బావుంది. ఈవిడగారేమో విదేశాలకిపోయి అక్కడే పెళ్లి చేసుకుంటే మనమంతా ఇక్కణ్ణుంచి బోలెడు ఖర్చులు పెట్టుకుని వెళ్లాలా. ఇదెక్కడి న్యాయం బాబూ. ఆ చేసుకునే పెళ్లేదో ఇండియాకి వచ్చి చేసుకుంటే మేమంతా తప్పకుండా వచ్చి అక్షింతలు వేస్తాం" అంది మాధురి.

ఇంతలో ఒక నర్సు వచ్చి డాక్టర్ మహేశ్‌తో ఏదో చెప్పగానే అతడు "ఓ.కే. మాధురీ, శైలజా, వస్తా! మనం మళ్ళీ కలుద్దాం. నాకు పనివుంద"ని చెప్పి కబురు తెచ్చిన నర్సుతో చకచకా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

రూముకి వచ్చాక స్నానాలు చేసి, బట్టలు మార్చుకుని బ్రెక్‌ఫాస్టు చేస్తూ శైలజ హంటర్ సంగతి మెల్లిగా మాధురితో చెప్పింది.

అంతా శ్రద్ధగా విన్నాక మాధురి "ఇలాంటిదేదో నువ్వు మెల్లిగా చెబుతావని నేను ముందే ఊహించాను శైలజా" అంది మాధురి.

"మాధురీ ఇంతకీ నీ అభిప్రాయం చెప్పావు కావు" అంది శైలజ.

"అంతా నువ్వు ముందే నిర్ణయించుకున్నాక ఇంక నా అభిప్రాయం దేనికే. అయినా పెద్దరికం ఇచ్చి సలహా అడిగావు కనుక చెబుతున్నాను. పెళ్ళికి తొందరపెట్టు. పెళ్ళికొడుకు చేజారిపోకుండా ఆ మూడు ముళ్లూ వేయించేసుకో. అసలే ఫారినర్స్. నమ్మలేం" అంది మాధురి నవ్వుతూ.

"ఛ... హంటర్ అలాంటివాడు కాడే" అంది శైలజ ఎంతో నమ్మకంతో.

"కాకపోతే మనం అదృష్టవంతులమే" అంది మాధురి ఎటో చూస్తూ.

తన నిర్ణయం మాధురికి సంతోషాన్ని ఎందుకు కల్గించలేకపోయిందో శైలజ ఊహించలేకపోయింది.

"నేను కాస్సేపు నడుం వాలుస్తానని" మాధురి మంచం ఎక్కి దుప్పటి ముసుగు పెట్టుకొని పడుకుంది.

మాధురి నిజంగా అలిసిపోయి పడుకుందా? తనని తరచి తరచి హంటర్‌ను గురించి అన్ని విషయాలూ అడుగుతుందేమోనని అనుకున్న శైలజకి కొంత ఉబలాటం తగ్గింది. లేచి ఏర్‌పోర్టుకి ఫోను చేసి టిక్కెట్టు కన్ఫర్మ్ చేద్దామని బయటికి వచ్చింది.

ఫోను చెయ్యడానికని కారిడార్‌లోకి వెళ్ళిన శైలజ మాధురి ప్రవర్తన గురించి ఆలోచిస్తూ నిజంగా ఆశ్చర్యపోయింది. మాధురి ఎందుకంత ముభావంగా మారిపోయిందోనని అనుకుంది. తను హంటర్‌ను చేసుకోడం గురించి చెప్పినప్పుడు తనని గుచ్చి గుచ్చి అతనెలా వుంటాడని కాని, మంచివాడేనా అని కాని, అసలింతకీ ఎలా పరిచయమైనాడని కాని, ఎలా ఆకర్షితులైనారు అనికాని ఏమీ అడగనేలేదు. మాధురి నిజంగా అలిసిపోయి పడుకుందేమో- అసలే రాత్రంతా కేసు వల్ల నిద్రలేదు" అని అనుకుంటూ తన పనిని ముగించుకుని మళ్ళీ రూమ్‌కొచ్చింది శైలజ.

రూమ్ లోపల గడియవేసివుంది. అంటే తను బయటికి వచ్చేక మాధురి లేచి లోపల గడియ వేసుకుందన్నమాట. అయితే తనిప్పుడేం చేయాలి? తలుపు తట్టాలా వద్దా? తలుపు తట్టితే మాధురి నిజంగా పడుకుని వుంటే పాపం తనవల్ల లేస్తుందేమో! అనవసరంగా నిద్ర పాడుచేయడమెందుకులే అని కాస్సేపు ఏం చేయాలా అని తలుపు దగ్గరే నిలబడి వుంది.

లోపల్నుంచి ఏవో శబ్దాలు విన్పిస్తున్నాయి. అంటే మాధురి నిద్రపోలేదు. ఒక్కర్తే అసలు లేదు. ఇంకెవరిదో మగగొంతు మాధురిని కోప్పడుతున్న వైఖరిలో వుంది. కొద్దిసేపు ఒక్క మగగొంతే విన్పించింది. తర్వాత మాధురి అరుపులు, ఏడుపూ విన్పించింది. కొంచెంసేపు తర్వాత మాధురి ఏడుపు స్వరంతగ్గి అతికోప స్వరంతో 'గెటవుట్, గెటవుట్ ఆఫ్ మై రూమ్' అని కోపంగా వచ్చి తలుపు తెరిచి పట్టుకొని నిల్చుంది. ఆమెతోపాటుగా వచ్చిన ఆ మగమనిషి పైకి వచ్చాడు కోపంగానే. అతని మాటలు, చూపులు, చేష్టలూ





కూడా కసిని వెదజల్లుతున్నాయి. పిడికిళ్లు మూసిపెట్టుకొని ఒకదానితో ఒకటి కొట్టు కుంటూ, "చూస్తా నేనూ చూస్తాను నువ్వెలా ఒప్పుకోవో, నీ చదువుకీ, నీ వేషా లకీ నేను పెట్టిన డబ్బు నీచేత కక్కిస్తాను. నువ్వెలా కాదంటావో నేనూ చూస్తాను" అంటూ గొణుక్కుంటూ ఆ గదిలోంచి ఒక నడివయస్కుడు గబగబా అడుగులేసు కుంటూ బయటపడి వెళ్ళిపోయాడు.

శైలజ అతన్ని వెనుకనించి మాత్రమే చూసింది.

శైలజ కాసేపాగి లోపలికి ప్రవేశించింది. మాధురి మంచంమీద బోర్లా పడుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఈసారి ఆశ్చర్యపోవడం శైలజ వంత యింది. మాధురికి కూడా ప్రాబ్లెమ్ వుందా! అసలు ప్రాబ్లెమ్స్ అంటూ లేనివాళ్ళెవరూ లేరేమో ఈ ప్రపంచంలో.

"మాధురీ" శైలజ మాధురీ పక్కనే కూర్చుని చీరకొంగుతో కళ్ళతడిని వత్తుతూ అనునయించసాగింది.

మాధురీ బెక్కుతూ ఏడుస్తూ "చూశావుగా శైలూ ఆ వెధవ, ఆ పొగరుమోతు- నా చదువుకోసం మా నాన్నకి డబ్బు అప్పు ఇచ్చాడు. అదీ కాకుండా మా నాన్న ఉద్యోగంనుంచి రిటైరు కావడంతో ఇల్లు గడ వడం కష్టంగా వుంటే, నెలనెలా ఇంటి ఖర్చులకని కొంత డబ్బు అప్పుగా తీసుకుం టున్నారు. వాడికి ఆరుగురు ఎదిగిన ఆడపి ల్లలున్నారు. వాడి భార్య పోయింది. నేను కాని వాణ్ణి పెళ్లి చేసుకుంటే మా నాన్నని డబ్బు అప్పు తీర్చమని అడగడుట. మా నాన్నకి తెలియకుండా అప్పుడప్పుడు ఇలా వచ్చి నన్ను బెదిరిస్తుంటాడు. వాడికిప్పుడు వయస్సు 55 సంవత్సరాలు. పల్లెటూరిలో పొలాలున్నాయి. వ్యవసాయం చేసుకుం టాడు. వాడి అప్పు నేను తీరుస్తాననే అన్నాను. కాని వాడు "నాకు డబ్బు అప్పు తీర్చక్కరలేదు. నన్ను పెళ్లి చేసుకో చాలం టున్నాడు"

శైలజకి మాధురి పరిస్థితి అర్థం అయింది.

మాధురి అంది- "అందుకే అన్నాను శైలజా! వరుడు ఎవరైనా కానీ ఒకవేళ వివాహం చేసుకొని సెటిల్ అవుదామని అనుకుంటే మాత్రం వెంటనే ఆపని చేసెయ్యి" అని.

తలగడ కిందనించి పెన్నూ ఏవో కాగి తాలూ తీసి పర్సులో పెట్టుకుంటూంటే ఆ కాగితాల మధ్యనించి అభయహస్తం ఇస్తున్న శిరిడీసాయిబాబా ఫొటోకింద పడింది. వెంటనే మాధురి దానిని తీసి కళ్ల కద్దుకుని "బాబా చూశారుగా ఆ దుర్మార్గుడు మళ్ళీ వచ్చాడు" అంటూ ఫొటోని కూడా పర్సులో పెట్టుకుంది. ఆ తర్వాత ఇలా అంది.

"శైలూ శిరిడీ సాయిబాబాయే నా గురువు. నా దైవం. నేనెప్పుడూ నా బాధ లన్నీ ఆయనతోటే చెప్పుకుంటాను. మా ఇంట్లో అందరికీ సాయిబాబాయే ఇలవే లుపు. ప్రతిక్షణం ఆయన మమ్మల్ని కంటి కిరెప్పలా కాపాడుతూనే వున్నారు"

"మరి ఇప్పుడు కూడా బాబాయే నిన్ను కాపాడుతారు ధైర్యంగా వుండు మాధురీ-"

"అవును శైలూ ఇప్పుడూ నన్ను ఆ సాయి బాబాయే కాపాడారు. ఎలాగో తెలుసా? చెపుతాను విను" మాధురి చెప్పసాగింది.

"నువ్వు తలుపు దగ్గరగా వేసుకుని బయ టికి వెళ్ళిన రెండు నిముషాలలోనే మాధురీ, మాధురీ అంటూ అతగాడు- తలుపులేయ నందున లోపలికి వచ్చి నేనొక్కర్తెనే వుండ డాన్ని గమనించి లోపల గడియ వేసేసేడు. నేను చటుక్కున లేచి కోపంగా "ముందు బయటికి నడు. లోపలికి అలా రాకూడదని తెలియదా? " అంటూ అరిచాను. అతను నవ్వుతూ నాకేసి రాబోయి తడబడి బల్లకి తగులుకొని కుర్చీకి బల్లకీ మధ్య ఇరుక్కుపో



యాడు. అతనక్కణ్ణుంచి లేవడానికి టైంపట్టింది. నేనప్పటికి తలుపు వద్దకు వచ్చి గడియతీసి తలుపుతీసి అతన్ని పొమ్మన్నాను. లేకపోతే హాస్పిటల్ స్టాఫ్‌నంతటినీ పిలుస్తానని చెప్తే, నన్ను బెదిరిస్తూ గొణుక్కుంటూ బయటికి వెళ్ళిపోయాడు. బాబాగారు కాని కాపాడకపోతే అతనలా పడిపోడు. నాకు తలుపు దగ్గరికి వచ్చే అవకాశం వుండదు శైలూ"

శైలజ అవునని తలూపింది. "నాకూ దేవుడున్నాడు అనే నమ్మకాలున్నాయి మాధురీ!' ' అంది.

మాధురి శైలజకి ఒక శిరిడీ సాయిబాబా ఫోటో, ఒక పొట్లాం విభూతినీ ఇచ్చి "వీటినెప్పుడూ నీ పర్సులో భద్రంగా వుంచుకో, నీకే ఆపదా రాదు" అంది నమ్మకంగా.

శైలజ వాటిని భద్రపరుచుకుంది. క్షణాలలో మళ్ళీ మాధురి యధాప్రకారం పూర్వంవలె అయిపోయింది.

శైలజ తన టిక్కెట్టు కన్‌ఫర్మ్ అయిందని చెప్పింది. శైలజ అప్పుడే వెళ్లిపోతోందని మాధురికి కొంచెం బెంగవేసింది.

శైలజ ఏర్‌పోర్టులో మాధురిని కౌగిలించుకుని తనకు వీడ్కోలు చెబుతూంటే, "మాధురీ! నిన్ను, నీ ధైర్యసాహసాల్నీ ఆ బాబాగారే కాపాడుతారులే. తప్పక నిన్ను మెచ్చినవాడు, నీకు నచ్చినవాడు దొరుకుతాడులే" అంది నవ్వుతూ.

"అవునులే నా గురించి అంతా బాబాయే చూసుకుంటారులేవే! నాకేం దిగులు లేదు. ఇంక మీదట బాబా నిన్ను కూడ చూసుకుంటారులే. మనం సప్తసముద్రాల అవతల వున్నా ఆయన్ని పిలవాలేకాని పిలిచి కోరితే ఎప్పుడూ ఏదీ కాదనరు. ఆయన ఆశ్రిత పక్షపాతి" అంది మాధురి.

ఇద్దరూ ఉత్తర ప్రత్యుత్తరాలు రాసుకుందికి, ఒకరి విషయాలు మరొకరికి తెలుపుకుందికి ఒప్పందం కుదుర్చుకున్నారు. శైలజ బేగేజీ చెక్ చేసి మాధురిని మరోసారి కౌగిలించుకొని వెళ్లొస్తానంటూ లాంజ్‌వైపు కదిలింది.

మాధురి కూడా శుభాకాంక్షలు చెప్పి వెనుదిరిగింది, కంట తడిపెట్టుకుంటూ.

రూముకొచ్చిన మాధురి చాలాసేపు బాబా ఫోటోవైపు చూస్తూ మనసులో ఆయననే ప్రార్థిస్తూ కూర్చుంది.

"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోర్జున
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ"

ప్రస్థానత్రయంలోని ప్రధాన గ్రంథమైన భగవద్గీతలోని ఏడవ అధ్యాయమైన విజ్ఞానయోగంలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన శ్లోకాన్ని పదేపదే మననం చేసుకుంది.

"అర్జునా వారివారి పురాకృత సుకృతాలవలన ఆపదలో వున్నవారు, డబ్బు అవసరమైనవారు, సత్యాన్వేషి, పరతత్వ సాధకుడూ అనే ఈ నాలుగు రకాల పుణ్యాత్ములే ప్రపంచంలో నన్ను ఆరాధిస్తుంటారు" అని అందువల్లనే శ్రీసాయి ఆశ్రితుల సమస్తమయిన లౌకిక వాంఛలనూ పరిపూర్తి చేసేవారు.

అయితే ఆయన మీద భక్తి శ్రద్ధలతోను ఆయన అనుగ్రహాన్నికై తగినంత ఓర్పుతోనూ ఎదురు చూడడమొకటే మనం చేయవలసిన పని"

మాధురి దగ్గర కావలసినంత ఓర్పు వుంది.

కొంతసేపయ్యాక టేబులు మీది ఫ్లాస్కులోంచి కాఫీని గ్లాసులో పోసుకొని తాగింది. కాసేపు కళ్ళు మూసుకొని మంచం మీద పడుకుంది. తలలో ఏవేవో ఆలోచనలు. శైలజ వెళ్లిపోతే ఏం తోచటంలేదు. మంచం మీద ఎంతసేపు అటూఇటూ పొర్లినా నిద్రపట్టడంలేదు. మాధురికి గత స్మృతులు వెంటాడసాగాయి.

రెండేళ్ళ క్రితమే మాధురికి డాక్టరు కృష్ణతో పరిచయమయింది. డాక్టర్ లలితకి పెదనాన్నగారి అబ్బాయి డాక్టర్ కృష్ణ. ఒక రోజేదో కాలేజీ ఫంక్షనులో స్టేజిమీద పాట




పాడుతూంటే మాధురి తన్మయురాలై అతనినే చూడడం ప్రారంభించింది. అతని పాట వింటూ అతనిని అలా ఎంతసేపు చూసినా ఆమెకి తనివితీరలేదు. ఆ పాట కాగానే అతను మరొక పాట పాడుతూ ఇంకా అలా స్టేజిమీద దర్శనం ఇస్తూ వుంటేనే బావుంటుందనుకుంది. పక్కనే కూర్చున్న ఆమె స్నేహితురాలు డాక్టర్ లలిత స్టేజిమీద ఆ అబ్బాయిని మాధురి అడ్మైరు చెయ్యడాన్ని గమనించింది.

"మాధురీ!"

ఉలిక్కిపడ్డట్టు, డిస్టర్బ్ అయినట్లు అయి లలితని చూసింది మాధురి.

"మాధురీ అతనందుబాటులో వున్నాడేమో కనుక్కోమన్నావా? " అంది లలిత నవ్వుతూ.

"ఛ పోవే అవేం మాటలు? అతను చాలా బాగా పాడాడు. నేను వింటున్నాను అంతే" అంది మాధురి.

"అంతేనా? అతని పాటని మెచ్చుకోడం లేదూ? " అంది లలిత.

"పాటనికాదులేవే, అతని గొంతు. అతని గొంతు ఆ పాటలో వింటూంటే మనం ఏదోలోకంలో తేలిపోతున్నట్లుంది. నిజానికి నాకేకాదు. ఇక్కడున్న ఆడియన్సంతా అలాగే తన్మయులై వున్నారు. నిజం చెప్పు లలితా నీకు మాత్రం అలా అనిపించలేదా? ' ' అంది మాధురి.

"అలా అంటే ఎలా? " అంది లలిత.

"అదే అది గంధర్వగానం అని. చూస్తుండు, అతనికివ్వేళ ప్రత్యేక బహుమతినిస్తారు స్టేజిమీద. అలా ఒకవేళ మన వాళ్ళు అతనికి ప్రత్యేక బహుమతినిచ్చి వాళ్ల స్టేటస్‌ని నిలబెట్టుకోకపోతే ఆ బహుమతిని నేనిచ్చి అతన్ని గౌరవిస్తాను" అంది మాధురి ఆవేశంతో.

"అతగాడు నీ ప్రత్యేక బహుమానానికి అర్హుడే. నువ్వా పని తప్పక చెయ్యి మాధురీ" అంది లలిత నవ్వుతూనే, మాధురి ఆవేశానికి, మాటలకీ ఆశ్చర్యపోతూందామె!

"చూస్తుండు లలితా నేనతన్ని కంగ్రాచులేట్ చేసివస్తాను. నువ్వేదో మాధురీ అంటే తక్కువగా అంచనా వేస్తున్నావు" అంది మాధురి చిరుకోపాన్ని నటిస్తూ.

లలిత చిరునవ్వుతో అలా చూస్తుండగానే మాధురి అన్నంత పనీ చేసింది. డాక్టర్ కృష్ణ పాట అయి కిందికి దిగి వస్తుండగానే తను ఎదురు వెళ్లి "కంగ్రాచులేషన్స్" అంది.

డాక్టర్ కృష్ణ పాడిన ఆ పాటకి ప్రేక్షకుల లోంచి చప్పట్లు మిన్నుముట్టడమే కాకుండా వన్స్‌మోర్, వన్స్‌మోరని అరవడం మొదలు పెట్టేరు. కల్చరల్ ప్రోగ్రాము ఆర్గనైజరు మైకు ముందుకు వచ్చి తర్వాత కొద్దిసేపట్లో అతని పాటల ప్రోగ్రాముంటుంది. దయ చేసి ప్రేక్షకులు తాము కోరే పాటలను చీటీల మీద రాసి పంపండి. అందులో ఆయనకి వచ్చినవి సెలెక్టు చేసుకొని పాడతారన్నాడు.

మళ్లీ సభలో కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

కంగ్రాచులేషన్స్ చెపుతున్న మాధురిని డా. కృష్ణ సంతోషంతో చూశాడు.

ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. ఇద్దరూ ఒకరినొకరు కొంచెంసేపు అలా చూసుకుంటూ వుండిపోయారు. డాక్టర్ కృష్ణ చూపులు తూపులై మాధురి హృదయాన్ని గాయపర్చాయి. ఆమె తీయగా మూల్గి ఆ చూపులికి తట్టుకోలేక వెంటనే తలదించేసుకుంది. డాక్టర్ కృష్ణకి అప్పుడు తెలిసింది. తను థాంక్స్ అనకుండా నిల్చుండిపోయానని.

"చాలా థాంక్సండీ" అని అతనంటూంటే డాక్టర్ లలిత వచ్చి "కృష్ణన్నయ్యా! ఈవిడ నా ఫ్రెండు డాక్టర్ మాధురి" అని పరిచయం చేసింది.





మాధురి లలిత వైపు చిరుకోపంతో చూసి "ఇతను మీ అన్నయ్యని నాతో ఎప్పుడూ చెప్పలేదేం" అంది.

"మనకెప్పుడూ అన్నయ్యని పరిచయం చేసుకునే అవకాశం రాలేదు మాధురీ. ఇవ్వాళ అతను స్టేజి ఎక్కి పాడటం వలన మనకావకాశం లభించింది" అంది లలిత కొంటెగా నవ్వుతూ.

మాధురికి చాలా గర్వం అనిపించింది. అంత గొప్ప పాటగాడిని తనే మొట్టమొదట అభినందించగల్గిందని.

తర్వాత మాధురి కళ్లెప్పుడూ డాక్టర్ కృష్ణ ఎక్కడెక్కడ కనపడతాడోనని వెతుకుతూనే వుండేవి. కాలేజీలోను లైబ్రరీలోను, హాస్పిటల్లోను ఈవిధంగా మాధురి, మాధురికోసం కృష్ణ చూసుకుంటూండేవారు.

ఇంకోనాడు ఇంటర్ మెడికల్ కాలేజీ వార్షికోత్సవాలలో పాటల పోటీలు జరిగితే మాధురి ఫ్రెండ్సంతా కలిసి మాధురిని హిందీ పాటలు పాడమన్నారు. అప్పుడు తెలిసింది కృష్ణకి మాధురి కూడ పాడుతుందని, మధుర గాయని అనీ. అందుకే కాబోలు వారిద్దరూ ఒకరికొకరు ఆకర్షితులైనారు.

తర్వాత వాళ్లిద్దరూ కలిసి కొన్ని నాటకాలలో హీరో హీరోయిన్లకి తమ గొంతులను ఎరువిచ్చారు. అలా ఏర్పడిన తమ ఇద్దరి పరిచయం మెల్లగా ప్రేమలోకి మారింది. అయితే ఒక్క లలితకి తప్ప ఈ రహస్యం మరెవరికీ చెప్పలేదు మాధురి.

మొట్టమొదటిసారిగా డాక్టర్ కృష్ణ తమ ఇంటిలో తల్లిదండ్రులవద్ద తమ ప్రేమ విషయం తెలిపి తాను మాధురిని వివాహం చేసుకుంటానని ప్రస్తావించేడు. వాళ్లిద్దరూ కూడా ఎంతమాత్రం ఒప్పుకోలేదు.

"మన జాతీ నీతీకాదు. అందులోనూ వేరే భాష మాట్లాడుతుంది ఆ అమ్మాయి. మనలో కలిసిమెలిసి బతకడం కష్టంరా నాయనా కృష్ణా" అంటూ తల్లి సర్ది చెప్పబోయింది.

"అమ్మా పెళ్లి నూరేళ్ల పంట అంటారు పెద్దలు. ఆ అమ్మాయి నాకు నచ్చింది. నేనా అమ్మాయికి నచ్చేను. ఇంక అలవాట్లూ ఆచారాలూ అంటావా ఇక్కడికి వచ్చేక అన్నీ నేర్చుకుంటుంది. ఇంతకీ అన్నింటికీ నువ్వున్నావుకదా అమ్మా! ఆ అమ్మాయిని నీ కోడలిగా తీర్చిదిద్దుకోడానికి. నాన్నకి నువ్వు నచ్చచెప్పమ్మా! నువ్వు చెపితే నాన్న కాదనరు" అంటూ గారాలుపోయాడు కృష్ణ.

"అది సరేరా! ఇంట్లో నీ చెల్లెలు పెళ్లికి ఎదిగి కూర్చుంది. మేము నీ పెళ్లికి వచ్చిన కట్న కానుకలతో దానికి పెళ్లి చేసి అత్తవారింటికి పంపాలని చూస్తున్నాము. నువ్వు ప్రేమాగీమా అంటూ కూర్చుంటే నీ చెల్లి పెళ్లి ఎలా అవుతుందిరా? ఇన్నాళ్లూ నీ చదువుకోసం ఆగాము. ఇప్పుడింక నీకు ఉద్యోగం వచ్చింది. కనుక పెళ్లి ప్రయత్నాలు చేద్దామనుకుంటున్నాము. వీలయితే మీ ఇద్దరికీ ఒకేసారి చేద్దామని మా ఆలోచన. చూడు నాయనా మీ నాన్నగారు నీ ఎదుటబడి నీకు నచ్చచెప్పడానికి ప్రయత్నించరు. ఒకవేళ నువ్వు కాని ఆయన మాట కాదని పెడదారినపడి నా ఇష్టం వచ్చినట్లు నేను చేస్తాను అని నువ్వంటే ఆయన మనసుకి విఘాతం తగుల్తుంది. ఆలోచించు కృష్ణా! బాగా ఆలోచించి ఏ పనైనా చెయ్యి. మన వంశ గౌరవ ప్రతిష్టలకు ఏ భంగం రానీయొద్దు. నువ్వు మగపిల్లవాడివి. నీకు పెళ్లయితే ఒక ఆడపిల్ల మనింటికి వస్తుంది. మనలో కలిసిపోతుంది. కానీ నీ చెల్లికి పెళ్లయి అత్తవారింటికి వెళితే అక్కడ వాళ్లు మీ కుటుంబం ఇలాగ అని వేలెత్తి చూపించి దానిని సాధిస్తే మాత్రం మనకు కష్టమౌతుంది. చూడు కృష్ణా..." అంటూ ఇంకా చెప్పబోతున్న తల్లిని ఆపి ఇప్పుడే వస్తానంటూ ఎటో వెళ్లిపోయాడు కృష్ణ.

ఆ సాయంత్రం మాధురీ, కృష్ణా బీచ్‌లో కలుసుకున్నప్పుడు ఇద్దరూ మనసు విప్పి ఈ విషయాలన్నీ ముచ్చటించుకున్నారు.

మాధురి అంది, "నాకూ ఒక చెల్లెలు పెళ్లి కివుంది. నా తండ్రి అప్పులు చేసి నన్ను చదివించేరు. నాకు చదువుమీద చిన్నప్పట్నుంచీ ఎంతో ఇష్టంగా వుండేది. మా నాన్నగారు ఒక స్కూల్లో టీచరుగా పనిచేసేవారు. మాకు మా తాతగారిద్వారా సంక్రమించిన ఆస్తంతా మా ఇల్లు ఒక్కటే. రెండెకరాల పొలం వుండేదికాని దానిని మా నాన్నగారు నా చదువుకోసం తాకట్టుపెట్టేరు. మా చెల్లెలు ఇంట్లో పనులు సాయం చేస్తూ అన్ని పరీక్షలు ప్రైవేటుగా చదివి పాసవుతోంది. దానికి ముందు మంచి సంబంధం చూసి పెళ్లి చెయ్యాలని, ఆ ఖర్చులూ నా చదువుకి అయిన అప్పులూ నేను తీర్చాక పెళ్లి చేసుకుంటానని మా నాన్నకి మాటిచ్చాను. పెద్ద పిల్లకి పెళ్లి కాకుండా చిన్న పిల్లకి పెళ్లేమిటని అందరూ ఆడిపోసుకుంటారేమోనన్న భయంవున్నా మా నాన్నగారికి గత్యంతరం లేక ఒప్పుకున్నారు. నేనందుకే వీలైనంత తక్కువ ఖర్చుతో హాస్టల్లో పొదుపుగా వుంటూ డబ్బు వెనకేస్తున్నాను"

మాధురి నిజాయితీకి, ఆమె పడుతున్న కష్టానికీ కరిగిపోయాడు. కృష్ణ మాధురికి తన పరిస్థితినంతా పూసగుచ్చినట్లు చెప్పేడు. ఇద్దరూ తమతమ విధులు నిర్వర్తించాకే ఎన్ని అవాంతరాలు వచ్చినా మనసులు మార్చుకోకుండా ఒకరికోసం ఒకరు అలా వేచి వుండడానికే నిశ్చయించుకున్నారు.

ఉద్యోగంలో వుంటున్న రోజుల్లోనే కృష్ణకి అమెరికాలో మెడిసిన్ ఇంటర్‌షిప్పు వచ్చింది. తల్లిదండ్రులకి చెప్పగానే మొదట వాళ్లు సంతోషపడినా మధ్యతరగతి కుటుంబీకులకు విదేశాల చదువు కష్టమనీ, కృష్ణ పెళ్లి చేసుకుంటానంటే పిల్లనిచ్చి పెళ్లి చేసి అల్లుణ్ణి అమెరికా పంపే అత్తమామలుంటారని వారొకసారి ఆశగా సూచించారు.

కానీ కృష్ణ పెళ్లికికానీ పెళ్లి చూపులకి కానీ అంగీకరించలేదు. తన అనాటమీ ప్రొఫెసరు తనను ఎంతో బాగా చూసుకుంటాడు. ఆయన వద్దకు వెళ్లి తన పరిస్థితిని, తనకు అమెరికాలో సీటు వచ్చిన విషయాన్నీ చెప్పగానే ఆయన చాలా సంతోషించేరు. బ్యాంకు లోను తీసుకొని తను అమెరికాలో స్థిరపడ్డాక ఆ అప్పుల్ని తీర్చేయమన్నారు. బ్యాంకులోనుకి తాను హామీ సంతకం పెడతామన్నారు.

మాధురి కూడా ఎంతో ధైర్యాన్నిచ్చింది. అలా అమెరికా వెళ్లిపోయిన కృష్ణ మొదట్లో మాధురికి తరుచు ఉత్తరాలు రాస్తూండేవాడు. తర్వాత తర్వాత ఉద్యోగాన్వేషణ ఇతరత్రా వ్యాపకాలవలన తగ్గించాడు. కృష్ణ అనతికాలంలోనే మంచి డాక్టరు అని పేరు తెచ్చుకోడమే కాకుండా సర్జికల్ స్పెషలిస్టు అయ్యేడు.

మాధురి అప్పులు తీర్చడానికి ముందుగా చెల్లెలికొక మంచి సంబంధం కలిసివస్తే ఆమెకి పెళ్లి చేయడానికి పూనుకుంది. మాధురి తల్లిదండ్రులూ, చెల్లెలూ, మాధురీ అంతా మంచి భక్తులు. వాళ్లకి ఎన్ని కష్టాలొచ్చినా, ఒడిదుడుకులు ఏర్పడినా అవన్నీ స్వామి దయవలన ఒక్కొక్కటీ గట్టెక్కి ఒడ్డుకు చేరగల్గుతున్నామనుకుంటారు.

కృష్ణ పంపిన డబ్బుతో తల్లిదండ్రులు తమ కూతురికి మంచి సంబంధం చూసి పెళ్లి ఘనంగా జరిపించారు. అయితే కృష్ణ చెల్లెలి పెళ్లికి వారికే రాలేకపోయాడు. ఇండియాకి వచ్చి వెళ్లే టిక్కెట్టు ఖర్చుల్ని కూడా ఇండియాకి పంపించాడు.

మాధురి ఇప్పుడిప్పుడే ఆర్థిక బాధల్నించి తేరుకుంటోంది కానీ మాధురి తల్లిదండ్రు





లకి మాధురి కూడా ఒక ఇంటిదైతే బావు ణ్ణని వుంది. కానీ మాధురి నిర్ణయం వాళ్లని మాట్లాడనీయలేదు. కృష్ణ తన విషయాలు ఆమెకి ఎప్పటికప్పుడు తెలియజేస్తున్నాడు. ఏదైనా డబ్బు అవసరమైతే తనకు తెలియ జేస్తే తాను పంపిస్తానన్నాడు. ఇంక త్వర లోనే తమ పెళ్లి ఏర్పాట్లు జరుగుతాయి అని హామీ ఇచ్చాడు.

మాధురి త్వరలోనే పూర్తిగా ఋణ విము క్తురాలవుతుంది. అయితే ఈ విషయాలేవీ కూడా ఎవరికీ చెప్పకుండా తనలోనే వుంచు కుంది. చాలాసార్లు శైలజతో చెప్దామను కుంది కానీ అన్నీ సక్రమంగా జరిగినప్పుడు చెప్దాంలే అని మళ్లీ మానుకుంది.

కానీ ఇవ్వాళ నిజంగా శైలజ వెళ్లి పోగానే తను వంటరితనాన్ని అనుభవిస్తున్నట్లు అనిపించసాగింది. కృష్ణ వస్తాడు. తన కృష్ణ వస్తున్నాడు. లలితెక్కడుందో కృష్ణ వస్తేనేకాని తెలియదు. తన స్నేహితులం దరూ ఒక్కొక్కరే జీవితంలో స్థిరపడ్తు న్నారు. శైలజ కూడా త్వరలోనే తన్ను మెచ్చినవాణ్ణి తనకు నచ్చినవాణ్ణి చేసుకోబో తోంది. కృష్ణ వచ్చేక తను అన్ని విష యాలూ శైలజతో మాట్లాడాలని నిశ్చయిం చుకుంది మాధురి.



వెల్లింగ్టన్ చేరిన శైలజ ఇంటికెళ్తూనే సామాను ఇంట్లో పడేసి త్వరత్వరగా తెమిలి వెంటనే హాస్పిటల్‌కి వెళ్లిపోయింది.

వెనీసా ఆశ్చర్యపోయింది. "నీకింకా వారం రోజుల లీవు వుందికదా! అప్పుడే వచ్చేసేవేం డాక్టర్? అదీగాక వెల్లింగ్టన్ వచ్చేక ఇంటినుంచి ఫోను చేయకుండా కూడా వచ్చేవు. ఇవాళంతా ప్రయాణపు బడ లిక వుంటుందికదా రెస్టు తీసుకోవలసింది" అంది నవ్వుతూ.

"అమెరికాకి వెళ్లిన హంటర్ ఇంకా రాలేదా?" అనడిగింది శైలజ, వెనీసా వేస్తున్న కుశల ప్రశ్నలను పక్కకునెట్టి ఆతృ తతో.

"ఇంకా రాలేదు. నీకేమీ ఉత్తరాలు కూడా ఎక్కణ్ణుంచీ రాలేదు" అంది వెనీసా.

నిరాశతో నిస్సత్తువగా కుర్చీలో కూలబడి పోయింది శైలజ. ఎలాగో లంచ్ టైము వరకు హాస్పిటల్లో వుండి జాయినింగ్ రిపోర్టు ఇచ్చేసి ఇంటికెళ్లి పోతూంటే వెనీసా వచ్చి "మిస్ శైలజా" అని పిల్చింది.

శైలజ ఆగి వెనక్కి చూసింది.

"నేను సాయంత్రం మీ ఇంటికి వస్తు న్నాను డాక్టర్!"

"ఓ గుడ్! యూ ఆర్ మోస్ట్ వెల్‌కమ్" అని నవ్వుతూ శైలజ ఆహ్వానించింది ఆమెని.

ఆ సాయంత్రం వెనీసా శైలజ ఇంటికె ళ్లింది. ఇద్దరూ టిఫిన్ తిని డ్రింక్స్ తాగాక హంటర్ ప్రసక్తి వచ్చింది. నిజానికి ఇంతవ రకూ శైలజ తన కుతూహలాన్ని ఆపుకొని వెనీసాయే మొదలుపెట్టి ఏదో ఒకటి చెబు తుందిలే అని ఓపికతో కూర్చుంది. ఆ తరుణం రానేవచ్చింది.

"హంటర్‌కి తన ఫియాన్సీ దగ్గర్నుంచి ఉత్తరంరాగానే అమెరికా వెళ్లాలని బుక్ చేసుకున్నాడు. కానీ అతనికి వెంటనే శలవు దొరకక వెళ్లలేకపోయేడు"

వెనీసా శైలజ వైపు చూడకుండా ఎదు రుగా వున్న ఫ్లవర్‌వేజ్ వైపు చూస్తు అంది.

"ఫియాన్సీ- హంటర్‌కి ఫియాన్సీ వుందా? మరి నాకెప్పుడూ చెప్పలేదే తనకొక ఫియాన్సీ వుందని. అతనికొక ఫియాన్సీ వుంటే నాతో ఎందుకంత చనువుగా తిరిగాడు. నన్ను... నన్ను... నన్ను ఎందుకు అన్ని స్థలాలూ తిప్పి చూపించాడు? "

"బహుశా నీకు కావాలనుకుని వుంటావు డాక్టర్. ఇందులో హంటర్ తప్పేముంది? అతను అతని గర్ల్‌ఫ్రెండ్స్ గురించి నీకెందుకు చెప్పాలి? అలా చెప్పడం మీ ఇద్దరికీ మంచిది కాదు కదా!" అంది వెనీసా.

"అంటే..."

"అంటే మీ ఇద్దరికీ ఆ ఆనందం వుండదు. మీరిద్దరూ జీవితాన్ని ఆనందంగా మలుచుకోగలిగేరంటే అందరూ అందరికీ అన్ని రహస్యాలూ చెప్పేయకూడదు"

"ఇలాంటి ప్రవర్తనని మా ఇండియాలో సహించరు"

"కావచ్చు. ఒకరికొకరు నచ్చడమంటే ఇలాగే కలిసి మెలిసి వుండి ఒకరి గుణాలను వేరొకరు అర్థం చేసుకొని సంపూర్ణంగా ఒకరి ప్రవర్తన మరొకరికి నచ్చితేనే ఒకరికొకరు దగ్గరవుతారు. అలా దగ్గరయ్యాక కూడా వెంటనే వివాహం చేసుకోరు. మధ్యలో అభిప్రాయభేదాలు వస్తే మళ్ళీ విడిపోతారు. అందుకే మాలో కూడా కొందరికి వివాహాలు ఆలస్యంగా జరుగుతాయి. పైగా వివాహం అయితే మేం భార్యాభర్తలుగా అన్యోన్యతకి కట్టుబడి వుండడానికి, కుటుంబ వ్యవస్థకి, ఆ పద్ధతిలో జీవించడానికి ప్రయత్నిస్తాం. ఈ విషయంలో ఏషియన్లు అంతా ఒక్కలాగే ప్రవర్తిస్తారనుకుంటాను. అమెరికాలో అయితే వివాహం చేసుకొన్నాక కూడా అభిప్రాయభేదాలు వస్తే కావాలనుకుంటే వెంటనే విడాకులిచ్చేసుకుంటారు"

"వెనీసా నీకు వివాహమయిందా? " శైలజ అడిగింది.

"అయింది డాక్టర్. నాకు నలుగురు పిల్లలు కూడాను. మేం ఎన్నడూ మా న్యూజిలాండు పద్ధతిని జవదాటలేదు. మా పిల్లలు పెరిగి పెద్దవాళ్లు కూడా అయ్యారు. మా ఇద్దరి మధ్యా అంటే, నాకూ నా భర్తకూ మధ్య ఏవో చిన్న చిన్న అభిప్రాయ భేదాలు వచ్చేవికాని మేమెన్నడూ విడాకుల వరకూ పోలేదు"

"హంటర్ ఫియాన్సీ న్యూజిలాండు అమ్మాయా? లేక అమెరికన్ అమ్మాయా? ' ' శైలజ అడిగింది.

"అమెరికన్ అమ్మాయే. కాని తల్లి న్యూజిలాండర్. తండ్రి అమెరికన్. చిన్నప్పుడు తల్లితో అమ్మమ్మతో ఉన్నప్పుడు ఇక్కడ న్యూజిలాండులో పెరగడంవలన హంటరుతో పరిచయం ఏర్పడింది. అమ్మాయి అమెరికాలో మెడిసిన్ ఫైనలియర్ చేస్తోంది. తండ్రి చదివిస్తున్నాడు. అమ్మాయికి అమెరికా దేశమే నచ్చిందనీ, ఇంక న్యూజిలాండుకి తిరిగిరావాలని అనుకోవడం లేదనీ విన్నాను"

"అయితే ఇంక హంటర్ అమెరికాలోనే వుండిపోతాడన్నమాట"

"కావచ్చు తెలియదు" అని వెనీసా వెళ్ళడానికి లేచింది.

ఆమెను సాగనంపుతూ శైలజ "ఆ అమ్మాయి అందంగా వుంటుందా వెనీసా. నువ్వా అమ్మాయిని చూశావా? " అంది.

"చూశాను. అందంగా వుంటుంది" అంది వెనీసా.

వెనీసా బయటికి వచ్చి గుడ్‌నైట్ చెప్పి కారు స్టార్టు చేసింది. శైలజ కూడా గుడ్‌నైట్ చెప్పి లోపలికి వచ్చి తలుపేసుకుంది.

ఏ హంటర్ కోసమైతే తన సర్వస్వం అర్పించిందో ఆ హంటర్ ఇప్పుడు తనకు కాకుండా పోతున్నాడు.

హంటర్! అతని ఫియాన్సీ! మధ్య మరి తనెవరు?

 

తను హంటర్‌కి ఏమీ కాదా?

హంటర్ తనకు ఏమీ కాడా?

హంటర్ ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకొని అమెరికాలోనే వుండిపోతే తనిక్కడేం చేయాలి?

హంటర్‌ని తననుండి ఎవరో వేరు చేస్తున్నట్లుగా భావించసాగిన శైలజకి కన్నీరు మున్నీరై ప్రవహించసాగింది. జీవితంలో ఎన్నడూ ఇలా జరుగుతుందని తను ఊహించలేదు. తనకి గట్టి ఎదురుదెబ్బే తగిలింది.

ఆ అమ్మాయి కూడా అందంగానే వుంటుందిట.

హంటర్- ఆ అమ్మాయి.

ఇంక ఆ అమ్మాయి హంటర్ కౌగిట్లో స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తుంది. ఇద్దరూ కలిసి హాయిగా, ఆనందంగా వుంటారు. మరి తనేం చెయ్యాలి. తనకేది గతి? హంటర్ తనని మర్చిపోగలడా! ఆ అమ్మాయితో తిరిగిన ప్రదేశాలలో తనతో తిరిగినట్లు జ్ఞాపకం చేసుకుంటాడా! తనకి హంటర్ ఇచ్చిన ఆనందాన్నే ఆ అమ్మాయికి కూడా ఇవ్వగలడా?

ఏమో ఈ ఫారినర్స్ ఎంతకైనా సమర్థులు.

అయితే తనతో ఒక్కమాట కూడా సూచనప్రాయంగానైనా చెప్పకుండా వెళ్ళిపోయాడు. తన చూపు, తన ఏడుపు అతనికి అడ్డం వస్తాయనో ఏమో? శైలజ దుఃఖాన్ని ఎంత ఆపుకుందామనుకున్నా ఆపుకోలేకపోతోంది. హంటర్‌ని చెడ్డవాడుగా, మోసకారిగా నిరూపించడానికి తన మనసు ఎంత మాత్రం ఒప్పుకోవడంలేదు. ఎన్ని విధాలుగా చూసినా ఎక్కడో ఆంతర్యంలో, తన హృదయంలో, పవిత్రమైన ప్రేమస్థానంలో హంటర్ సుస్థిరంగా వుండిపోయాడు. హంటర్‌కు తప్ప ఇంక అన్యులకక్కడ స్థానం లేదు.

"హంటర్ నా హంటర్" శైలజ ఏడ్చి ఏడ్చి ఎప్పుడు నిద్రపోయిందో ఆమెకే తెలియదు.

రాత్రి పదకొండు కావస్తోంది. శైలజ బెడ్‌కి పక్కనే చిన్న టీపాయ్‌మీద వున్న ఫోను అదేపనిగా మోగడంతో తెలివి వచ్చి రిసీవరు తీసి చెవిదగ్గర పెట్టుకుంది.

"హలో ఎవరు మాట్లాడేది? డాక్టర్ శైలజయేనా? నేనూ డాక్టర్ వినోద్‌ని, ఇండియా నించి మాట్లాడుతున్నాను. ప్రయాణం అంతా బాగా జరిగిందా? దారిలో ఎక్కడా ఏమీ ఇబ్బంది పడలేదు కదా! ఇక్కడ మేమంతా బాగానే వున్నాం. హలో ఏంటి శైలజా మాట్లాడ్డం లేదేంటి? హలో వినపడుతోందా? హలో"

"ఆ... ఆ వినపడుతోంది. మాకిప్పుడు రాత్రి పదకొండు గంటలయింది. నిద్రలోంచి లేచాను అంతే. ప్రయాణం బాగానే జరిగింది. అంతా బాగానే వున్నాను. అక్కడంతా బావున్నారుకదా! మీరు ఫోనుచేసి లేపడం మంచిదయింది. నేనిప్పుడర్జంటుగా డ్యూటీ కెళ్ళాలి. ఆ ఇంకా ఏమిటి విశేషాలు? "

అవతలినుంచి ఏమీ జవాబు రాలేదు. "సరే మళ్ళీ చేద్దాంలే, ఓ.కే." అంది శైలజ. అవతలి నుండి వినోద్ ఓ.కే. అని ఫోను పెట్టేశాడు.

శైలజకెందుకో ఆ సమయంలో వినోద్‌తో మాట్లాడాలనిపించలేదు. అందుకే డ్యూటీ వుందని చెప్పి ఫోను పెట్టేసింది. మళ్ళీ మంచం ఎక్కి దుప్పటి ముసుగులో దూరబోతూంటే మళ్ళీ ఫోను మోగింది. ఈసారి హంటర్ కావచ్చునని గంపెడాశతో ఫోను దగ్గరకెళ్ళి రిసీవరు తీసి చెవిదగ్గర పెట్టుకొని "హలో" అంది.

ఈసారి ఫోను హాస్పిటల్‌నించి వచ్చింది. ఎవరో డాక్టరు శలవుమీద వెళ్ళారుట. శైలజకివాళ నైట్ డ్యూటీ, రేపు పగలు డ్యూటీ కూడా వున్నాయిట. వాళ్ళు కూడా శైలజకి ఫోను ఎప్పట్నుంచో ట్రై చేస్తుంటే ఇప్పటికి

వచ్చిందిట. వెంటనే వెహికిల్ పంపిస్తున్నాం బయలుదేరి రమ్మన్నారు. శైలజ సరేనని ఫోను పెట్టేసి లేచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళి వాష్‌బేసిన్‌లో మొహం కడుక్కుంటూ అద్దంలోకి చూసుకొంది. కళ్ల వాచిపోయివున్నాయి. మొహం కూడా ఉబ్బి వాచిపోయి వుంది.



తను హంటర్‌ను మర్చిపోగలదా?

హంటర్ అందరిలాంటివాడూ కాదు. అతనిలో ఏదో తెలియని ప్రత్యేకత వుంది.

ఇంతసేపూ శైలజ తన దురదృష్టానికి తను ఏడ్చుకుంటోంది. కాని హంటర్‌ని ఒక్క మాట కూడా అనలేకపోతోంది. హంటర్ మోసగాడు ఎన్నటికీ కాడు. కాలేడు కూడా. అతనిలో ఏ కోశానా ద్రోహబుద్ధి అనేదే లేదు. హంటర్ తనకు కాకుండా పోతే తను ఈ దేశంలో ఈ వెల్లింగ్టన్ హాస్పిటల్లో పని చేయగలదా? అసలిక్కడ వుండగలదా?

ఇండియాకి వెళ్ళి తన స్నేహితులందర్నీ చూసినప్పుడు వాళ్ళ జీవితాలకన్నా తన జీవితం వెయ్యిరెట్లు నయం అనుకుంది. వాళ్ళందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క కథ వుంది. వాళ్ళెవరికీ మనసులలో శాంతి వున్నట్లు లేదు. అందరూ బాగా చదువుకున్నవారే. అంతో ఇంతో సంపాదన ఉన్నవారే. అయినప్పటికీ కుటుంబ పరిస్థితులు బాగులేక సమస్యలవలన శిథిలమైన కుటుంబాలు కొందరివి. ఏ సమస్యాలేనివాళ్లు సృష్టించుకొని మరీ శిథిలావస్థకి వచ్చినవాళ్లు ఇంకొందరు. ఎన్ని చీకాకులున్నా, మనస్పర్థలున్నా తెల్లవారి లేచింది మొదలు రాత్రి పడుకునేవరకు కలిసి మెలసి పొత్తుగా వున్నట్లే నటిస్తారు. ఒకే ఇంటిలో వుంటూ ముసుగులో గుద్దులాటలాగా కొందరుంటారు. ఇలా ఎన్నో ఎన్నెన్నో తన స్నేహితుల గురించి అనుకొన్న తానే ఇవ్వాళ అడుసులో అడుగేసిందా? నలుగురికీ తెలిస్తే తనను గురించి ఏమనుకుంటారు. అందరిముందూ తను వల్లె వేసిన తన ఆదర్శాలు ఎంతవరకూ వచ్చాయి? తనకీనాడు ఇలాటి స్థితి ఏర్పడుతుందని ఊహించనే లేదు. కానయితే గుడ్డిలో మెల్లలాగ తను తన వాళ్ళందరికీ, తనీ న్యూజిలాండు దేశంలో ఎలా వున్నదో, ఏం చేస్తున్నదో, తన విషయాలు వాళ్ళందరికీ తను చెప్పేవరకూ తెలియవు. తను చెప్పకూడదు. వాళ్ళకి తెలియకూడదు. తను చెప్పదు. వాళ్ళకి తెలియదు. కాని... కాని చూస్తూ చూస్తూ తనకేం కాలేదు. తను ఇలాంటి పరిస్థితులకు తట్టుకోగలదని నిరూపించుకోగలదా. ఎన్నటికీ చేయలేదు. తనూ ఆడదే! ఎంత చదువుకొని విదేశాలకి వచ్చి ఉద్యోగం చేస్తే మాత్రం తనలోని స్త్రీత్వమెక్కడికి పోతుంది. తనకీ మనసుంది. కోరికలున్నాయి. ఎంతయినా హంటర్ తనవాడు.





తనతో ఇంత ప్రేమగా తిరిగిన హంటర్ మరో స్త్రీతో సంబంధం పెట్టుకొని అక్కడ ఆమెనీ ఇక్కడ తననూ ఒక్కలాగే చూస్తూ ప్రేమతో జీవితం గడపగలడా! ఒకవేళ అతనికి ఆసక్తి వున్నా తను మాత్రం హంటర్ మరో స్త్రీతో వుండడం చూడలేదు. హంటర్ తనవాడు. కేవలం తనకే చెందాలి. ముమ్మాటికీ తనకే చెందాలి.

శైలజ హాస్పిటల్ కి వచ్చి యాంత్రికంగా అలవాటు ప్రకారం అన్ని పనులూ చేసుకుపోతోంది. తన గురించి హాస్పిటల్లో వెనీసాకి తప్ప మిగతా స్టాఫ్‌కు ఏమీ తెలియక పోవచ్చు లేక తెలిసీ అడగడం లేదేమో.

ఇండియాలో అయితే అందరూ ఈపాటికి చెవులు కొరుక్కునేవారు. ఇక్కడ అలాక్కాదు. ఒకరి విషయంలో ఒకరు తలలు దూర్చరు. డాక్టర్లయితే హడావుడిగా వచ్చి ఎవరు డ్యూటీలు వాళ్లు చేసుకుపోతున్నారు కూడాను.

ఎవర్ని చూసినా డ్యూటీకి రాగానే మాత్రం ఒకసారి 'హాయ్ హౌ డూయూడూ' అని చిరునవ్వుతో అడిగేసి మళ్ళీ వాళ్ళ వాళ్ళ పనులలో నిమగ్నులయ్యేవారు. శైలజకి ఎవరి వ్యాపకాలు వాళ్ళవి అన్న ఈ పద్ధతి బాగా నచ్చింది.

అయినప్పటికీ హంటర్ రాకపోతే తను బ్రతుకలేదు. హంటర్‌ని చూడకుండా ఒక్క నిముషం కూడా తనకి గడవడం కష్టం. హంటర్‌తో కలిసి పనిచెయ్యాలి. హంటర్ తనకి ప్రపంచపు వింతల్ని చూపించాలి. హంటర్‌తో కలిసి భోంచెయ్యాలి. హంటర్ ఏదైనా కళ్లు తిప్పుకుంటూ కనుబొమలు ఎగురవేస్తూ మధ్య మధ్య తనని కొంటెగా చూస్తూ నవ్వుతూ మాట్లాడుతూంటే... శైలజ ఎన్నోసార్లు అనుకుంది. "హంటర్ ఇల్లాలిగా ఉంటే తన జీవితం ధన్యమైనట్లే" అని.

ఏపని చేస్తున్నా హంటరే జ్ఞాపకం వస్తున్నాడు. పోనీ హంటర్‌కి ఫియాన్సీ వుంటే

వుంది. అతనా అమ్మాయిని వివాహం చేసుకుంటే చేసుకున్నాడు. తను మాత్రం అతన్ని రోజుకొక్కసారైనా చూడాలి. హంటర్ సమ్మోహనకరమైన చిరునవ్వుని ఒక్కసారైనా చూసి తన్మయత్వం చెందాలి. హంటర్ తనని లాలించాలి, బుజ్జగించాలి. తన వద్ద రవ్వంతసేపే వున్నా తనే అతనికి సర్వస్వం అనే భ్రమలో ముంచెత్తాలి. హంటర్ నేను, నేను దిక్కులేని దాన్నయిపోయాను. నాకెవరూ లేరు. నేనసలు బతికుండగా నిన్ను చూస్తానో లేదో? "

క్షణక్షణానికీ శైలజకి ఏదో తెలియని భయం, బెంగ ఆవరిస్తున్నాయి. తను విపరీతంగా నీరసపడిపోతోంది. ఎన్నో రోజులు ఉపవాసం చేసినట్లు ముఖం పీక్కుపోయి వుంది. ఏదైనా తిందామంటే గొంతు దిగడంలేదు. తాగుదామన్నా అంతే. పచ్చి మంచినీళ్లన్నా ముట్టాలనిపించడంలేదు.

శైలజకి కళ్లు తిరిగి హాస్పిటల్లోనే పడిపోయింది.

శైలజ అతినీరసంగా ఎంతో కష్టంతో కనులు తెరచి చుట్టూ కలియజూచింది. అది తన ఇంట్లో తన గదిలా అనిపించలేదు. అంతా మసకమసకగా కన్పిస్తోంది. డాక్టర్లు, నర్సులు డ్యూటీల హడావుడిలో అటూ ఇటూ తిరుగుతున్నారు. తన దగ్గర డ్యూటీలో వున్న నర్సు కొద్దిగా కళ్లు తెరవడం చూసి, "డాక్టర్, డాక్టర్ పేషెంటుకి స్పృహ వచ్చింది. మీరు చెప్పిన ఇంజక్షన్ ఇయ్యనా? వద్దా? " అంది.

"వద్దు నేను వచ్చి చూసి అవసరమైతే ఇస్తాను. వస్తున్నాను పద" ఏవేవో కంఠస్వరాలు ఎక్కడినుంచో విన్పిస్తున్నాయి. అవి కొన్ని తనకి బాగా పరిచయమైనవిలాగానే వున్నాయి. అంటే తను హాస్పిటల్లో బెడ్ మీద వుందన్నమాట. తనకేమయింది? "

ఎవరో డాక్టరు వచ్చి తనకి బి.పి. చూసి చేయిపట్టుకొని నాడి చూసి నర్సు తెచ్చిన సిరెంజితో ఒక ఇంజక్షను ఇచ్చి వెళ్ళిపోయాడు. తన దగ్గిర ఒక నర్సు కూర్చున్నట్లుంది. ఆమె ఏదో అప్పుడప్పుడు ఏదో నోట్ చేసుకుంటోంది. ఇవన్నీ లీలగా శైలజకి అనుభవంలోకి వచ్చాయి.

కొంచెంసేపు గడిచాక శైలజకి బాగా నిద్ర పట్టేసింది. అలా నిద్రపోయిన శైలజ మర్నాడు పొద్దున్న బ్రేక్‌ఫాస్టు టైమ్‌వరకూ లేవనేలేదు. నర్సు వచ్చి లేపి టెంపరేచరు చూసి, ఏమీ లేదని నిర్ధారణ అయ్యాక అంది.

"డాక్టర్! మీరు లేచి నడిచి వెళ్ళి బాత్‌రూమ్‌లో ముఖం కడుగుకుంటారా లేకపోతే నేనే ఇక్కడికి అన్నీ తెచ్చి హెల్ప్ చేయమంటారా? "

"ఒద్దు ఒద్దు. ఆమెని లేపి డిస్టర్బ్ చెయ్యవద్దు. నర్స్ నీవెళ్ళి బ్రెక్‌ఫాస్టు తీసుకో. ఆమెకేం కావాలో నేను చూస్తాను"

"నాకేం కావాలో చూస్తానని ఎవరు అంటున్నారు. ఈజిట్ మై హంటర్- హంటర్ నా ప్రాణమా..." అనుకుంటూ లేవబోయి మళ్ళీ శైలజ నీర్సంతో మంచం మీద పడిపోయింది.

హంటర్ శైలజ మంచంమీదే ఆమెకి దగ్గరగా కూర్చుని ఆమెని పొదివిపట్టుకొని "శైలూ మై డార్లింగ్ ఐ మిస్‌డ్ యూ, ఐ మిస్‌డు యూ హనీ ఆల్ దీస్ డేస్" అంటూ ఆమె నుదిటిమీదా, కనులమీదా, బుగ్గల మీదా ముద్దుల వర్షం కురిపించాడు. ఆ ఆత్మీయతకీ, ఆ ఆప్యాయతకీ శైలజకి దుఃఖం పొంగిపొర్లుకొచ్చింది.

"హంటర్ నన్నొదిలి నువ్వెక్కడికీ వెళ్ళకు. నువ్వు వేరే అమ్మాయిని పెళ్లి చేసుకొని వెళ్ళిపోవాలనుకుంటే నాకిప్పుడే ఈ మందులలో ఇంత విషాన్ని కలిపి ఇయ్యి. ఆనందంగా ప్రాణం వదులుతాను" శైలజ అంత నీర్సంలోనూ అస్పష్టంగా ఏవో అంటూనే వుంది.

హంటర్ ఆమెకి సేవలు చెయ్యడంతో

శైలజ త్వరగానే కోలుకుంది. కాని హంటర్ ఇదివరకటి తన హంటర్‌లా లేడు.

హంటర్ కూడా జబ్బుపడినవాడిలా చాలా చిక్కిపోయాడు. అమెరికానించి వచ్చిన హంటర్ ఏమంత సంతోషంగాను, హుషారుగాను కూడా లేడు. దానికితోడు శైలజ పరిస్థితి అతనిని కంగారు పెట్టింది.

శైలజ వేగంగానే కోలుకుందికాని, హంటర్‌ని ఇప్పుడేదైనా మాట అడిగి సాధిస్తే తనకు కాకుండా, మళ్ళీ ఏం చెప్పకుండా ఎటో వెళ్ళిపోతాడేమోనన్న భయంతో ఏమీ అడగలేక ఊరుకుంది. కాని మనసులో మాత్రం హంటర్ ఫియాన్సీ మెదులుతూం డడంవలన ఎంత దాచుకుందామనుకున్నా దాగక కళ్ళమ్మట నీళ్ళు ధారలుగా కారుతూనే వున్నాయి. హంటర్ కూడా ఒకటి రెండుసార్లు శైలజ చాటుగా కళ్ళు తుడుచుకోవడం గమనించకపోలేదు.

శైలజ పూర్తిగా కోలుకుంది. అయినా హంటర్ తనింకా చాలా వీక్‌గా వున్నప్పటికీ వేళతప్పకుండా శైలజకి సేవలు చేసి మరీ హాస్పిటల్‌కి వెళ్ళివస్తున్నాడు. ఇప్పుడు చక్కగా పథ్యం అదీ తీసుకొని అటూ ఇటూ పచార్లు చేయగల్గుతోంది. హంటర్ తన దగ్గరే వుండి తనకి ఎన్ని సేవలు చేస్తున్నా వెనీసా చెప్పిన మాటలు పదేపదే మెదడులో పీడిస్తున్నాయి. హంటర్ పెళ్ళి చేసుకొని వచ్చేసేడేమో! ఆ అమ్మాయి అమెరికాలోనే వుండి చదువుకుంటూ అక్కడే ఉద్యోగం చేసుకుంటుందో ఏమో! ఒకవేళ తను హంటర్‌ను ఏ మాటన్నా అడిగి కదిపితే ఎలాంటి చేదునిజం వినాల్సివస్తుందోనని శైలజ మథనపడసాగింది.

అయినా అమెరికా వెళ్ళిన హంటర్ అంతలా పాలిపోయి, సన్నగా అయిపోయి వచ్చాడేమిటి? పోనీ హంటర్ ఆరోగ్యం గురించి కనుక్కుందామనుకొన్నా అతను ఏం చెపుతాడో ఏమో!

ఏది ఏమన్నా జరగనీ తనకింత సేవలు చేసి తనని ఒడ్డుకు చేర్చాడు. అతని ఆరోగ్యం గురించి తనూ తెలుసుకోవాలి. అందుకనే ఒక ఏకాంతంలో శైలజ ధైర్యం చేసి హంటర్‌ని అదే ప్రశ్న వేసింది.

హంటర్ చిరునవ్వు నవ్వాడు. అదే చిరునవ్వు. సర్వసమ్మోహనకరమైన నవ్వు. ఆ నవ్వులు చిందిస్తున్న హంటర్ ముఖం చూస్తూ ఎన్ని జన్మలైనా తను తన్మయత్వంతో అలా వుండిపోగలదు.

కాని శైలజ ముఖంలో ఈసారి ఆనందానికి బదులు భయం ఆవరించింది. ఏం వినాలోనని.

"శైలూ అమెరికా వెళ్ళాక నాకూ అక్కడ ఫ్లూవైరల్ ఫీవర్ వచ్చింది. టెంపరేచరు కూడా వుంది. సుమారు పది పదిహేను రోజులైనా జ్వరం నన్నొదిలి పెట్టలేదు. చాలా ఇబ్బంది పడ్డాను. ఆ జ్వర తీవ్రతలో ఎంత నీరసం అయిపోయానంటే చేతితో గ్లాసుని కూడా పట్టుకోలేకపోయేవాడిని.

డాక్టర్ మైక్ దగ్గరుండి సేవలు చేయకపోతే నేను న్యూజిలాండుకు తిరిగి ఇలా రాగలిగేవాడ్నే కాదు" అన్నాడు హంటర్.

"అయ్యో అంత జబ్బు పడ్డారా? డాక్టర్ మైక్ సేవలు చేసేడా? అక్కడ మీకింకెవరూ లేనేలేరా? అయ్యో నేనైనా వుండి వుండాల్సింది" అంది శైలజ ఓదారుస్తున్నట్లుగా.

శైలూ నేను రెండుసార్లు నీకు ఫోన్లు చేయించాను. రెండు సార్లూ నువ్వింకా ఇండియా నుంచి ఇంకా రాలేదన్నారు. ఇండియాలో నువ్వెక్కడున్నదీ ఫోను నంబరు మనవాళ్ళకు తెలియదుట. డాక్టర్ మైక్ నాకు చాలా రోజులు శలవు వుంది కనుక అక్కడే రెస్టు తీసుకుని బయలుదేరమన్నాడు. అందుకే న్యూజిలాండుకి నా రాక ఆలస్యమయింది.





శైలజకి కావాల్సిన సమాధానం రాలేదు. హంటర్ కావాలని ఆ విషయాన్ని పక్కకి నెట్టి తనతో ఇలా మాట్లాడుతున్నాడేమో నన్న అనుమానం కలిగింది. కాని హంట ర్ని చూస్తే మనిషి ఎంత జ్వరతీవ్రతలో పడ్డాడోనని శైలజ చాలా విచారించింది.

హంటర్ హాస్పిటల్‌నించి శైలజ వద్దకు వస్తూ ఆమెకు వచ్చిన ఉత్తరాలను తెచ్చి చ్చాడు.

"చూశావా శైలూ నీకెన్ని ఉత్తరాలు తీసు కొచ్చేనో, ఇవేవో మంచి వార్తలను మోసుకొ చ్చినట్లున్నాయి. శుభలేఖలు కూడా వున్న ట్లున్నాయి" అన్నాడు నవ్వుతూ.

శైలజ ఆత్రంగా అతని వద్దనుంచి ఉత్త రాల్ని లాక్కుంది. హంటర్ చెప్పినట్లు ఆమె మొదటగా చింపిన కవరు లోంచి పెళ్ళి శుభలేఖ తొంగిచూసింది. ఎవరికి 'పెళ్ళి' చెప్మా అని అనుకుంటూ కవరు చించి చూసింది. డాక్టర్ మహేశ్ శుభలేఖతో పాటు కవరులో ఒక ఉత్తరం కూడా రాసి పెట్టాడు. శైలజ ఆత్రంగా ఉత్తరం తీసి చద వసాగింది. హంటర్ శైలజ ఎదురుగా కూర్చుని ఆమెనే తిలకిస్తున్నాడు.

డియర్ శైలజగారూ,

ఇచ్చట మేమంతా క్షేమం. అచ్చట మీరంతా క్షేమమనుకుంటాను. మనం ఆరోజు హాస్పిటల్లో డాక్టర్ మాధురిగారుం డగా కలుసుకున్నాం. గుర్తుందనుకుంటాను. మాటల సందర్భంలో వివాహాల ప్రసక్తి వచ్చింది. కాని ఆరోజు నేను నాక్కాబోయే భార్య గురించి మీకు డీటైల్స్ ఇవ్వలేకపో యాను. అదీగాక నేను మీ ఇద్దరితో ఎక్కు వగా మాట్లాడలేకపోయాను. ఆ సమ యంలో నా కోసం ఎవరో రావడంవలన నేను అర్జంటుగా వెళ్ళిపోయాను. తర్వాత నేను డాక్టర్ మాధురికి ఫోన్ చేస్తే మీరు న్యూజిలాండుకి వెళ్ళిపోయారని తెల్సింది. నాక్కాబోయే శ్రీమతి పేరు రూపాదేవి. తను కూడా ఢిల్లీ మెడికల్ కాలేజీలో మెడి సిన్ చేసింది. ఆమధ్య ఢిల్లీలో ఇంటర్నేష నల్ మెడికల్ కాన్ఫరెన్సు అయింది. దానికి నేనూ మన మాధురిగారూ కూడా అటెం డయ్యాం. డాక్టర్ రూపాదేవితో నా పరి చయం ఢిల్లీలోనే. మన మాధురిగారు డాక్టర్ రూపాదేవి అన్నివిధాలా నాకు తగిన అమ్మాయి అని సర్టిఫై చేశారు. మా పెళ్ళికి మీరు తప్పక రావాలి. బైదిబై మాధురిగారు మీ గురించి నాకొక శుభవార్త చెప్పారు. అదే నిజమైతే మీ వివాహం కూడా ఇండి యాకి వచ్చి చేసుకుంటే మన రెండు పెళ్ళి ళ్లకి మన ఫ్రెండ్సందరూ వచ్చి ఆనందించి ఆనందింపచేస్తారుకదా! త్వరగా రండి! ఆలో చించండి. ఇట్లు మీ శ్రేయోభిలాషి.

- మహేశ్

ఉత్తరం చదువుతున్నంతసేపూ శైలజ ముఖంలోని చిరునవ్వుని చూసి హంటర్ అదేదో మంచి ఉత్తరమేలే అనుకున్నాడు. శైలజ ఉత్తరం చదవడం పూర్తిచేశాక హంట ర్‌కి డాక్టర్ మహేశ్ గురించి అతని పెళ్ళి గురించీ అంతా వివరంగా చెప్పింది. అప్పుడే తన ఫ్రెండు డాక్టర్ మాధురి గురించి కొంతా, డాక్టర్ రూపాదేవి గురించి కొంతా చెప్పింది. హంటర్ ఆమె చెప్పిన వన్నీ ఆసక్తిగా విన్నాడు. అతని ముందే రెండో ఉత్తరం విప్పి చదవసాగింది శైలజ.

శైలజ చదువుతున్న రెండో ఉత్తరం ఆమె స్నేహితురాలు వినూత్న దగ్గర్నుండి వచ్చింది. సాగర్ ఇప్పుడు చాలా మారిపో యాడుట. నాగాలు పెట్టకుండా వినూత్న దగ్గరికి రావాల్సిన 15 రోజులూ ఖచ్చితంగా వచ్చివుంటున్నాడుట. వినూత్నని ఇప్పుడు ఎంతో ప్రేమగా చూసుకుంటున్నాడుట. తల్లిని కూడా ఎంతో గౌరవంతో ప్రేమతో చూసుకుంటున్నాడుట. వినూత్న అత్తగారు శైలజని మరీ మరీ అడిగినట్లు వ్రాయమన్నా



రుట. శైలజ పెళ్ళి ఎప్పుడు, ఎవరితో, ఎక్కడ జరుగుతుందో రాయమంది. కనీసం కార్డయినా పంపమంది.

శైలజ డాక్టర్ వినూత్న గురించి కూడా హంటర్‌తో అన్ని విషయాలూ చెప్పింది. శైలజ తన పెళ్ళి గురించి వినూత్న రాయమంది అని కూడా హంటర్‌తో చెప్పింది. హంటర్ అన్నీ వింటున్నాడేకాని ఎక్కడా ఏ విషయంమీద కామెంటు చేయడంలేదు.

ఇంక మూడవ ఉత్తరం విప్పుతూనే శైలజ మొహం అదోలా పెట్టేసింది. అది డాక్టర్ వినోద్ దగ్గర్నుంచి వచ్చింది. హంటర్ ముందు చదవనా వద్దా అని తటపటాయించి ఉత్తరాన్ని మడిచి మళ్ళీ లోపల పెట్టేయబోయింది.

హంటర్ అడిగాడు, "ఏమైంది శైలజా? "

"ఇంకా పూర్తిగా చదవలేదు హంటర్. చదివి చెప్తానుండు" అంది శైలజ.

హంటర్ లేచి "ఇప్పుడే వస్తానుండు" అంటూ బయటికి వెళ్ళబోయాడు.

"హంటర్ కూర్చో నేను ఉత్తరాలు తర్వాత చదువుతాను. తొందరలేదు. ఇంక వీటిల్లో ఏమంత ముఖ్యమైన విషయాలు లేవు. రా హంటర్" అంది శైలజ.

కాని హంటర్ ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా "నేనింటికి అర్జంటుగా వెళ్ళాలి. మళ్ళీ వస్తాను" అని బయటికి వచ్చి కారులో కూర్చుని స్టార్టు చేశాడు.

అవాక్కయిన శైలజ గత్యంతరం లేక అతనికి చేయూపి బైబై చెప్పింది. లోపలికొచ్చి కుర్చీలో కూలబడిపోయింది.

హంటర్ ఎందుకలా హఠాత్తుగా వెళ్ళిపోయాడు. తను కాని ఉత్తరాలు చదువుకుంటూ అతని వునికిని నిర్లక్ష్యం చేసిందా? లేక ఇంటి దగ్గర అతనేదైనా అర్జంటు ఫోను కాల్ వస్తుందని వెళ్ళిపోయాడా? లేక తనకి ప్రైవసీ ఇద్దామని వెళ్ళిపోయాడా?

శైలజకి ఇంక మిగతా ఉత్తరాలు చదవ బుద్ధి కాలేదు. కాని హంటర్ వచ్చేలోపునే చదివి తనేం చెయ్యాలో, ఆ ఉత్తరాలకి ఏం జవాబులివ్వాలో నిర్ణయించుకోవాలని మళ్ళీ వినోద్ ఉత్తరం తీసి చదవసాగింది-

"డియర్ శైలజా- నిన్నిలా సంబోధించానని ఏమీ అనుకోవద్దు. నా మిత్రవర్గంలోని ఆత్మీయురాలివి నువ్వు- ఆ గౌరవంతోనే ఇలా సంబోధించడానికి సాహసించాను.

నా భార్య పోవడం మా కుటుంబంలోనే ఒక పెద్ద గొడ్డలిపెట్టు. ముఖ్యంగా ఉద్యోగం చేయకుండా ఇంట్లోనే వుంటూ, ప్రతీ క్షణం ఏదో పనిమీద కోడల్ని పిలుస్తూండే మా అమ్మకు కుడిభుజం పడిపోయినట్లయింది. దానికితోడు పసివాడు రామం తల్లిలేని వాడు కావడం, నాకూ వాడికీ కూడా తానే తల్లి అయి ఈ వయసులో సముదాయించవలసిరావడంచేత మా అమ్మకి నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటే బావుణ్ణనిపించింది. దానికితోడు నీ రాక అమ్మకి చిన్న ఆశాజ్యోతిలా అనిపించింది. అదీగాక నువ్వు రామాన్ని ప్రేమగా చూస్తున్నావని విని వాడికి నువ్వంటే తల్లి ప్రేమకి లోటుండదని భావించి నన్ను నీతో వివాహ ప్రసక్తి తెచ్చి సంప్రదించమని కోరింది. అయితే నీ భావాలూ, ఆశయాలూ వేరు. నీ స్వభావానికి మాలాంటి ఇళ్ళల్లో జీవించడం కష్టం అని నేనప్పుడే అనుకున్నా. అయినా అమ్మ పోరుమీద ఆ అభిప్రాయాన్ని నీ ముందు పెట్టాల్సివచ్చింది. నేనేవిధంగానైనా నీ మనసు గాయపరిస్తే నన్ను క్షమించవలెను.

"మొన్న ఈమధ్య అమ్మకి అనుకోకుండా సడన్‌గా చాలా జబ్బు చేసింది. మనవణ్ణి చూడాలని ఆరాటపడింది. నేను మా మావగారికి ఇక్కడి పరిస్థితిని వివరిస్తూ, నాకు శలవు కూడా లేదు కనుక, అమ్మని చూసు

కునేందుకు వీలుగా అత్తగారిని కాని, పద్మని కాని రామంతో సహా పంపించమని రాశాను. వెంటనే అందరూ వచ్చి అమ్మని చూసి వెళ్ళారు. పద్మ మాత్రం రామంతో సహా ఇక్కడే వుండిపోయింది.

"పద్మని, పద్మ కలుపుకోరుతనాన్నీ అమ్మకి పద్మ చేసే సేవని చూశాక నాకే ఆశ్చర్యం వేసింది. పద్మ ఈ ఇంటిలో ఇంత చాకిరీ ఎందుకు చేస్తోంది. అసలెందుకు చెయ్యాలి? రామం కూడా పిన్నిని వదిలి ఒక్కక్షణం వుండలేడు. అమ్మ అంత జ్వరంలోనూ పద్మ సహనాన్ని మెచ్చుకో కుండా వుండలేకపోయింది. ఒకరోజు పద్మ దగ్గిర లేనప్పుడు నన్ను పిలిచి "ఒరేయ్ వినోద్ పద్మ మనకేమవుతుందని పాపం ఆ పిల్లచేత ఈ చాకిరీ అంతా చేయించుకుం టున్నాం. నువ్వు కాని ఆ మూడు ముళ్ళూ వేసేస్తే పద్మ మనింట్లో మన మనిషైపో తుంది. మన కంట్లో కనుపాప అవుతుంది. రామానికి శాశ్వతంగా అమ్మ అయిపో తుంది. ఆలోచించి వాళ్ళ నాన్నగారికి కబు రెట్టు అంది. నేనూ ఇంచుమించు అదే ఆలోచనలో ఉన్నాను. కనుక అమ్మ సల హాని కాదనలేదు. అయితే అమ్మ కూడా నా మనసుని పసికట్టే చెప్పింది కనుక నా మౌనానికి ఆశ్చర్యపోలేదు.

మొన్న రెండ్రోజుల క్రితం మాధురిని కలిసినప్పుడు నీ గురించి శుభవార్త చెప్పింది. చాలా సంతోషం. త్వరలో నీ దగ్గర్నుంచి శుభలేఖకై ఎదురుచూ స్తూంటాం. నేను బహుశః మీకందరికీ శుభలేఖల్ని పంపకపోవచ్చు ఎలా లేదన్నా నేను రెండోపెళ్లి వాణ్ణికదా! నీక్కాబోయే భర్తగారికి మా అందరి శుభాకాంక్షలు అంద జేయి.

"బహుశా ఈ నెలాఖరున కాని వచ్చే నెలాఖరున కాని మన మాధురి వద్దనుండి కూడ శుభవార్తని వినవచ్చును. త్వరలో నీ శుభాకాంక్షలతో ఉత్తరం వ్రాస్తావని ఆశిస్తు న్నాను.

ఇట్లు నీ శ్రేయోభిలాషి

వినోద్"

ఉత్తరం సాంతం చదివిన శైలజ 'హమ్మయ్య' అని ఎంతో ఫ్రీగా ఊపిరి పీల్చు కుంది. వినోద్ పద్మని పెళ్లి చేసుకుంటు న్నాడు. నిజానికి పద్మే అతనికి తగిన పిల్ల. ఇల్లూ, భర్తా, సంసారం అంతా అన్ని విధాలా చక్కగా సరిదిద్దుకోగలదు. పద్మని కూడా అభినందిస్తూ తను ఆమెకి వేరే ఉత్తరం, గ్రీటింగ్స్ పంపాలి' అనుకుంది.

ఇంక నాలుగో ఉత్తరం డాక్టర్ గాయత్రి వద్దనుండి వచ్చింది. ఈ ఉత్తరం నిజంగా తనకి సర్ప్రైజే.

గాయత్రి న్యూజిలాండులోనే ఆక్లాండ్‌లో వుంటున్నదట. తన భర్త కూడా ఆక్లాండ్ లోనే డాక్టరుట. తనకిద్దరు పిల్లలు. ఒక కూతురూ, ఒక కొడుకూను. తనూ, భర్తా, పిల్లలూ అంతా కలిసి ఇండియాకి శలవుల్లో వచ్చారు. తనూ పిల్లలూ కొన్నాళ్లు అమ్మా వాళ్లతో కాకినాడలో గడిపి తర్వాత అతని దగ్గరికి హైదరాబాదు వెళ్లి కొన్నాళ్లుండి, చివరికి అంతా కలిసి విశాఖపట్నం వెళ్ళి బంధుమిత్రాదులను దర్శించుకొని వస్తుం దిట. ఇండియా రోజురోజుకు మారిపో తోంది. జనాభా ఎక్కువై రోడ్లమీద నడవడా నికి కూడా ఇబ్బందిగా వుంటోంది. వాతావ రణం, నీరు మార్పువలన అందరికీ ఒళ్లల్లో నలతలు చేశాయి. మూడొంతులు మాధురి పెళ్లికి వుండి చూసి వద్దామనుకుంటోంది. శైలజ ఎడ్రసూ వివరాలూ, ఎలా దొరికాయో, ఎవరిచ్చారో అన్నీ తర్వాత తనని కలిసిన ప్పుడు చెప్తుందిట.

"శైలజా నిన్ను చూడాలని వుంది ఇట్లు నీ ప్రియతమ గాయత్రి" అంటూ ముగించింది

ఉత్తరాన్ని.

గాయత్రి చదువుకునే రోజుల్లో కూడా సరదాగా, ఆనందంగా వుండేది.

నిజానికి ఇవ్వాళ శైలజ కొచ్చిన ఉత్తరాలన్నీ సంతోషకరమైన వార్తలున్నవే. వినోద్ రాసిన ఉత్తరంలో వినోద్ పేరు చూడగానే అందునా హంటరుముందు ముఖం ముకుళించుకునిపోయింది. కాని, ఉత్తరం సాంతం చదివాక అదీ సంతోషాన్నే మోసుకొచ్చిందని తెలుసుకొందికి ఆట్టేసేపు పట్టలేదు.

"గాయత్రి అయితే ఆక్లాండ్‌లోనే వుందన్న మాట. కాని హంటరూ తనూ ఆక్లాండ్ వెళ్ళినప్పుడు వాళ్ళకెక్కడా గాయత్రీ కుటుంబం తారసపడలేదు. ఈసారి శలవలు వచ్చినప్పుడు గాయత్రీ వాళ్లూ ఇండియానుండి వచ్చేక తాము ఆక్లాండ్ వెళ్ళి వాళ్లని చూడాలి" అనుకుంది మనసులో.

తన స్నేహితులందరూ ఏదోవిధంగా సెటిల్ అయిపోతున్నారు. తనే ఇంకా తాడులేని బొంగరంలా మిగిలిపోయింది. హంటర్ అసలు తనని వివాహం చేసుకుంటాడో లేదో! లేక ముందే తనకి వివాహం అయిందని చెప్తాడో ఏమో! శైలజ మళ్ళీ విచారంలో మునిగిపోయింది.

శైలజ మళ్ళీ ఇప్పుడు రెగ్యులర్‌గా హాస్పిటల్‌కు వెళ్ళడం మొదలుపెట్టింది. తనూ హంటర్ మిగతా డాక్టర్లలాగ తమ తమ విధ్యుక్తధర్మ నిర్వహణలో నిమగ్నులయిపోయారు. హంటర్ నెమ్మది నెమ్మదిగా పూర్వంలాగా అవుతున్నాడు. అతను ఒక్క క్షణం కనుచాటు అయితే ఎవరేనా ఎత్తుకుపోతారేమోనన్నంత ఇదిగా వదలకుండా వుంది శైలజ.

చాలారోజుల తర్వాత ఒకనాడు శైలజకి వెనీసాకి ఏకాంతం లభించింది. "హంటర్ పెళ్లిచేసుకొని వచ్చేడా?" అని అడిగింది శైలజ.

వెనీసా ఆశ్చర్యంగా శైలజ మొహంలోకి చూసింది.

శైలజ మళ్ళీ అదే ప్రశ్న వెనీసాని అడిగింది.

"మీరిద్దరూ రోజూ కలుస్తూనే వున్నారు కదా! నువ్వు హంటర్‌ను అడగనేలేదా?" అంది.

"లేదు"

"ఏం ఎందుకని?"

"అడుగుతే హంటర్ ఏం జవాబు చెబుతాడోనని భయపడ్డాను" అంది శైలజ.

"ఆ అమ్మాయి అమెరికాని వదిలిరానన్నదని నీకిదివరకే చెప్పానుకదా?"

"అవును"

"ఆ అమ్మాయి అమెరికాలోనే ఒక అమెరికా' అబ్బాయిని ప్రేమించిందిట. బహుశా అతనినే వివాహం చేసుకుంటుందిట. హంటర్‌ని చేసుకోదు. హంటర్ కూడా ఆమెని చేసుకుందామని అనుకోవడం లేదనుకుంటాను" అంది వెనీసా.

ఈ మాటలు విన్న శైలజకి తను లోగడ పోగొట్టుకొన్న శక్తి నంతటినీ ఒక్కసారి మళ్ళీ పుంజుకొన్నట్లు ఎగిరి గంతేసి "వెనీసా ఈ విషయం నాకప్పుడే ఎందుకు చెప్పలేదు. ఇన్నాళ్ళూ నేనెంత మానసిక వ్యధతో కుంగిపోయానో తెలుసా? అయితే హంటర్ నావాడే. సంపూర్ణంగా నావాడే. ఇందులో ఇంక సందేహంలేదు. వెనీసా ఎన్నాళ్లకి ఇంత మంచిమాట చెప్పావు" అంటూ వెనీసాని కౌగిలించేసుకుంది.

వెనీసా శైలజలోని ఉప్పొంగి పొర్లుతున్న ఆనందాన్ని మొహంలో చూస్తూనూ ఆనందించసాగింది.

ఆ సాయంత్రం ఇంటికి రాగానే తను ఎంతో ధైర్యంగా హంటర్‌ని వేసిన ప్రశ్న.





"హంటర్ నీకొక ఫియాన్సీ వుందిటకదా! నువ్వామెను పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నావుటకదా!"

హంటరు కొంటెగా నవ్వుతూ "అవున" న్నాడు.

ఆ జవాబుకి శైలజ కంగారుగా తడబడింది. తర్వాత కొంచెం తట్టుకొని "ఆ అమ్మాయి ఎవరో చెప్పవూ? " అంది.

"ఆ ఇవ్వాళ ఎలాగైనా చెప్దాం అనుకుంటున్నాను శైలూ. ఇంకోగంటలో మా ఫ్రెండ్సు కొందరు వస్తున్నారు. అప్పుడు వాళ్లందరికీ నా ఫియాన్సీని చూపించి పెళ్ళి రోజు నిర్ణయిస్తాం" అన్నాడు హంటర్.

"అయితే నీకింకా పెళ్ళి కాలేదా? " శైలజ అతని కళ్లల్లో ఏదో వెతుకుతూ జవాబు కోసం ఆత్రంగా చూసింది.

"అబ్బే ఎక్కడ? నా ఫియాన్సీ పెర్మిషను తీసుకున్నాకేకదా. పెళ్ళిరోజు నిశ్చయించడం జరుగుతుంది. మొన్న నువ్వు ఉత్తరాలు చదువుకుంటున్నప్పుడు నేను ఫోనుకాల్ రిసీవ్ చేసుకోడానికి ఇంటికెళ్ళిపోయాను గుర్తుందా? "

"ఆ అవును, గుర్తుంది. ఆ ఫోన్‌కాల్ నీ ఫియాన్సీ దగ్గర్నుంచేనా? " ఆతృతతో అడిగింది.

హంటర్ ఆమె మనోభావాల్ని ఇట్టే చదివేశాడు. వెనీసా చెప్పిన మాటలవలన శైలజ ఈ పరిస్థితికి వచ్చిందని తనకి బాగా తెలుసు. శైలజకి తనమీద నిజంగా ఎంత ప్రేముందో తెలుసుకోవడానికి ఈ పద్ధతే నిజంగా అనువైంది.

"కాదనుకో కాని ఇన్ఫర్మేషను ఆమె గురించే" అన్నాడు హంటరు ఎటో చూస్తూ.

"హంటర్ ఆమె ఎలా వుంటుంది. నాకన్నా అందంగా వుంటుందా? తను కూడా మెడిసిన్ చేసి ప్రాక్టీసు చేస్తోందా? "

"ఇదివరకు చాలా అందంగా వుండేది. ఈమధ్యేదో నేను దగ్గర్లేనని నామీది బెంగతో జబ్బు పడిందిట. కొంచెం మొఖం పాలిపోయివుంది. కాని ఫరవాలేదు. మళ్లీ కోలుకుంటుందిలే" అన్నాడు నవ్వుతూ శైలజ కళ్ళల్లోకి చూస్తూ.

"ఉద్యోగమంటావా? ప్రస్తుతం ఆమె డాక్టరుగా పనిచేస్తోంది" అన్నాడు మళ్లీ.

శైలజ ముఖం మాడ్చుకుంది. వెనీసా తనతో చెప్పిన మాటలు నిజం కావా? హంటర్ కూడా అందరు న్యూజిలాండర్సు లాంటి వాడేనా? తానేదో తన కోసమే హంటర్ జన్మించినంత స్పెషల్‌గా భావించింది. అతనితో తన జీవితాన్ని ముడిపెట్టుకుంది. అందులో మరొకరి ప్రవేశాన్ని తను సహించలేదు. కాని, కాని, హంటర్ ఏమిటి ఇలా మాట్లాడుతున్నాడు.

అసలు హంటరు ఉద్దేశమేమిటి? ఒక పక్క తానే సర్వస్వం అన్నట్లు ప్రేమనంతా ఒలకబోస్తున్నాడు. ఇంకొకపక్క ఫియాన్సీ, ఫియాన్సీ అంటున్నాడు. ఇతన్ని నమ్మాలా వద్దా?

హంటర్ తనని కాదంటే తను బ్రతకలేదు. శైలజ కళ్ళల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

"హంటర్ నీకొక ఫియాన్సీ వుండి ఆమెను నువ్వు పెళ్లి చేసుకోబోతూ నాతో ఎందుకంత చొరవగా, చనువుగా తిరిగావు. నన్నెందుకు అలా చేశావు ఆవేళ? " శైలజ వుండబట్టలేకపోతోంది. కంఠం గద్గదికం అయిపోతోంది. స్వరం మెల్లిగా ఏడుపులోకి దిగింది.

"నిన్ను నిన్ను నేనేం చేశాను శైలూ. ఎందుకా కన్నీరు? " హంటర్ లేచి ఆమెకి దగ్గరగా వచ్చి ఆమెని తన హృదయానికి దగ్గరగా, గట్టిగా లాక్కొని హత్తుకున్నాడు. శైలూ నేనేం చేసినా నీకిష్టమనుకొనే





చేశాను. ఏం చెప్పు. నిజంగా నీ కిష్టం లేదా? " రహస్యం మాట్లాడినట్లే మాట్లాడు తున్నాడు హంటర్. ఆమెనలా పొదివి పట్టుకునే వున్నాడు.

శైలజ మాట్లాడలేదు. తలెత్తి అతనిని చూడలేకపోతోంది. కళ్ళమ్మట నీరు ఏకధారగా కారిపోతోంది. ఆమెలో స్త్రీ సహజమయిన భావాలు పెల్లుబికి ఘస్తున్నాయి.

"అయితే హంటర్ నీ పెళ్లి అయిపోతే నన్ను మర్చిపోతావా? " అడగలేక అడగలేక అడిగింది శైలజ.

"అదేమిటి శైలూ అలా అంటావు? మనం ఎప్పటికీ ఇలాగే సన్నిహితంగా వుంటాం. మన ప్రేమని ఎవ్వరూ కాదనలేరు. నువ్వెప్పుడూ నా హృదయంలోనే వుంటావు. సరేనా చూడు- ఏదీ ఇటు చూడు, నావైపు చూడాలి మరి" అంటూ హంటర్ ఆమెని ఇంకా దగ్గరగా అదిమి పట్టుకొని ఆమె ముఖంమీదా, కనులమీదా ముద్దుల వర్షం కురిపించాడు.

శైలూ ఇంక త్వరగా తెములు. మా ఫ్రెండ్సు అందరూ వచ్చేస్తారు. ఇవ్వాళ మనందరికీ డిన్నర్ అక్కడే. నేను టేక్ అవే ఫుడ్‌కి చెప్పివచ్చాను. డబ్బంతా ముందే చెల్లించివచ్చాను. అంటూ ఆమెనొదిలి వీధి గేటువైపు వెళ్ళి మళ్ళీ వెనక్కివచ్చి "నువ్వారోజు థెర్మల్ పవర్‌స్టేషను చూడ్డానికి వెళ్ళినప్పుడు కట్టుకున్నావే అదే, ఆ లేత గులాబీరంగు చీర- దానిని కట్టుకో. ఆ చీరలో నువ్వు అప్సరసలా వుంటావు. నా ఫియాన్సీ కూడా నిన్ను మెచ్చుకుంటుంది" అని ఛటుక్కున అనేసి కొంటెగా నవ్వుతూ గేటువైపు నడిచాడు.

శైలజ మనసు పరిపరివిధాల పోతున్నది. తనది ఏదీ తేల్చుకోలేని పరిస్థితి. ఎటూ తేలలేదు. అతని స్నేహితులముందు తను ఏడుస్తూ కూర్చుంటే బావుండదు.

ప్రతీదీ స్పోర్టివ్‌గా తీసుకోవాలంటాడు హంటర్. కాని ఇది నిజజీవితం. దీనిలోని కష్టనష్టాలు తనే భరించాలి. తానేడుస్తూ ఎదుటి వాళ్ళని నవ్వించలేదు అదేదో సినిమాలో చెప్పినట్లు.

"కమాన్ శైలూ టైమయిపోతోంది" అన్న హంటర్ పిలుపుతో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చిపడింది శైలజ.

"ఇప్పుడే ఇదుగో పదినిమిషాలలో వచ్చేస్తాను" అంటూ లోపలికి వెళ్ళి హంటరు చెప్పిన చీర కట్టుకొని మెడలో ముత్యాల హారం వేసుకొంది. తలకట్టు వెనుక పైకెత్తి కట్టింది. వెనుకనించి మెడభాగం విశాలంగా కన్పిస్తోంది. ఒక చేతికి ముత్యాల గాజులు, రెండో చేతికి రిస్టువాచీ పెట్టుకొన్న శైలజ హంటర్ కళ్ళకి అప్సరలా కన్పించసాగింది.

"హంటర్, మెడలో ఈ ముత్యాలహారం చాలా? లేక మరేదైనా నెక్లెసును వేసుకోనా? " అడిగింది శైలజ.

"వద్దు వద్దు! చాలు! ఆ మెడని ఎలా అలంకరించాలో నాకు తెలుసులే అక్కడికెళ్ళేక నేను చెబుతాను పద" అంటూ వయ్యారంగా నడుస్తున్న శైలజ నడుంచుట్టూ చేయి వేసి నెమ్మదిగా కారుదాకా తీసుకొచ్చాడు హంటర్.

కొత్త పెళ్ళికూతురిలా అతన్నే పొదివి పట్టుకొని అతనితో గడిపే ఒక్కక్షణం వృధా పోకూడదనే దానిలా అతనితో నడిచి కారు ఎక్కి అతని ప్రక్కన కూర్చుంది.

హంటర్ కారుని తన ఇంటివైపుకు తీసుకెళ్ళటంలేదు. ఎక్కడికి తీసికెళ్తున్నాడో తెలియక హంటర్‌వైపు శైలజ ఎక్కడికి? అన్నట్లు చూసింది.

"నా ఫియాన్సీ వుండే స్థలం ఇక్కడే" అంటూ కారుని ఓ హోటల్ పోర్టికోలో ఆపి

వెయిటర్‌కి తాళాలిచ్చి కారుని పార్కుచేసుకు రమ్మన్నాడు. తను శైలజ నడుంచుట్టూ చేయివేసి మెల్లగా మెట్లెక్కి లోపల పెద్దహాలులోకి తీసికెళ్ళాడు.

శైలజకి ఆ హోటలు భవనం అంతా ఇంద్రభవనంలాగా కన్పించసాగింది.

హంటర్ ఫ్రెండ్సంతా ముందుకివచ్చి 'వెల్కమ్' అంటూ స్వాగతం పలికి ఇద్దరికీ పూలబొకేలిచ్చి లోపల అందంగా అమర్చబడిన టేబిలు దగ్గర కుర్చీలలో కూర్చోబెట్టారు.

శైలజ కళ్ళు ఎవరినో వెతుకుతూ వున్నాయి. అంతా ఇంద్రజాలంలా అనిపిస్తోంది. చాలామంది హంటర్ ఆడామగా స్నేహితులొచ్చారు. వాళ్ళంతా అతనిని అభినందిస్తూంటే "థాంక్యూ, థాంక్యూ" అంటూ కొందరిని బుగ్గలమీద శ్వాసపీల్చి ముద్దులు పెట్టుకున్నాడు.

ఎవరెవరో ఒక్కొక్కరే వచ్చి మైక్ చేత్తో పుచ్చుకొని ఏవేవో మాట్లాడి వెళ్ళిపోతున్నారు. చివరలో 'మైకే'ని పిల్చి హంటర్ స్వయంగా మైకుని అతని కందించేడు.

మైకేరాకతో శైలజకి కొంత స్ఫురించింది. ఈ మైకేని ఎక్కడో చూసినట్లుంది. కాని ఎప్పుడో ఎక్కడో గుర్తుకురావడంలేదు అనుకుని అదే మాట హంటర్‌తో అంది శైలజ.

హంటర్ అన్నాడు. "నీకివాళ అన్నీ' సర్ప్రైజులే చూడు చూడు" అని.

తర్వాత హంటరు తన జేబులోంచి ఒక చిన్న బాక్స్ తీసి, అందరిముందూ అందులోంచి ఒక వుంగరం తీసి శైలజ వ్రేలికి తొడిగాడు.

అది ఎంగేజిమెంటు రింగు.

అందరూ చప్పట్లు కొడుతూంటే హంటర్ వైపు చూసి ఆనందంతో వుక్కిరిబిక్కిరై కళ్ళమ్మట ఆనంద బాష్పాలు రాలుతూంటే తల దించేసుకొంది శైలజ.

హంటర్ అంటున్నాడు.

"ఓ నా స్నేహితులారా! నా ఫియాన్సీని మీకు పరిచయం చేస్తున్నాను. ఈమె డాక్టరు శైలజ" అని తర్వాత బ్రీఫ్‌కేస్‌లోంచి రాళ్ళు పొదిగిన నెక్లెసును తీసి ఆమె మెడలో అలంకరిస్తూ చెవిదగ్గరగా తన నోరుపెట్టి "శైలూ నీ మెడనెలా అలంకరించాలో నాకు బాగా తెలుసుకదూ" అన్నాడు.

శైలజకి ఒళ్ళంతా పులకరించిపోతోంది. ఇదంతా కలా నిజమా? తేల్చుకోలేకపోతోంది.

"మీరిద్దరూ మేడ్‌ఫర్ ఈచ్ అదర్" అని మెచ్చుకుంటూ అన్నాడు మైకే.

హంటర్ కూడా ఒక్కొక్కప్పుడలానే భావించేవాడు. అందుకనే "థాంక్స్" మైకే అన్నాడు.

తర్వాత అందరూ షాంపేన్ తాగేరు.

ఆ తర్వాత మ్యూజిక్కు పెట్టుకొని అందరూ నాట్యం చేసేరు. పాపం మైకేకే ఎవరూ పార్ట్‌నర్ దొరకలేదు.

"మీ ఫ్రెండు మైకే ఇండియన్‌లాగ వున్నాడు కదూ" అంది శైలజ హంటర్‌తో.

"ఇండియన్‌లాగా వుండడమేంటీ. హి ఈజెన్ ఇండియన్‌డియర్" అన్నాడు హంటర్.

శైలజ విస్మయంతో మైకేవైపు చూసింది.

మైకే తిరిగి చిరునవ్వు నవ్వాడు.

తర్వాత అందరూ డిన్నర్‌కి రెడీ అవుతున్నారు. అలా అవుతూంటే హంటర్ మైకేని పిలిచి శైలూ నీకొక సర్ప్రైజు అన్నాడు.

శైలజ ఏమిటన్నట్లు చూసింది.

మనం మళ్ళీ ఇంకొక పెళ్ళి చూడబోతున్నాం. అదే మా ఫ్రెండు మైకే పెళ్ళి కూడా త్వరలో కాబోతోంది.





శైలజ ఎంతో సంతోషంతో క్రంగ్రాట్స్ చెప్పింది.

ఇంతలో మైకే మళ్ళీ మైకు దగ్గరగా వెళ్ళాడు. ఎవరో అతనిని మీ ఇండియను పాట ఒకటి పాడు అంటూ బలవంతంచేస్తున్నారు. మైకే ముందు మొహమాటపడినా తర్వాత అందుకున్నాడు.

"కహీ దూర్ జబ్ దినే గభరాయే

సాంజ్ కె దుల్హన్ బదన్ చురాయే..."

అని ముఖేష్ పాడిన పాటను పాడేడు.

మైకే గానం అద్భుతం. చాలామందికి ఆ పాటకి అర్థం తెలియకపోయినా ఆ మధుర స్వరానికి ముగ్ధులై నిశ్శబ్దంగా వుండి విని పాట కాగానే మిన్నుముట్టేలా చప్పట్లు కొడ్తూనే వున్నారు. హంటర్ చాలా గర్వంగా ఫీలయ్యాడు తన ఫ్రెండు బాగా పాడి ఇంతమందిచేత శహబాస్ అనిపించుకున్నందుకు.

ఆవేళ పార్టీకి ఎక్కువగా డాక్టర్లు ఫేమిలీలతో వచ్చేరు. అందరూ షాంపేన్ తాగుతున్న సమయంలో తమ ఆలశ్యానికి 'సారీ' చెప్పుకుంటూ వెనీసా ఫేమిలీతో వచ్చింది. వస్తూ శైలజ కళ్ళల్లోకి నవ్వుతూ చూస్తూ 'కంగ్రాచ్యులేషన్సు' అంది. మిగతా కొద్ది మందీ తనకీ హంటర్‌కీ తెలిసిన స్నేహితులు! వాళ్లూ ఫేమిలీస్‌తోనే వచ్చేరు.

శైలజ వెనీసాకి తిరిగి థాంక్స్ చెబుతూ కరచాలనం చేసింది. తర్వాత హంటర్ తమ పెళ్ళి రిజిస్ట్రేషనురోజు అనౌన్స్ చేసేడు. పార్టీ అంతా అయిపోయి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయేరు.

మైకే మాత్రం హంటర్, శైలజల వెంట హంటర్ ఇంటిదాకా వచ్చేడు.

ఇంటికొచ్చిన హంటర్ అన్నాడు. శైలూ మనం పెళ్ళి రిజిస్ట్రేషను ఇక్కడ న్యూజిలాండులో చేసుకుందాం. ఆ విషయమై నేను అన్ని ఏర్పాట్లూ ముందే చేయించి వుంచాను. ఇకపోతే ట్రెడిషనల్ మారేజి మీ పద్ధతిలో మీ ఇండియాలో జరుపుకుందాం. మనం ఇద్దరం ఒక పదిహేను దినాలు మాత్రం సెలవు పెట్టుకుంటే చాలు. నీకూ నీ వాళ్ళందర్నీ చూసినట్లువుంటుంది. మనం మైకే పెళ్ళికీ మైకే మన పెళ్ళికీ అటెండయినట్లుంటుంది. కాకపోతే ఎటొచ్చీ మనకి మళ్లీ కొంత డబ్బు ఖర్చు అంతే" అంటూ నవ్వాడు.

"డబ్బొక్కటేనా మళ్ళీ పదిహేనురోజులు సెలవు కావద్దూ? అసలు మనకింక సెలవు ఎలిజిబులిటీ వుందా?" అనడిగింది శైలజ.

"రేపు హాస్పిటల్‌కి వెళ్ళినప్పుడు కనుక్కుందాం. నేననుకోవడం సెలవు వుండేవుంటుంది. మనం ఇన్నేళ్లుగా సెలవు వాడుకోలేదుగా" అన్నాడు హంటర్.

మొట్టమొదటిసారిగా మైకే శైలజని తెలుగులో పలకరించాడు.

శైలజ అతను ఇండియన్ అనగానే సంతోషించింది. పైగా తెలుగు వాడనగానే ఇంకా ఎక్కువ సంతోషించింది. మైకే మాటల సందర్భంలో తనెక్కడ చదివాడో, తమ తల్లి దండ్రుల వివరాలు కొన్ని చెప్పాడు.

"అంటే అతను తాము చదువుకునే రోజుల్లో తమకి బాగా సీనియరు అన్న మాట" శైలజకి ఒక్కొక్క విషయమే అతని గురించి గుర్తుకి రాసాగాయి.

"అవును అతను చదువుకునే రోజుల్లో అందరూ అతన్ని ముఖేష్ అని అంటూండేవారు. అతను మంచి పాటగాడు. గంధర్వగానం అతనిది అని అందరూ మెచ్చుకునేవారు. అతనారోజుల్లో ఎప్పుడూ ముఖేష్ పాటల్ని చాలాబాగా ఇష్టంగా పాడేవాడు. అతను పాడుతూంటే ప్రతీ అమ్మాయి అతనివైపు ఆరాధనగా చూస్తూండేది. అయితే ఈ 'మైకే' అంటే ఆనాటి మైనంపూడి కృష్ణ

అన్న మాట. ఓ గాడ్ ఆనాటి ఆ ఆంధ్రా ముఖేష్ ఈనాటి మైకే. తన హంటర్‌కు ఫ్రెండు. హంటరన్నట్లు తనకు నిజంగా సర్ప్రైజుమీద సర్ప్రైజే. ఈ మైకే పెళ్ళికి తాము ఇండియాని మళ్ళీ సందర్శిస్తామన్న మాట, తమ పెళ్ళి కూడా అక్కడేనన్నమాట'

శైలజలో కుతూహలం పెరిగింది.

"మైకే! మీక్కాబోయే భార్యామణిగారు ఎలా వుంటారు? మీ తల్లిదండ్రులు చూసి నచ్చాక మీరు వరిస్తున్నారా లేక ఆమె మీకి దివరకే పరిచయస్తురాలా? " అని అడిగింది.

మైకే చిరునవ్వు నవ్వుతూ లేచి వెళ్ళి తన బ్రీఫ్ కేసును తెచ్చి బల్లమీద పెట్టి తెరుస్తూ అన్నాడు.

"ఫొటోని చూపిస్తాను. చూశాక మీరు కూడా ఆ అమ్మాయి నాకు అన్నివిధాలా తగిందని వప్పుకుంటారు" అని మైకే శైలజకి ఫొటోని చూపించాడు.

ఫొటోని చూస్తూనే శైలజ ఆనందాన్ని పట్టలేక పైకప్పు ఎగిరిపోయేలా "మాధురి" అని గట్టిగా అరిచింది.

హంటర్, మైకే కూడా ఆశ్చర్యంగా ఆమె వంకే చూడసాగారు. ఇద్దరూ ఒకేసారి "ఈమె మీకు తెలుసా? " అని అడిగేరు.

ఫొటోలోని అమ్మాయి శైలజకి తెలిసి ఉండడం వాళ్ళిద్దరికీ కూడా సర్ప్రైజే.

"హంటర్, హంటర్ ఇవ్వాళన్నీ సర్ప్రైజెసే నాకు. ఈమె, ఈమె నా ఫ్రెండు. నాక్లోజు ఫ్రెండు. మొన్న ఇండియాకి వెళ్ళిన అన్ని రోజులూ హాస్టల్లో ఈమె దగ్గిరే ఈమె రూములోనే వున్నాను. కాని, కాని మాధురి ఎన్నడూ నాతో మైకే గురించి కాని తన పెళ్ళి గురించి కాని ఒక్క మాటమాత్రమైనా అనలేదు సుమండీ. అఫ్‌కోర్స్. నేనూ నా

 

పెళ్ళి విషయం చివరివరకూ ఆమెతో కూడా చెప్పలేదనుకోండి" అంటూ నవ్వింది.

మాధురి ఎంత లోతు గుండె మనిషి. కాని తనకు కావలసినదానికోసం వెయిట్‌చేసి చివరికి సాధించింది. ఆ మాట కొస్తే తనూ ఒకవిధంగా అంతే. హంటర్ తనకే దక్కాడు. తనది ఎన్ని జన్మల తపస్సో ఈ జన్మలో ఫలించింది. పుణ్యం కొద్దీ పురుషుడంటారు. ఇదే కాబోలు. తనేదో పుణ్యమే చేసుంటుంది. జన్మజన్మలకీ ఇలాంటి పుణ్యమే చేస్తూంటే ప్రతీ జన్మలోనూ తనకు హంటరే భర్త అవుతాడు అనుకుంది శైలజ మనసులో. హంటర్‌వైపు ఆరాధనగా ప్రేమగా చూసిందామె.

హంటర్ ఆమె చూపులతో చూపులు కలిపి ఆమెకి దగ్గరగా రావడంచూసిన మైకే "ఇప్పుడే వస్తాను" అని అంటూ అక్కణ్నుంచి జారుకున్నాడు.

మైకే తన స్నేహితుల్ని రిక్వెస్టు చేసి విశాఖలో పెళ్లికి హాలూ వగైరా అన్ని ఏర్పాట్లూ చేయించాడు. అతని తల్లిదండ్రులు కూడా పెళ్ళి పనులలో మునిగిపోయేరు.

శైలజ మాధురికి సర్ప్రైజు ఇద్దామనే ఉద్దేశంతో ముందుగా ఫోనుచేసి మాట్లాడలేదు. లేకపోతే మాధురీ నీ మైకే కృష్ణ నా వద్దనే వున్నాడని చెప్పాలనుకుంది. అలాగే మాధురి కూడా అందరికీ తనకి ఫలానారోజున పెళ్ళి అనే చెప్పి ఇన్వైటు చేసిందికాని, ఆ పెళ్ళికొడుకు తను ఏరికోరి చేసుకొంటున్న తన కృష్ణయే అని ఎవ్వరికీ చెప్పలేదు.

మాధురి తల్లిదండ్రులు వైజాగ్ వచ్చేరు. మాధురిసైడు బంధువర్గం చాలా తక్కువ. పెళ్ళయిన ఆమె చెల్లెలు పిల్లాడిని తీసుకొని వచ్చింది. మాధురి పెళ్ళి నాటికి ఆమె చెల్లెలు భర్త వస్తాడుట. కృష్ణ తాలూకు ఆ చుట్టుపక్కల ప్రదేశాలలో వున్న వాళ్ళందరూ వచ్చేరు.

మాధురి, తన తల్లిదండ్రులు, చెల్లెలు

కలిసి పురోహితుణ్ణి అడిగి మగ పెళ్ళివారికి ఎప్పుడెప్పుడు, ఏమేమి ఎక్కడెక్కడ పెట్టాలో కనుక్కుని కొనవలసిన వస్తువులన్నింటిని కొని తయారుగా వున్నారు.

మాధురి తండ్రి "అమ్మా మాధురీ ఆఖరికి నువ్వు కోరినట్లే అన్నీ జరిగాయి. నువ్వు చదువుకున్నందుకు ఆ చదువు అన్నివిధాలా ఉపయోగపడింది. ఈ పెళ్ళి అయితే నువ్వు మమ్మల్ని వదిలి చాలాదూరం వెళ్ళిపోతా వన్న మాట. నీ పెళ్ళి చేయడానికే ఆర్థికస్తో మతులేని మేము ఇంక నిన్ను చూడాలను కుంటే అమెరికాకి రాగలమా అమ్మా! మీ అమ్మకి ధైర్యం చెప్పు. నువ్వు ఏ రెండు సంవత్సరాలకైనా ఒకమారు వచ్చి మాకు కన్పించి వెళతావని. నీ చెల్లెలు కూడా ఎంతో బెంగపెట్టుకుంది" అంటూ కంట తడిపెట్టి, పై మీది ఖండువాతో కళ్ళొత్తుకు న్నాడు.

కన్నతండ్రి కన్నీళ్ళని చూసి మాధురి కూడా కరిగిపోయింది. తనూ కంటతడి ఒత్తుకుంటూ తండ్రిని కౌగలించుకొని "అలాగే నాన్నా" అంది.

ఆ రాత్రి తల్లి కూడా కంటతడిపెట్టుకొని "అమ్మా మాధురీ పుట్టింటికి, మెట్టినింటికి కీర్తి తీసుకురా। నడి మంత్రపు సిరిని చూసి నాట్యంచేయకు. ఆ అబ్బాయిది మన భాష కూడా కాదు. అయినా ఆ అబ్బాయి తల్లినీ, తండ్రినీ మెప్పించడానికి ప్రయత్నించు. నీ కందరూ కొత్త అనిపించినా ఆ తరువాత మెల్లిగా అలవాటుపడిపోతావు. వాళ్ళూ నీ విషయంలో అంతే. 'బాబా' నెప్పుడూ మర్చి పోవద్దు. ఎంత డ్యూటీ హడావుడిలో వున్నా బాబాని మనసులోనైనా ధ్యానంచేసుకో. ఆ బాబాదయవల్లే మన అదృష్టాలు బావు న్నాయి. నీ చెల్లెలికి పెళ్ళిచేసి ఒక ఒడ్డుకు చేర్చావు. నీ తల్లిదండ్రుల అప్పుల బాధల్ని వదిల్చావు. ఇప్పుడు నువ్వొక గమ్యాన్ని చూసుకున్నావు. నీకు ఎప్పుడూ బాబా అను గ్రహం వుంటుంది. మమ్మల్ని మర్చిపో కుండా ఉత్తరాలు రాస్తూండమ్మా"

తల్లి కన్నీరు చూసిన మాధురికి కూడా దుఃఖం ఆగలేదు. చెల్లెలు కూడా కంటతడి పెట్టింది.

పెళ్ళయ్యాక చేసే అంపకాలు ఇప్పుడే జరుగుతున్నట్లుంది మాధురికి. తర్వాత మాధురి తల్లి మాధురిని అడిగింది. "అమ్మా మాధురీ పెళ్ళి పందిట్లో నీ పెళ్ళి తోపాటు మరెవరి పెళ్ళికో కూడా ఏర్పాటు జరుగుతున్నట్లుందే" అని.

"అవునమ్మా ఆయన స్నేహితుడు న్యూజి లాండు దేశస్థుడు. మన ఇండియాలోనే మన ఇండియను అమ్మాయినే, ఇండియను పద్ధతిలో పెళ్ళిచేసుకుంటానన్నాడుట. అందుకని వాళ్ళ పెళ్లి ఏర్పాట్లు కూడా మీ కాబోయే అల్లుడిగారి స్నేహితులే చూసుకుం టున్నారు" అని చెప్పింది మాధురి.

శైలజ తన బంధువులు కొద్దిమంది అడ్ర సులను గుర్తుచేసుకొని పెండ్లి శుభలేఖలను పంపింది. శైలజకి తల్లీతండ్రీ చిన్నప్పుడే పోయారు. పెంచి పెద్దచేసిన అమ్మమ్మా తాతయ్యా శైలజకి చదువు చెప్పించి కొంత ఆస్తి రాసి మరీ పోయారు. కాబట్టి శైలజకి నా అనే వాళ్ళు కొద్దిమంది మాత్రమే బంధు వర్గంలో వున్నారు. ఆమె మిత్రబృందానికి శుభలేఖలు పంపింది.

హంటర్ తాలూకు బంధువర్గమంతా న్యూజిలాండులో రిజిస్ట్రేషను నాడే కలిసి వాళ్ళిద్దరినీ అభినందించారు. వెనీసా పెళ్ళికి మొదట ఇండియాకి వద్దామనుకొన్నది కాని మళ్లీ ఎందుకో తన ప్రయాణాన్ని విరమిం చుకొంది. పెళ్ళయి వాళ్ళిద్దరూ ఇక్కడికొచ్చేక ఇక్కడే వాళ్ళకొకమంచి బహు మతిని ఇవ్వాలనుకొంది.

పెళ్ళిరోజు పందిరి అంతా బంధుజనాల

తోటీ, స్నేహితులతోటీ కలకలలాడిపో తోంది. ఎవరి హడావుడిలో వారున్నారు. మాధురిమాత్రం అస్తమానూ వాచీని చూసు కుంటూ రోడ్డువైపు చూస్తున్నది. ఏ కారు ఆగినా అది ఏర్‌పోర్టునించేనేమోనని తహ తహలాడసాగింది.

రెండు మూడుసార్లు తన మిత్రబృందాన్ని పంపి ఫ్లైటు సరియైన సమయానికే వస్తు న్నదా లేక ఏమైనా ఆలశ్యం అవుతోందా అని గాభరాగా వాకబుచేయసాగింది. దీని కితోడు బంధువులు కూడా "ఏమమ్మా పెళ్ళి కూతురా పెళ్ళి కొడుకు ఇంకా రాలేదేమిటి? అసలతనిని రెండుమూడు రోజులైనా ముందు రమ్మనమని చెప్పొద్దా? మరీ కుత్తుకల్లో పెట్టుకున్నారే వ్యవహారాన్ని" అనసాగారు.

"అదే మమ్మా ఆ పక్క, పందిట్లో మరో పెళ్ళి జరుగుతోందిటగా, ఆ పెళ్ళి కొడుకూ పెళ్ళి కూతురూ కూడా ఇంకా రాలేదుటగా" అని కొందరు.

"ఆ ఆ వాళ్ళిద్దరూ కలిసిరాకపోతే మరేం ఫర్వాలేదులే. వాళ్లెప్పుడైనా ఏగుళ్ళోనో పెళ్ళి చేసుకుంటారు. కాని అన్నీ తయారుచేసు కొని మన మాధురి కూర్చుంది. ఆమె పెళ్ళి కొడుకు రాకపోతే ఎట్లా? " అని కొందరం టున్నారు.

మాధురికి ఆదుర్దా భయం కూడా ఎక్కువ కాసాగాయి. ఒక పక్క ఇతరుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తూనే తన మనసు కూడా వాళ్ళరాకకోసం, ముఖ్యంగా కృష్ణ రాకకోసం తహతహలాడసాగింది.

కాస్సేపట్లో పందిట్లో ఆనోటా ఆనోటా ఆ మాటా ఈ మాటా గట్టిగా మాట్లాడుకునే వాళ్ళంతా అక్కడా అక్కడా గ్రూపులుగ్రూ పులు కింద మారిపోతున్నారు. ఎక్కడిక క్కడే గుసగుసలు ప్రారంభమయ్యాయి.

"పురోహితులు అంటున్నారు. అమ్మా ముహూర్తం పదకొండుగంటల నలభైరెండు నిమిషాలకి. గౌరీపూజకి తయారు కావాలి" అంటూ.

తెల్లారి అప్పుడే ఎనిమిదిగంటలు కావ స్తోంది. అందరికీ కాఫీలు, టిఫిన్లు అందిం చేవాళ్లు అందిస్తూనే వున్నారు. కొందరు భోజనాలు ఆలస్యం కావచ్చని మరో ప్లేటూ మరో ప్లేటూ టిఫిన్లు ఎక్కిస్తున్నారు. లోపల వంటశాలలో కూరలూ అవీ హడా విడిగా తరిగి పారేస్తున్నారు.

బొంబాయినుంచి విశాఖపట్నం వచ్చే విమానం ఏడు గంటలకే రావాలి. అప్పుడే ఎనిమిదిగంటలు దాటింది. తనకు సేవలు చేస్తూ కొందరు పెళ్లి కానివారు తమకు జరుగబోయే పెళ్లిని గురించి ఊహాగానాలు చేస్తున్నారు. పెళ్లయిన అమ్మాయిలు వాళ్ళ వాళ్ళ అనుభవాలను వర్ణిస్తున్నారు. కొంద రమ్మాయిలు పెళ్లికూతురిని అంటిపెట్టుకొని వుండి తామేదో గొప్ప హోదాలో వున్నట్లు భావిస్తున్నారు.

ఎవరేం చేస్తున్నా మాధురి కళ్లు మాత్రం వాచీమీదా, రోడ్డుమీదా వున్నాయి.

తొమ్మిదవుతూండగా రెండుకార్లు వచ్చి వీధిలో గుమ్మంముందు ఆగాయి. ఆ రెండూ కూడా తను తన స్నేహితులతో ఏర్‌పోర్టుకి పంపిన కార్లు కావు. ఇంకా బంధువులెవరైనా వచ్చేరేమోననుకొని చూస్తోంది.

ఆశ్చర్యంగా మొదటికారులో లలితా లలిత భర్తా పిల్లలూ దిగారు. వాళ్ళ వెనుకే పెళ్లికొడుకు కృష్ణ దిగి చాలా హుందాగా దర్జాగా నడుస్తూ, పెద్దలకి నమస్కారాలు, స్నేహితులకి హలోహలో అని చెప్పుకుంటూ చిరునవ్వులు చిందిస్తూ వస్తున్నాడు. పందిట్లో అందరూ హర్షాన్ని ప్రకటిస్తు న్నారు. పిల్లలు కేరింతలు కొడ్తూ, "పెళ్లికొ డుకులు ఒచ్చారోచ్" అంటూ అరుస్తు న్నారు.




వీళ్ళ వెనుకే రెండవ కారులో హంటర్, అతని పక్కనే శైలజా స్నేహితులతో వచ్చి దిగారు.

కృష్ణ తల్లి కొందరు పెద్ద ముత్తయిదువలతో కలిసి కృష్ణా వాళ్ళకి ఎదురు వెళ్ళి దృష్టి తీసింది.

హంటర్ ఆ వాతావరణానికి అలంకరణలకి ముగ్ధుడై శైలజ చెవి దగ్గరగా నోరు పెట్టి, "అబ్బ ఎంత మనోహరంగా వుంది" అన్నాడు.

శైలజ సిగ్గుపడి తలదించుకునే "ఇప్పుడే మిటీ? ఆ మాట? " అని అంది.

"అహ్హా నీ సంగతి కాదు, నేనంటున్నది! ఈ అలంకరణలూ వగైరాలు" అంటూ నవ్వాడు హంటర్.

అంతవరకూ కృష్ణనే తన్మయత్వంతో చూస్తున్న మాధురి, హంటర్నీ అతని పక్క శైలజనీ చూసి చకిత అయింది.

ఓ- న్యూజిలాండు పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురూ అని కృష్ణ చెప్పినది వీళ్ళిద్దరి గురించేనా- మాధురి ఇంకా ఆశ్చర్యం సంతోషం నుంచి తేరుకోకముందే కృష్ణ.

"మాధురీ మీట్ మై ఫ్రెండ్సు హంటర్ అండ్ శైలజా- హంటర్ దిస్ ఈజ్ మై ఫియాన్సీ మాధురి' అని ఒకరికి ఒకరిని పరిచయం చేశాడు. కాని శైలజా మాధురీ ఇద్దరూ ముందే స్నేహితులని హంటరుకి పెద్ద సర్ప్రైజు న్యూజిలాండులోనే కల్పించింది శైలజ. కృష్ణ గురించి తను ఏమీ చెప్పక్కరలేకుండానే శైలజా వాళ్లతో తన కృష్ణ కలిసి రావడంతో వాళ్ళకి ముందే తెలుసునన్న సర్ప్రైజు మాధురికి.

లలిత ఫేమిలీ పెళ్ళివారితో కలిసి రావడం బంధువర్గానికి సర్ప్రైజు. ఇలా సర్ప్రైజులమీద సర్ప్రైజులతో పెళ్ళిపందిరి కిటకిటలాడుతూ ముహూర్తం టైమ్‌కి ఎదురుచూడసాగారు. మాధురి, శైలజల ముఖ్యస్నేహితులు ఎవరెవరికి ఏమేమి కావాలో అన్నీ సకాలంలో అందిస్తున్నారు. వినోద్, పద్మ, సుభద్రమ్మగారూ, గాయత్రి, వినూత్నా, భర్తా, అత్తగారు, రూప, మహేశ్ ఇలా అందరూ ఒక్కొక్కరే వస్తూ పెళ్లి కూతుళ్లని, పెళ్లికొడుకుల్ని అభినందించసాగారు. పురోహితులు చేయవలసిన తతంగాన్ని రెడీ చేసుకుంటున్నారు.

ఎన్నోరకాల పట్టుచీరలు,

చిన్నా పెద్దా జరీ అంచులున్న చీరలు-

ఏఏ వెరైటీ చీరలు- ఏఏ షాపుల్లో ఎంతెంత ఖరీదుకి దొరుకుతాయో పూర్తి వివరణలు.

రకరకాల బంగారు నగలు.

వాటి మేలిమితనం, పనివాడితనం మెచ్చుకునే వనితలు-

దంతసిరి గలవాళ్ళు నోరూరించే వంటల్ని మెచ్చుకుంటున్నారు.

ఒకరిని ఒకరు పరిచయం చేసుకుంటూ ప్రయాణాల్లో ఎటువంటి కష్టసుఖాలను అనుభవించేరో, కొందరు ముచ్చటలు.

కులగోత్రాలూ శాఖాపరిచయాలు చేసుకుంటూ వావివరుసల్ని కలుపుకుంటున్న బంధువర్గమూ-

ఇలా అందరూ కలిసి మెలసి ఆనందిస్తున్న తరుణం అది.

అగ్నిసాక్షిగా బంధుమిత్రాదుల సాక్షిగా కృష్ణ హంటర్ లిరువురూ ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి అని చెప్పింది విని తామూ చెప్పి కంతే బధ్నామి మాంగల్యం తంతునా... అంటూ మాధురి, శైలజల మెడలలో 'తాళి'ని బాజాభజంత్రీలు సన్నాయి మేళం గట్టిగా వినిపిస్తుండగా కట్టారు. కృష్ణ మాధురి- హంటర్ శైలజలు మధుపర్కాలను ధరించి పెద్దలందరికీ




పాదాభివందనాలు చేస్తుంటే దేవతలు పుష్పవృష్టి కురిపించినట్లుగా అక్షింతలు చల్లుతూ పెండ్లికి వచ్చిన పెద్దలంతా ఆశీస్సులను వెదజల్లారు.

డాక్టర్ గాయత్రితోపాటు ఆమె భర్త ఈ పెళ్ళిళ్లకి రాలేదు. అందరూ గాయత్రిని ఆమె భర్త విషయమై అడిగారు. "అతను హైదరాబాద్‌లో వుండగానే అతనిని ఆక్లాండ్‌నుండి న్యూజిలాండులో సౌత్‌వైపున నున్న 'నెల్సన్' అనే ప్రదేశానికి ట్రాన్స్‌ఫర్ చేసేరు. కాబట్టి అతను మిగిలిన శలవును కాన్సిల్ చేసికొని 'నెల్సన్'లో జాయిన్ కావడానికి 'ఆక్లాండ్' వెళ్ళిపోయాడు. వెళ్ళబోయే ముందు కొత్త దంపతుల్ని హనీమూన్‌కి 'నెల్సన్' తప్పకుండా రండని ఇన్వైటు చేసి మరీ వెళ్ళాడుట. డాక్టర్ గాయత్రి ఒక్కసారిగా తన స్నేహితులందరినీ చూడగల్గినందుకు చాలా సంతోషించింది.

వినూత్న సాగర్‌లు ప్రత్యేకంగా అభినందించడానికి వచ్చారు. వినూత్న ముఖం కొంచెం అలిసినట్లు వడలి పాలిపోయినట్లు వుంది. వినూత్నని చూస్తూనే శైలజ "వినూత్నా ఏమిటి నువ్వు మాకు అల్లుడిని స్తున్నావా? " అంది.

వినూత్నా కొంచెం సిగ్గుపడి "అవునే శైలూ ఎలా అయితేనేం సాధించేం. మాకన్నా మా శ్యామలత్తయ్యకి ఎక్కువ సంతోషంగా వుంది. మనవడి కోసం, మనవడికి చేసే సేవలకోసం తను రోజురోజుకీ మరీ ఆక్టివ్ అయిపోతోంది" అంది.

ఇంతలో శ్యామలత్తయ్యే వచ్చి "అమ్మా శైలజా అంతా కన్నుల పండువుగా వుందమ్మా. ఏ ముహూర్తాన నువ్వు మళ్ళీ మనదేశంలో అడుగు పెట్టావో అన్నీ వరుసలో శుభకార్యాలే జరిగిపోతున్నాయమ్మా" అంది కళ్లు వత్తుకుంటూ.

ఆవిడ ఆప్యాయతకి ఆనందబాష్పాలకి శైలజ కరిగిపోయింది.

"ఆంటీ మీచేతి వంట తినకుండా నాకు వెళ్ళాలని లేదు. ఎలాగో ఒకలాగ మేం ఈ దేశాన్ని వదిలివెళ్లేలోపున మీ ఇంటికి వినోద్ ఇంటికి వచ్చే వెళతాం" అంది శైలజ.

ఆ మాటలకి అక్కడే వుండి అభినందిస్తున్న వినోద్ పద్మలు చాలా సంతోషించారు. శైలజ ఆప్యాయతకి పద్మ కూడా మురిసిపోయింది.

వివాహం తంతు భోజనాదులు పూర్తి కాగానే హంటర్ శైలజలు తమ కోసం ముందే బుక్ చేయించుకున్న హోటలు రూమ్‌కి వెళ్ళడానికి లేచారు. అందరి శుభాశీస్సులూ తీసుకుని అందరికీ నమస్కారాలు చెప్పి మరీ కదిలారు.

పెళ్లి మంటపాలున్న హాలంతా డాక్టర్లూ, మెడికల్ కాలేజీ ప్రొఫెసర్లూ, లెక్చరర్లూ, తదితర పెద్ద ఆఫీసర్లతో నిండిపోయింది. అందరూ సంతోషంగా భోజనాదులు ముగించుకుని ఆ రెండు జంటల్నీ మనస్ఫూర్తిగా ఆశీర్వదించి మరీ కదిలారు.

మాధురిని అత్తవారింటికి లాంఛనాలతో ఆమె తల్లిదండ్రులు దిగబెట్టారు. మధుపర్కాలతో కుడికాలు ముందుగా లోపలికి పెట్టి భర్తతో పాటు ప్రవేశించిన మాధురికి ఆడపడుచులు మంగళహారతులిచ్చి పేర్లు చెప్పించుకున్నారు. కృష్ణ చెల్లెళ్లకు హారతిపళ్లెంలో డాలర్లనే వేస్తూవచ్చాడు.

పాదాలకి నమస్కరించి నిలిచిన కొడుకునీ కోడలినీ కృష్ణ తల్లిదండ్రులు గౌరవంగా ప్రేమతో లేవనెత్తారు.

"రా అమ్మా మాధురీ. ఇవ్వాళనుంచి నువ్వు ఈ కుటుంబంలో భాగానివి. నువ్వు మా కోడలిగా రావడం మా అందరికీ సమ్మతమూ సంతోషమూను. మాకు మా కృష్ణ ఎంతో నువ్వూ అంతే తల్లీ" అని ఆవిడ మాధురిని హృదయానికి హత్తుకుంది.

మాధురి తల్లిదండ్రులు ఆ దృశ్యాన్ని చూసి కళ్లు వత్తుకున్నారు.






# కోతిపిల్ల కోతికి ముద్దు

అంతేగాదు, మనుషులకు కూడా ముద్దే సుమా అన్నట్లుగా జర్మనీలో జరిగిన ఓ అంతర్జాతీయ ఛాయాచిత్ర ప్రదర్శనలో ఈ ఫొటో ప్రథమ బహుమతి గెలుచుకుంది.

# చతుర ప్రపంచం

## కెమికల్ బాంబు కథ

ఆటంబాంబుకన్నా కెమికల్ బాంబు మరీ ప్రమాదకారి అంటారు శాస్త్రజ్ఞులు. ఆటంబాంబు క్షణాల్లో ప్రాణాలను తీయగల దు. కానీ విష వాయువులతో నిండిన ఈ కెమికల్ బాంబులు రోజుల తరబడి లేదా సంవత్సరాల తరబడి మనుషుల్ని పీల్చి పిప్పిచేసి మరీ చంపుతాయి.

1993 నవంబర్ 7వ తేదీన ఇరాన్‌లోని షీలార్ నది సమీపంలో కొంతమంది వ్యవ సాయదారులు పొలం పనులు చేసు కుంటుండగా హటాత్తుగా ఆకాశంలోంచి ఇరా కీ బాంబర్స్ రావడం చూసి ఖంగారుపడిపో యారు. వాళ్లు వదిలిన బాంబులు అతి మెల్లగా భూమిని తాకాయి. అది చూసి ప్రజలు ఆశ్చర్యపోయారు. ఒక్క బిల్డింగ్ కూడా పడకుండా ఎవరికీ ప్రాణహాని జర క్కుండా గండం గట్టెక్కిందని మురిసిపో యారు. కానీ తొందరలోనే ఆ బాంబువల్ల ఏర్పడే అనర్థాలు ప్రారంభమయ్యాయి. వా తావరణమంతా ఆ పొగ వ్యాపించి కుళ్లిన ఉల్లిపాయల వాసన రాసాగింది. ఆ బాంబుప డిన ప్రాంతానికి 5 కిలోమీటర్ల చుట్టూవున్న ప్రజలకు అపరిమితమైన కళ్లు మంటలు ప్రారంభమయ్యాయి. 500 మంది పూర్తిగా గుడ్డివారయ్యారు. 100 మంది ఊపిరాడక ప్రాణాలు విడిచారు.

ఈ కెమికల్ బాంబు ఆస్తినష్టాన్ని కలి గించదుగానీ ప్రాణనష్టం మాత్రం అనివా ర్యం. ఇరాక్ ఇలాంటి విషవాయు బాంబుల ను ఇరాన్‌మీద ప్రయోగించడం ఇది మొదటి సారికాదు. 1983 నవంబర్ 25న ఇరాక్ బాంబర్స్ ఇరాన్‌లోని కుర్దిస్థాన్ ప్రాంతంపై కెమికల్ బాంబులను వదిలింది.




24 సంవత్సరాల ఆయేషా సెలాఫనా తన ముగ్గురు తమ్ముళ్లతో కలిసి బనేహ్‌కు



వెడుతున్నాడు. అంతలో కిరోసిన్ వాసనతో వున్న పొగ ఆకాశమంతా వ్యాపించింది. అతని తమ్ముడు అబ్దుల్లా అక్కడికక్కడే మరణించాడు. రకరకాల బాధలను ఎదుర్కొన్నారు ప్రజలు. వేలాదిమందికి చర్మం ఊడిపోయింది. ఊపిరితిత్తులు విచ్చిపోయాయి. 1966 డిసెంబర్ 5న ఐక్యరాజ్యసమితి సమావేశంలో సభ్యరాజ్యాలన్నీ ఈ కెమికల్ బాంబులను యుద్ధ సమయంలో ఉపయోగించగూడదనే నిర్ణయాన్ని తీసుకున్నాయి. కానీ యుద్ధమంటే ముందుకురికే దేశాలు ఈ నిర్ణయానికి కట్టుబడి వుంటాయనేది కల్ల.

అసలు కెమికల్ బాంబు అంటే ఏమిటి? మొట్టమొదట దాన్ని ఉపయోగించిందెవరు? దీనివల్ల వచ్చే చెడు ఫలితాలెలాంటివి? ఇందులో ఏ రసాయనాన్ని ఉపయోగిస్తారు? ఇవన్నీ పరిశీలించగా బయటపడిన ఆశ్చర్యకరమైన నిజమేమంటే క్రీ.పూ. 400 సంవత్సరంలోనే ఈ బాంబులు వాడబడ్డాయి. స్పార్టాన్ దేశ సైనికులు తాము వాడే బాణపుములుకులకు విషపూరితమైన సల్ఫర్ డయాక్సైడ్‌ను పట్టించేవారు. తర్వాత మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో కెమికల్ బాంబులు విరివిగా వాడబడ్డాయి. 1914లో ఫ్రెంచి సైన్యం జర్మనులపై టియర్ గ్యాస్‌ను వదిలింది. 22 ఏప్రిల్ 1915లో జర్మనీ సైన్యం ఫ్రెంచి, బ్రిటన్ సైనికులపై కెమికల్ బాంబులతో జరిపిన దాడిలో 500 మంది హతమయ్యారు. మొదటి ప్రపంచ యుద్ధంలో కెమికల్ బాంబులవల్ల 12,96,853 మంది మరణించారు. 1914 ఏప్రిల్ 15 నుంచి 1917 జూలై 12 మధ్య కాలంలో ఈ బాంబులు విరివిగా వాడబడ్డాయి. మొదటి ప్రపంచ యుద్ధంలో వాడిన విషవాయువులు లెక్కలేనన్ని. ఈ వాయువుల్లో కొన్నిగనుక పీలిస్తే వికారం, ఊపిరితిత్తులు బిగపట్టడం, కళ్లు మంటలు, చర్మం ఊడిపోవడం, చివరకు మరణించడం జరుగుతుంది.

మరికొన్ని వాయువులు రక్తంతో కలిసిపోతాయి. హైడ్రోజన్ సైనైడ్‌గ్యాస్ ప్రూజిక్ యాసిడ్, ఆర్సనిక్ క్లోరైడ్‌ల మిశ్రమంతో తయారవుతుంది. ఇది రక్తంలో కలిసి మెదడును విచ్ఛిన్నం చేస్తుంది.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రష్యన్ సైన్యం డిక్లోరోఫార్మోజిన్ గ్యాస్‌ను వాడింది. ఈ వాయువు పీలిస్తే 100 తేళ్లు ఒక్కసారి కుట్టిన బాధ కలుగుతుంది. క్రమంగా ప్రాణాన్ని హరిస్తుంది.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఎక్కువగా ఫాస్జిన్ గ్యాస్ వాడబడింది. ఇది క్లోరిన్, మస్టర్డ్ గ్యాస్‌ల మిశ్రమం. ఇది పీలిస్తే విపరీతమైన తలనొప్పి, గుండె కొట్టుకోవడం ఎక్కువై చివరకు ప్రాణం పోతుంది.

మొట్టమొదట 1859లో ఓ జర్మన్ శాస్త్రజ్ఞుడు తన ప్రయోగశాలలో ఈ మస్టర్డ్ గ్యాస్‌ను కనుగొన్నాడు. ఆ తరువాత విక్టర్ మేయర్ అనే శాస్త్రవేత్త దీనిని మరింత ప్రభావితం చేశాడు.

ఈ వాయువు గాఢమైన వాసన కలిగి వుండకపోవడంతో దాన్ని గుర్తించడంలో కొంత జాప్యం కలుగుతుంది. కనుగుడ్లు విపరీతంగా కదిలిపోవడం, గొంతు ఎండిపోవడం, విపరీతమైన కడుపునొప్పి, మొదలయినవి ఈ వాయు ప్రభావలక్షణాలు.

ఇది రోజుల తరబడి ప్రజలను ఈ లక్షణాలతో పీడించి చివరకు మృత్యువును ప్రసాదిస్తుంది. ఈ మస్టర్డ్ గ్యాస్‌వల్ల ఎక్కువగా ప్రభావితమయ్యేవి జననేంద్రియాలు.

1943లో ఈ మస్టర్డ్ గ్యాస్‌ని తీసుకువస్తున్న నౌక బేరీ హార్బరు వద్ద సముద్రంలో మునిగిపోయింది. వాయువు మొత్తం సముద్రజలంలో కలిసిపోయింది. అందులోని సైనికులు ఈదుకుంటూ వడ్డుకు చేరారు. కానీ వారి శరీరమంతా తెల్లగా పాలిపోయినట్లయింది. అంటే శరీరంలోని ఎర్రకణాల నన్నిటినీ హరించిందా వాయువు.




1917లో జర్మనీ మస్టర్డ్, ఫాస్జిన్ గ్యాస్‌లను ఎక్కువ పరిమాణంలోనే తయారు చేసింది. యుద్ధానంతరం రష్యా, జర్మనీలు కలిసి ట్రాటుస్టాక్‌లో కెమికల్ బాంబులను తయారుచేసే పరిశ్రమను స్థాపించారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం చాలా దేశాలు తమ విషవాయు సిలెండర్లను నదులలో వదిలేశారు.

మళ్ళీ వీటి వాడుక 1967లో కనిపించింది. యమన్ సైన్యాలను ఎదుర్కొనేటప్పుడు ఈజిప్షియన్ సైనికులు ఈ కెమికల్ వాయువులను రాకెట్లద్వారా, బాంబులద్వారా ఉపయోగించారు.

1965 మార్చి 23న అమెరికన్లు వియత్నాంపై కెమికల్ బాంబులదాడి చేసింది. దాని తాకిడికి ఎక్కడో గుహలలో నివశించేవారు కూడా ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఈ విషవాయువువల్ల వచ్చే కష్టనష్టాలు అందరికీ తెలిసినా యుద్ధం వచ్చేసరికి అందరూ వాటిని వాడుతూ ప్రజల ప్రాణాలను పణంగా పెడుతూనే ఉన్నారు.

## బలవంతపు మత మార్పిడి

మొగలుల పరిపాలనాకాలంలో ముఖ్యంగా ఔరంగజేబు రాజ్యపాలన సమయంలో అతడు రాజస్థాన్‌కి చెందిన వీర రాజపుత్ర వంశీయులెందరినో బలవంతంగా ఇస్లాం మతంలోకి మార్పించాడని అంటారు. వాళ్ళు రాజస్థాన్‌కి చెందిన మంగనియార్లు. వాళ్ల ముఖ్య వృత్తి భిక్షమెత్తడం. ఒకప్పుడు సంగీత, నృత్యాలలో ఆరితేరిన ఆ తెగ ఇప్పుడు మధూకర వృత్తిలో నిష్ణాతులుగా మిగిలారు. ఇప్పటికీ వారి నృత్య, గానకళ అలాగే మిగిలినా సామాజికంగా వారు దిగువ తరగతివారుగా మిగిలిపోయారు. ఎక్కడైనా వేడుకలలోగానీ, విషాద పరిస్థితులలోగానీ వచ్చి దానికి తగిన పాటలు పాడతారు ఈ తెగవారు. స్వతంత్రం వచ్చి ఇన్నేళ్లయినా ఇప్పటికీ వారు దారిద్ర్య రేఖకు దిగువనే వుండిపోయారు. వారు నివసించే గుడిసెలకి సరైన కప్పు కూడా లేకుండా వానకి తడిసి, ఎండకు ఎండి, చలికి ఒణికి దుర్భర జీవనాన్ని సాగిస్తున్నారు. ముఖ్యంగా వాళ్లు అలా బతకడానికి కారణం వారి బద్ధకం. భిక్షమెత్తడానికి తప్ప ఏ పని చెయ్యాలన్నా ఒళ్లు ఒంగదు వారికి. ఉదయం 9 గంటలకి లేచి వెంటనే అడుక్కోవడం ప్రారంభిస్తారు. వీరికి ఒంటిమీద సరైన బట్టకూడా వుండదు. స్త్రీలు కూడా అర్ధాచ్ఛాదితంగా చిరిగిన వస్త్రాలు ధరించి వుంటారు. మాంగనా అంటే అడగడం. అందుకే వాళ్లకాపేరు వచ్చిందో లేక ముందే వుండి ఆ జాతి అలా తయారయిందో చెప్పడం కష్టం.

వాళ్ల పూర్వీకులు పాడిహార్ రాజపుట్ తెగకు చెందినవారు. రాజానాగ్నేషియా గొప్పదేవీ భక్తుడు. దయార్ద్ర హృదయుడు. కానీ... అతనికి కుష్టువ్యాధి సంక్రమించి అకాల మరణం చెందాడు. రాజుకు సంబంధించిన జ్యోతిష్యుడు... 'రాజు ఆత్మకు శాంతి కలగాలంటే ఎవరో ఒకరు జోగిగా మారి చనిపోయేంతవరకూ భిక్షమెత్తుకుని బతకాలి' అన్నాడు. దానికి ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడు దేవీ ఆలయంలో పూజారిగా వుండే రాజపుత్ర యువకుడు రాజుమీద అభిమానంకొద్దీ తాను జోగినవుతానన్నాడు. నాగ్నేషియ తరువాత వచ్చిన రాజు జోగికి వివాహం, నిత్యభోజనం, గృహం వగైరా అన్ని ఏర్పాట్లూ చేశాడు. అయితే ఆతని తరువాత మిగిలిన కుటుంబ సభ్యులెవరూ ఈ విషయానికి ప్రాముఖ్యత ఇవ్వలేదు. దాంతో ఆ రాజపుత్ర కుటుంబం నిజంగానే వీధుల్లో భిక్షమెత్తుకోవాల్సి వచ్చింది. వారి సంతతివారే ఈ మంగనియార్లని ఓ కథ ప్రచారంలోవుంది. ఉన్నత

శ్రేణి ప్రజలు, మధ్యతరగతి ప్రజలు కూడా వీరిని నిమ్నకులస్థులుగా, యాచకులుగా చూస్తారు. వీరిలో చాలా ఉపకులాలున్నాయి. దేగ్డా, సొనాలి, సన్‌జాత్, గున్‌సార్, డోలా, డాగా, జీనా, లంగా మొదలైనవి. లంగా మంగనియార్లు కేవలం ముస్లిం ఇళ్లలోని వేడుకలకి మాత్రమే పాటలు పాడతారు. ఔరంగజేబు సింహాసనం ఎక్కక పూర్వం వీరంతా హిందువులే అంటారు. చిత్రమయిన విషయమేమంటే వీరి ఆచార వ్యవహారాలలో సగం ముస్లిం పద్ధతికీ సగం




హిందూ పద్ధతికి చెందినవి.

ఔరంగజేబు వారిని బలవంతంగా ముసల్మానులుగా చేసినప్పటికీ వివాహ సమయంలో వారు హిందూ పద్ధతి ప్రకారం మంగళసూత్ర ధారణను పాటిస్తారు. అగ్ని చుట్టూ ప్రదక్షణ చేస్తారు. ముస్లింలకు మల్లే నిఖా కూడా జరుపుకుంటారు. స్త్రీలు సాంప్రదాయ హిందూ పద్ధతిలో వస్త్రధారణ చేస్తారు. ఓఢ్నా, కంచెలి, ఘాగరా, కుర్తా మొదలైనవి ధరిస్తారు. పురుషులు ధోతీ, అంగరఖా, కుర్తా వగైరా ధరిస్తారు. దారిద్ర్యం కారణంగా వారు ఆభరణాలు ధరించరు. హిందువులు కనిపిస్తే 'రామ్‌రామ్' అనీ, 'జయ్‌కృష్ణ' అనీ, ముస్లిములు కనిపిస్తే 'సలాం ఆలేకుం, ఆలేకుం సలాం' అనీ పలకరిస్తారు. భిక్షమెత్తడంలో వాళ్లెంత ఆరితేరినవారంటే వాళ్లు అడిగే పద్ధతి చూస్తే ఎవ్వళ్లూ ఏమీ ఇవ్వకుండా మాత్రం పంపలేరు.

గానకచేరీల్లో తుర్హీ, ఢోలు, నగడా, నౌబత్, కామసా, సారంగి, అల్‌గుజా, ధాలీ, తబలా, హార్మోనియం మొదలన వాయిద్యాలను ఉపయోగిస్తారు. స్త్రీ పురుషులందరూ పాటలు పాడతారు. అలాగే అందరూ కలిసి మద్యం సేవిస్తారు. గంజాయి, నల్లమందు వీరికి బాగా అలవాటు. ఎవరింటికి పాడడానికి వెళ్లినా ఆ ఇంటి యజమానిని బాగా పొగుడుతారు. పాట కచేరీ అయిన తరువాత స్త్రీలు ఆ యజమాని కోరితే, తగినంత ముడుపులు ముట్టచెబుతానంటే ఆ రాత్రికి అతనితో గడుపుతారు.

మంగనియార్లలో 2 శాతం ప్రజలు మాత్రం ఉద్యోగం, వ్యవసాయం చేసుకుంటారు. స్వాతంత్ర్యం వచ్చిన ఏభై ఏళ్లయినా వారి బతుకుల్లో ఎలాంటి మార్పూ రాలేదు. వారిలో చాలా కొద్దిమంది పోలీసు వృత్తిలోను, ఆర్మీలోను, గ్రామ సేవికలుగాను పనిచేస్తున్నారు.

వీరికున్న నృత్య, గాన కళను ప్రోత్సహిస్తూ వారి అభివృద్ధికి తోడ్పడి వారిని సంస్కరించే బాధ్యత ప్రభుత్వం తీసుకుంటే వారు కూడా జనసామాన్యంలో కలిసి సుఖంగా జీవనం సాగించగలరు. 

# 'మల్లెపందిరి'పై సమీక్షలు



**ఆగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి నవల 'మల్లెపందిరి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.**

## మనసులు మారాలి

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

మారుతున్న సామాజికార్థిక పరిస్థితుల్లో, కుటుంబ సంబంధాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. మనుషులు తమ సమయానికి మించిన పనుల్ని కల్పించుకొని అలసటని, నిరాసక్తతని పొందుతున్నారు. బాంధవ్యాలను, స్నేహాలను వికసింపజేసుకోడానికి తగిన తీరికని జీవితంలో సాధించుకోవాల్సిన అవసరం ఉంది. దీనివలన మానసిక ఒత్తిడులు, రుగ్మతలు తగ్గటమేకాక వ్యక్తిత్వ వికాసం జరుగుతుంది.

ఈ అవసరాన్ని 'మల్లెపందిరి' నవలలో పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తి మనసుకు హత్తుకునేలా మన ముందుంచారు. బాంధవ్యాలు మనకెంతో జీవాన్ని, భద్రతని ఇస్తాయని అవగతం చేశారు.

తన చెల్లెలు సత్యవతి ఆక్రందనకు వేదమూర్తి స్పందించి మేనల్లుడు సాయికృష్ణ తోడురాగా, బాంధవ్యాలని పునరుజ్జీవింపజేసే సద్భావనా యాత్ర చేపడతాడు. దూరదూరాన ఉన్న తమ సమీపబంధువుల దగ్గరకు వెళ్ళి అందరినీ ఒకచోట సమావేశపరచడానికి వాళ్లు చేసిన ప్రయత్నం ఆసక్తికరంగా సాగింది. వివిధ కుటుంబాలలో మనుషుల మధ్య ఆప్యాయతలు, విశ్వాసాలు ఇంకిపోయి తలెత్తిన వైరుధ్యాలను రచయిత చక్కగా చిత్రించారు. సంస్కృతిని సజీవంగా ఉంచే ప్రాణవాయువే ఈ బంధాలు. వృద్ధాప్యంలో అలక్ష్యానికి గురయే ఒంటరి పౌరులకు ఈ అనుబంధాలే రక్షణ కవచం.

బాంధవ్యాల ప్రాధాన్యతని వివరిస్తూ చివరన వేదమూర్తి చేసిన ప్రసంగం అందరూ నేర్చుకోదగిన పాఠంలా సాగింది. వేగమూ, ఒత్తిడీ పెరిగిన ఆధునిక జీవనంలో ప్రేమలు ఎలా నిలుపుకోవాలో దీనిలో చక్కగా సూచించారు. మానసిక అవసరాలని

తీర్చగల సమారాధన తంతులోని అంశాలు, బంధువుల వరసల గురించిన క్విజ్ మనల్ని ఆలోచింపజేస్తాయి.

వినీల్ ఆత్మహత్య చేసుకోకుండా బాంధ వ్యాలలోనే తన సమస్యకి పరిష్కారాన్ని అన్వేషిస్తే బావుండేది. వేదమూర్తి మర ణంతో కాక శ్రీదేవి పెళ్లితో ముగించినా నవల లక్ష్యం నెరవేరుతుంది. రచయిత కోరిన కుటుంబసంబంధాల పునరుజ్జీవనం జరిగి, అవి సామాజిక సంబంధాలను సైతం ప్రభావితం చేస్తాయనే ఆశాభావాన్ని ఈ నవల మనలో కలిగిస్తుంది.

-జి. శిశిర్‌కుమార్‌రెడ్డి,
హనుమకొండ-506 370

## మల్లెపందిరే

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

**సాం**కేతికంగా అభివృద్ధిని సాధించి, ప్ర పంచాన్నే చాలా సన్నిహితం చేస్తున్న వేగ మయ జీవన విధానాలు, ఆర్థికంగా అభివృ ద్ధి సాధించి, ఏదో అందుకోవాలనే తపన, ఉమ్మడి కుటుంబాలు, మానవ సంబంధా లు, వరుసలు, ఆత్మీయతలు మొదలగు స్మృతులను మరచిపోతున్న ఈ తరానికి రక్త సంబంధాల విలువను తెలియపరచటానికి పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తిగారి ప్రయత్న మే 'మల్లెపందిరి'.

ఈ చిన్న నవలలో మేనమామ వేదమూ ర్తి మేనల్లుడు సాయికృష్ణల ప్రయత్నం కుటుంబంలో సభ్యులందరికీ తమ తమ స్థానాలను, వరుసలను, వాటిలోని ఆత్మీయ తను, తృప్తి, బాధ్యతలు, బంధాలు, ప్రేమల ను తెలియచెప్పింది. ఆ ప్రయత్నంలో బంధా లను, బాధ్యతలను, ప్రేమలను, వరుసలను, తృప్తిని, ఆహ్లాదమయ జీవితాన్ని పోగొట్టుకు న్న, పోగొట్టుకుంటున్న తన కుటుంబస భ్యుల కుటుంబాలన్నిటితో వరుసగా ఒక యాత్రచేసి కలసి, చర్చించి, కలిపి రక్త సంబంధంలో ఉన్న గొప్పదనాన్ని రుచి చూపించి కృతకృత్యులైనారు.

కానీ ఒకటి రెండు పాత్రల అనవసర ప్రవేశం, కృష్ణమూర్తి కుమారుడు వినీల్ ఆకస్మిక ఆత్మహత్య, పెద్ద పాత్రను పోషించిన వేదమూర్తిగారి మరణంతో నవల ముగింపు నవలాకారుని ఆశయాన్ని ప్రతిఫ లింపచేయలేదేమో ననిపిస్తుంది.

ప్రస్తుతం ప్రేమరాహిత్యంలో మగ్గుతున్న కుటుంబాలన్నీ ఇలాంటి సద్భావనా యాత్ర లు ప్రారంభించి, తమ కుటుంబాలు చెట్టుకొక రు, పుట్టకొకరు కాకుండా, డబ్బు చుట్టూ తిరక్కుండా, పాశ్చాత్య నాగరికతా బంధనా ల్లో చిక్కుకోకుండా, భారతీయ సంస్కృతిని, అనుబంధాలని, బాధ్యతలను, ప్రేమలను పునరుద్ధరించటానికి కనీస ప్రయత్నం చేస్తా యని ఆశిద్దాం!

-జి. ప్రియంవద,
కడప-516 002

## మమతానురాగాలకు వారధి

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**మ**ధ్యతరగతి కుటుంబాల్లో ఆత్మీయతలకు, అనుబంధాలకు మచ్చుతునక ఈ మల్లె పందిరి. మనుషుల్లో సంకుచిత తత్వం, స్వార్థపరత్వం, ఈర్ష్యాద్వేషాలు పెరుగుతో న్న నేటి సమాజంలో ప్రతి ఇంటా- ప్రతిచోటా ఆత్మీయతాభావనలే లేక అక్కాచెల్లెళ్ళ, అన్న దమ్ముల మధ్య మమతానుబంధాలు లోపిస్తున్న నేటి తరంలో వేదమూర్తిగారి లాంటి, సాయికృష్ణలాంటి మనుషులు సమా జంలో మార్పుకు దోహదపడతారని చెప్పవ చ్చును. వ్యాపార సరళికలవాటుపడిన నేటి తరం ఎవరి పనుల్లో వారు, ఎవరి వ్యాపకా ల్లో వారున్న నేటి కుటుంబరంగం ఇంట్లో పిల్లలకు సరియైన క్రమశిక్షణనివ్వలేని కార ణంగా వారిలో యాంత్రిక జీవనం మొదలౌ తుంది. తల్లిదండ్రుల ప్రేమానురాగాలు పిల్ల




లకు కొరవడతాయి. అటువంటి పిల్లలు సంఘవిద్రోహులుగానూ, అక్రమ మార్గాలను సరించే వారిగాను తయారుకాగలరనుటకు 'వినీల్'లాంటి యువకులే సాక్ష్యం- అశ్లీల సాహిత్యాలు చదువుతూ, చెడు స్నేహాలతో తిరుగుతూ పిరికిమందు మనసులో పోసుకుని ఆత్మహత్యలకు పాల్పడతారు. వేదమూర్తిగారు కుటుంబరంగంలో కుటుంబాల మధ్య సయోధ్య పెంచే మనిషిగా, మానవతా మూర్తిగా, జ్ఞానిగా ప్రవర్తించిన తీరు కడురమ్యంగా, అద్భుతంగా వుంది. నేటి సమాజానికిది కనువిప్పుగా వుంది. విద్యనేర్పే గురువు క్రమశిక్షణతో నున్ననాడే విద్యావ్యవస్థ బాగుంటుంది. విద్యా వ్యవస్థ బాగుంటే నేటి కుటుంబ వ్యవస్థ కూడా క్రమశిక్షణతో నైతిక విలువలు తప్పక కుటుంబ భవితవ్యం పురోగమించగలరు. లేకుంటే కుటుంబంలో అవ్యవస్థ ప్రబలుతుంది. పందిరికి అల్లుకునే మల్లెతీగెలు పూసౌరభం ఎలా అందిస్తాయో విరిగిన మనసులకు, అతకని మనసులకు తన మమతామాలికల సౌరభాలను వేదమూర్తి అందించాడని చెప్పడంలో అతిశయోక్తి లేదు. అందర్నీ కలిపి అందరి మనసులను అలరించి ప్రయోజనకమైన పనులు చేస్తూ అందరితో తలలో నాలుకలా చరించి చరమదశలో అందర్నీ సుఖాల తీరాల్లోకి పంపి తను సుఖంగా తనువు చాలించిన వేదమూర్తి పాత్ర అద్భుతంగా మలిచిన రచయిత కడుఅభినందనీయుడు.

-యలమంచిలి శివాజీ,
విశాఖపట్నం-530 032

## ఆణిముత్యం

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

**ఆ**గస్ట్ చతురలో ప్రచురించిన 'మల్లెపందిరి' ఈమధ్య కాలంలో వచ్చిన నవలల్లో ఉత్తమమైనదిగా చెప్పవచ్చును. పులిగడ్డ శ్రీరామచంద్రమూర్తిగారు అభినందనీయులు. వేదమూర్తి కాత్యాయనిల పాత్రలు ఈ నవలకు ఆణిముత్యాలు లాంటివి. కథను చక్కటి మలుపులతో అక్కడక్కడ చదువరుల భుజాలు తడుముకునేటట్లు చేస్తూ తెలిసీ చేసే తప్పులను ఎత్తి చూపిస్తూ అవి సరిదిద్దుకునే విధానాన్ని చక్కని కథా సంవిధానంతో తెలియచేశారు రచయిత.

చాలా కుటుంబాలు తల్లీతండ్రి, అన్నాచెల్లెలు, కొడుకులు కూతుళ్ల మధ్య ఉన్న బాంధవ్యాలలో ఉన్న మాధుర్యాన్ని, అనుబంధాన్ని కోల్పోతున్నాయి. ఈ స్పీడు యుగంలో ఇవి మామూలే అని అనుకుని నిర్లిప్తంగా, నిర్వేదంగా గడిపేస్తున్నారు చాలామంది. అలాకాక ఒకరినొకరు గౌరవించుకుని ఆప్యాయతలు పంచుకుని ఉన్న టైములోనే అందరూ సరదాగా గడిపితే కలిగే ఆనందాన్ని వేదమూర్తి పాత్రద్వారా చాలా బాగా తెలియజేశారు రచయిత. ప్రయాణాల్లో స్వంత అన్నదమ్ముల, అక్కాచెల్లెళ్ల పిల్లలు కల్సి ప్రయాణం చేసినా ఒకరికొకరు ఫలానా అని తెలియకపోవడం వలన రాకపోకలు, ఉత్తరాల సంబంధాలు లేకపోవటం వల్ల అపరిచితుల్లా ప్రయాణం చెయ్యటం నేను ప్రత్యక్షంగా చూశాను. ఈ నవలలో ప్రతి సంఘటన నేడు ప్రతిచోటా జరుగుతున్నదే. వాస్తవానికి దగ్గరగా ఉండి ఎంతోమందికి కనువిప్పు కల్గిస్తుందీ నవల. బైండింగ్ చేయించుకుని అతి భద్రంగా దాచుకోవాల్సిన నవలను ప్రచురించి చతుర తన గొప్పదనాన్ని మరింత పెంచుకుంది. రచయితకీ, ప్రచురించిన చతురకు కృతజ్ఞులు చెప్పుకుంటూ ముమ్ముందు కూడా ఇటువంటి మంచి రచనలు అందజేసి యాంత్రిక జీవితంలో కొట్టుమిట్టాడుతూ ప్రతి విషయాన్ని వ్యాపారాత్మకంగా చూసుకుంటూ పోతున్న జనావళిలో కాస్తంతయినా కదలిక కలిగించాలని కోరుతూ సమీక్షని ముగిస్తున్నాను.

-జీడిగుంట ఉషారాణి
హైద్రాబాద్-500 067

# సహజత్వానికి దగ్గరగా

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

కథగాని, నవలగాని వాస్తవికతకు దగ్గరగా ఉంటే ఆ రచన విజయవంతం అయినట్టే. 'మల్లెపందిరి'కి సహజత్వమనే పెద్దపీటనే వేశారు రచయిత.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు సంబరంగా జరుపుకుంటున్న ఈ తరుణంలోనైనా మనం ఏం కోల్పోతున్నామో తెలియజేసి, దాన్ని ఎలా పొందాలో కూడా చెప్పారు రచయిత.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థ చాలావరకు అంతరించిపోయింది. మరికొన్ని రోజుల్లో పాశ్చాత్య దేశాలలోలాగా పిల్లలు ఒక వయసు రాగానే కుటుంబం నుండి ఎవరిదారిన వారు విడిపోయి కుటుంబ సభ్యులను స్నేహితుల్లా కలుసుకునే కల్చర్ దిగుమతి అయిపోతుందేమోనన్న భయంతోపాటు అదే జరిగితే ఇక 'కుటుంబం' అన్న పదం, ఆ వ్యవస్థ కూడా అంతరించిపోతాయేమోనన్న ఆందోళన కలుగుతున్న నేపథ్యంలో జీవితంలో అందరిని కలుపుకుంటూ ముందుకు ఎలా సాగిపోవాలో తెలియజేసిన రచన మల్లెపందిరి.

కుటుంబాలను కలిపే సద్భావనా యాత్రకు శ్రీకారం చుట్టిన యువకుడు సాయికృష్ణ, అతని తల్లితండ్రులు, అతని ఆశయానికి చేయూతనిచ్చిన వేదమూర్తి, కాత్యాయిని, డబ్బు సంపాదనలో పడి పిల్లలను నిర్లక్ష్యం చేసిన ఇతరుల తల్లితండ్రులు, ప్రేమలో విఫలమయిన చరిత, అశ్లీల సాహిత్యంలో మునిగితేలే చకిత, శీలం కోల్పోయిన అర్పితలు... వీరంతా మన చుట్టూ ఉన్న సమాజానికి ప్రతీకలుగా కన్పిస్తారు. వీరందరి మధ్య అమెరికాలో ఉంటూ కూడా భారతీయ నాగరికతను, సంప్రదాయాలను మర్చిపోని రాగచంద్రిక పాత్ర మంచి అనుభూతిని కలగజేస్తుంది.

తల్లితండ్రుల నిర్లక్ష్యానికి గురై ఆ ఒంటరితనంలో, ఆ ప్రేమరాహిత్యంలో చెడు అలవాట్లకు యువత బానిస అవుతోందన్న నిజం ఇకనైనా తెల్సుకుంటే మంచిదన్న హెచ్చరిక మల్లెపందిరిలో వ్యక్తం అవుతుంది.

అయితే కథలో పాత్రలు ఎక్కువ కావడం కొంచెం ఇబ్బందిని కలగజేస్తుంది. తాను మెడిసన్ స్టూడెంట్ అయి ఉండి కూడా గుడ్డిగా శీలం అర్పించి తద్వారా అబార్షన్ లాంటి స్థితి తెచ్చుకోవటం అసహజం అనిపించినా ప్రేమ పేరుతో మోసపోవద్దన్న హెచ్చరిక కన్పిస్తుంది. హఠాత్తుగా ప్రవేశించిన శ్రీదేవి పాత్ర నవలను సాగదీయడానికి సృష్టించిన భావన కలగజేస్తుంది తప్ప ఆ పాత్రపై ఎటువంటి ఆసక్తిగాని, ఉత్సాహంగాని కలగవు.

అందరిలో మార్పు వస్తున్న తరుణంలో వినీల్ ఆత్మహత్య, చివరలో వేదమూర్తి మరణం కొద్దిగా అసంతృప్తికి గురిచేస్తాయి. ముఖ్యంగా అందరూ ఆనందం అనుభవిస్తున్న సమయంలో ఆ పాత్రను అలా ముగించి నవలను విషాదం చేయడం ఎంతవరకు సమంజసం? అలాంటి ముగింపుతో అటు నవలలోని పాత్రలను ఇటు పాఠకులను కూడా బాధపెట్టారనే చెప్పాలి.

పూర్తిగా చదివిన తర్వాత ప్రతి కుటుంబం ఇలాంటి యాత్రను కనీసం సంవత్సరానికి ఒక్కసారైనా చేస్తే బాగుండన్న ఆలోచన కలిగించడంలో రచయిత కృతకృత్యులయ్యారు.

మల్లెపందిరి వేసిన రచయితకు, చతుర వారికి హార్దిక అభినందనలు.

-కె.బి.కామాక్షి
విజయవాడ-520 011

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే**
**ఆ పచ్చడి సంసి**

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,**(ప్రియా ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ **500 482**